# సిద్ధేశ్వరచరిత్ర-కాకతీయులనుగూర్చిన కొన్ని విశేషాంశములు

**శ్రీ కె. హెచ్. వి. శర్మ**

ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు శ్రీ సిద్ధేశ్వర చరిత్రము నిటీవల చక్కగా పరిష్కరించి ప్రకటించి, చరిత్రకారులందరికిని మహోపకారము గావించిరి. ఇది కాసె సర్వప్ప యను వానిచే సుమారు పదునారవ శతాబ్దమున ద్విపద కావ్యముగ రచింపబడినది. సర్వప్ప గొప్పకవిగాని మంచి చరిత్రకారుడు గాని కాడు. ఆంధ్రుల చరిత్ర ముఖ్యముగ ఓరుగల్లు రాజధానిగా పాలించిన కాకతిమహారాజులచరిత్రను వెనుక నేకామ్రనాథుఁడు వచించిన కథను తాను నేర్చిన విధమున దేశి కవిత్వమున రచియించవలెనను అభిమానము గలవాడు. తన కాలమున వాడుకలో నుండు పుక్కిటి పురాణములు, కట్టు కథలనుకూడ చరిత్ర పౌర్వాపర్యము లేక ఇందు గూర్చిపెట్టినాడు. వాటి నుండి అసలైన చరిత్రాంశములను కనుగొనుటయే మిక్కిలి కష్టము. శ్రీ లక్ష్మీరంజనముగారు తమ సంపాదకీయమున ఆ విషయము లన్నింటిని కడు సమర్థతతో చర్చించి ఆంగ్లమున విపులమైన పీఠిక నొకదానిని చేర్చిరి. నాకు దోచిన మరికొన్ని యంశముల నీ వ్యాసమున దెలుపగలను.

ప్రథమాశ్వాసమున ప్రమథు లందఱిచే ప్రార్థించబడినవారై పరమ శివుడు సిద్ధేశ్వరుడుగను, పార్వతీదేవి పద్మాక్షిగను యవతరించి హనుమకొండ సమీపమున గల గుట్టలపై ఈ సిద్ధ దంపతుల వెలయుట వర్ణించబడినది. ప్రమథులను గూడ భక్తజనులై యచ్చటనె యుండుడని ఆ పురాణ దంపతు లానతిచ్చిరట.

పరమసంతోషులై పార్వతీశ్వరులు
కరుణచేఁ బ్రమథులఁ గనుఁగొని "మీరు
నచట భక్తజనంబులై యుండుఁడేము
నుచితాకృతుల నట్ల యుండుదు" మనుచు
నప్పుడు సిద్ధేశుడయ్యె శంకరుడు
చెప్పి పార్వతి దాను సిద్ధేశు నెదుర
నుర్వీలోపలఁ దాను నొప్పుల కుప్ప
పార్వతి యెంతయుఁ బద్మాక్షి యయ్యె
ప్రమథ వర్గంబులు భక్తులై రచట"

హనుమకొండలో నిప్పటికిని పద్మాక్షిసిద్ధేశ్వరుల గుట్టలు రెండును గలవు. సిద్ధేశ్వర గుట్టపైన శిథిలమైన సిద్ధేశ్వరాలయము, లింగము, బావి మున్నగునవి గన్పించును. ఆ యాలయమున కెదురుగా శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు వెనుక భారతిలో ప్రకటించిన అన్నపూర్ణ శాసనకావ్యము చెక్కబడి యున్నది. ఆలయము వెనుక మరియొక శిలపై భైరవుని బోలి బహుశః సిద్ధేశ్వరుడే గావచ్చును చెక్కబడిగలదు. ఈ సిద్ధేశ్వరుని గుట్ట ప్రక్కనే పద్మాక్షిదేవి గుట్టయు నున్నది. కొండపైన పద్మాక్షి దేవాలయము, క్రిందుగ నొక కోనేరు పద్మాక్షి గుండమను పేర నిప్పటికిని గలవు. ఈ గుట్టపై ననేక జైనతీర్థంకరుల విగ్రహము లుండుట, పై దేవాలయములోని యక్ష, యక్షిణీ విగ్రహములు సమీపమున గల కన్నడ శాసనములో కాకతి రెండవ ప్రోలరాజు కాలమున నాతని మంత్రి భార్య మైలమ కడలాలయమున కిచ్చిన దానప్రశంసను బట్టి పద్మాక్షిదేవి జైన దేవతగ గుర్తించబడినది.

కాకతీయుల శాసనములలో నెచ్చటను ఈ సిద్ధేశ్వర ప్రశంస లేద నియు, కాకతి సామ్రాజ్య మంతమొందిన ఏ రెండు, మూడు శతాబ్దముల తదుపరి ఏకామ్రనాథుఁడను జైనసిద్ధుడు మొదటి మారీ సిద్ధేశ్వరుని కల్పించి వ్రాసినట్లు చాలమంది అభిప్రాయము.

ఏకామ్రనాథ విరచితమగు ప్రతాపచరిత్ర, సర్వప్ప సిద్ధేశ్వర చరిత్ర, కూచిమంచి జగ్గకవి సోమదేవరాజీయము వరుసగా నొకదాని కొకటి పుత్రికలు. కాకతి ప్రతాపరుద్రుడు, యాతని పూర్వులను గూర్చిన ప్రధాన విషయ మగుటచే తనగ్రంథమునకు ప్రతాపచరిత్ర యని ఏకామ్రనాథుడూ, శ్రీ సిద్ధేశ్వర మహాత్మ్యమున వెలసి యాతని కరుణన పెంపొందిన సామ్రాజ్య మగుటచే సిద్ధేశ్వర చరిత్రమని కాసె సర్వప్పయు, సోమదేవరాజ సంతతివారగు కాకతీయులవర్ణన గాన సోమదేవరాజీయమని జగ్గకవియు తమ తమ గ్రంథములకు నామము లిడినట్లు దెలియుచున్నది. ఏకామ్రనాథ విరచితమైన ప్రతాపచరిత్రములో పద్మాక్షి, సిద్ధేశ్వరుల యవతరణ మింత విపులముగ వర్ణించబడి యుండలేదు. సిద్ధేశ్వర చరిత్రమున ప్రమథులు పార్వతీపరమేశ్వరులను పద్మాక్షీ సిద్ధేశ్వరులుగ యవతరించమని ప్రార్థించుట మున్నగునవి కొంతవరకు సర్వప్ప కల్పితమే కావచ్చును.

కాకతిరాజుల శాసనములలో సిద్ధేశ్వరుని పేరింతవఱకు కాన్పించ కుండుట వాస్తవమే యైనను వారి కాలముననే ఈ సిద్ధేశ్వరు డవతరించి నట్లు శాసన, వాఙ్మయ ప్రామాణ్యము చాల గలదు. హనుమకొండలోని సిద్ధేశ్వరుని గుట్ట కనతిదూరముననే గల మరియొకగుట్టపై బ్రహ్మాండమైన చక్కని శాసన కావ్య మొకటి తెలుగు లిపిలో చెక్కబడి యున్నది. ఒకానొక మందర సిద్ధదంపతుల పరస్పరాలోకనము, శృంగార చేష్టలు, వియోగము, విప్రలంభము, వివాహము, సంభోగము మున్నగు అత్యద్భుత వర్ణనలతో గూడిన శృంగారరసభరితమైన చక్కని కావ్య మది. దానిని రచించిన కవి నృసింహుడట. ఈతని శాసనములు కొన్ని వరంగల్లు కోటలోని శంభుని గుడివద్ద కలవు. అందొకదానిని బట్టి ఈతడు రెండవ ప్రతాపరుద్రుని యాస్థానము నలంకరించి యుండెనని స్పష్టమగు చున్నది. కాదంబరీనాటకకర్త మరియు భాస్కర రామాయణ యుద్ధకాండ శ్వాసాంత గద్యములో పేర్కొనబడిన నృసింహుఁ డితడే యని వెనుక గుర్తించడ మైనది. కాకతి ద్వితీయ ప్రతాపరుద్రుని యాస్థానము లోనివాడగు నీతడు సిద్ధదంపతులను గూర్చిన అపూర్వ కావ్యమును రచియించుటను బట్టి కాకతీయుల నాటికే సిద్ధేశ్వరు డవతరించినట్లు స్పష్టము. విద్యానాథ విరచితమైన ప్రతాపరుద్రీయ నాటక ప్రకరణమున ప్రతాపరుద్రుని యభిషేకానంతర మనరవిష్ణువనెమున్న యాతనిని గాంచి పురోహితులు పలికిన శ్లోకము చూడుడు.

"విద్యావిద్యస్య పదాబ్జయోః శివయోః శ్చుర్యేశ్వరోపాస్యతాం
ప్రాణే మూవయుత ప్రవాహకులికా ఉద్వాహ లీలాం భువః
క్షేత్రే శారదపుండరీకరుచిరే లీలావతారం హరే
ఖ్యా తన్త్రదితిహ సిద్ధ వచనం ప్రత్యక్ష మీక్షామహే."

రత్నాపణ వ్యాఖ్యానమున కుమారస్వామి సోమయాజిట్లు దెల్పినాడు. "....శారద పుండరీకరుచిరే క్షేత్రే పుండరీకాక్షావతారమాఖ్యాతః కథయతః ఇతి యత్పూర్వోక్తం సిద్ధస్య కస్యచి దనాగత విదః పురుషస్య వచన మధునా ప్రత్యక్ష మీక్షామహే." కాకతీయుల నాటికే ఈ సిద్ధుని మాహాత్మ్య మందరికిని దెలియునను కిదియును నిదర్శనము కాగలదు. నరసింహుడు కావ్యరూపమున వర్ణించిన సిద్ధ దంపతులను గూర్చియే ఏకామ్రనాథుడు కొద్దిగ పేర్కొనియుండును. సర్వప్ప దానిని పెంచి చక్కని పురాణ పద్ధతిలో శివ పార్వతీ కల్యాణముతో గూడ తన ప్రథమాశ్వాసమున చేర్చి యుండును.

ద్వితీయాశ్వాసములోని కథామూలము నారంభించునపుడు సర్వప్ప ఇట్లు దెల్పినాడు :

"శ్రీ మహాదేవుని జిన్మయాత్మకుని
నా మహేశాముని నఖిల లోకేశు
శ్రీ శుభలింగంబు శ్రీ హన్మకొండ
శ్రీశమోచను సిద్ధపతి మతీ దలంచి
వేగంబ తన కమరాగంబుగాఁగ
నాగనాథుని యడుగులకు మొక్కి చాల
యతని యనుమతి నేకామ్రనాథుండు
మతిమీఱఁ జెప్పిన కథ నచించెదను."

దీనినిబట్టి ప్రథమాశ్వాసములోని శివపార్వతీ కల్యాణము శ్రీ సిద్ధేశ్వరావతరణము మున్నగునవి గొంతవఱకు దన కల్పితమే నని గూడ తెలియుచున్నది. నాగనాథుని యడుగులకు మ్రొక్కి యాతని యనుమతిని నేకామ్రనాథుడు చెప్పిన కాకతి రాజుల కథను నచించెద ననినాడు. తాను వ్రాసిన కాకతిరాజుల చరిత్ర యంతయు నేకామ్రనాథుడు పూర్వము రచించిన కథ ననుసరించినదే నని స్పష్టము. ఏకామ్రనాథుడు ప్రతాపచరిత్రను రచియించుటనుబట్టి యాతడు ద్వితీయప్రతాపరుద్రుని యాస్థానములోనివాడని కాకతీయ సంచికయందు తెల్పబడినది. కాని ఇది సరికాదు. సర్వప్ప ఏకామ్రనాథుని గురువుగ శైవ నాగనాథుని పేర్కొనినాడు. నల్లగొండజిల్లా అయిన నౌలి లోని రేచర్లవంశజుడగు అనపోత నాయకుని శాసన మొకదానిలో కాశ్యగోత్రజుడు పశుపతిపండితుని పుత్రుడగు సుప్రసిద్ధ నాగనాథుని యొకడు గలడు. ఆ శాసన కాలమునుబట్టి యాతడు క్రీస్తుశకము 1369 ప్రాంతము కాకతి ద్వితీయ ప్రతాపరుద్రుని యనంతరపు వాడని స్పష్టము. ఏకామ్రనాథునిగురువుగ గ్రహింపబడిన నాగనాథుడితడే యైనచో నేకామ్రనాథుడు ప్రతాపరుద్రుని యాస్థానమున నుండుట యసంభవము. బహుశః అతడు కాకతి సామ్రాజ్యమంతమొందిన పిదప నమారు పదినేనవ శతాబ్ద్యారంభమున నుండెనని తలంచవచ్చును.

ఓరుగంటి కోటలో మశ్త్రద్వారమునకు గల శాసన మొకదానిలో ననేక శాస్త్ర గ్రంథములను సంతరించినట్టియు, ప్రాగ్ధ్వగంధి గన్నచ్ఛిదుడగు నృసింహకవియే నొక్క దినమున కాకతీయ చరిత్రమునం దెనిమిది సర్గలు రచించబడినట్లున్నది.

"శాస్త్ర గ్రంథయుతా నృసింహ కృతినా ప్రాగ్ధ్వగంధి గన్నచ్ఛి దా
అస్మిన్ నేవ హి కాకతీయ చరితే తేషాన్తు తిష్ఠాః కృతాః."

ఈ నృసింహకవి పైన వివరించిన సిద్ధ దంపతుల కావ్యమును రచించినవాడు; రెండవ ప్రతాపరుద్రుని యాస్థానములోనివాడు. పై శాసన శ్లోకమును బట్టి కాకతీయ చరిత్రమును మొట్టమొదట వ్రాసినవాడితడే యని తెలియుచున్నది. వెనుకాలికు డగుటచే నీతని గ్రంథ మెంత యేని చరిత్రకారుల కుపయోగించెడిది. మనదురదృష్టముచే నింతవఱకది లభ్యము కాలేదు. ఈతని కాకతీయ చరిత్రమునకు, ప్రతాప, సిద్ధేశ్వర చరిత్రముల కేమి యైన పోలిక లుండునేమో తెలియదు.

శ్రీశైలప్రాంతారణ్య ప్రదేశములనుండి ఎఱుకు దేవరాజు అను శూరుడు వచ్చి హనుమాద్రి నాక్రమించి రాజ్యము చేయసాగెనట. వాని పుత్రులు అనుముడు, కొండడు, గర్గశేయ డనువారు వరుసగా మూటయారు సంవత్సరములు పాలించి గతించిన పిదప పద్మాక్షీదేవి వరప్రసాదమున కాకతి మహారాజులు ఏకశిలానగరమును నిర్మించి ఘన వైభవమున బాలించిరని గలదు. ఎఱుకదేవరాజు కుమారులగు అనుముడు, కొండడు యనువారి పేర ననుమకొండ పట్టణము నిర్మితమైన దను నైతిహ్య మిప్పటికిని స్థానికముగ నున్నది.

కాకతీయులు చంద్రవంశమువారని అత్రి, సుధాకర, బుధ, పురూరవ, భరత, పాండవ, పరీక్షిత్తు, జనమేజయ, శతానీక, క్షేమకులు పేర్కొనబడి వారివంశమునందు మూలపురుషుడగు సోమదేవరాజు జన్మించినట్లు గలదు. గణపతిదేవుని పాకాల, పాలంపేట మున్నగు శాసనములలో దీనికి విరుద్ధముగ వారు సూర్యవంశజులని, మనువు, ఇక్ష్వాకు, మాంధాత, సగర, భగీరథ, దశరథ, శ్రీరాములు వర్ణించబడి వారివంశమున నుద్భవించి కరికాలచోళ, దుర్జయుల యనంతరము కొంతకాలమునకు కాకతి ప్రోలరాజు జన్మించినట్లున్నది. విద్యానాథుడు ప్రతాపరుద్రీయమున కాకతీయ వంశమును గూర్చి అర్కాన్వయోద్భవులని, సూర్యసోమాన్వయులని వచించినాడు. వీనినిబట్టి కాకతీయుల వంశమును గూర్చిన వాదము లిప్పటికిని నమసిపోలేదు. గణపతిదేవుని పూర్వుల శాసనములలో నెచ్చట వారు సూర్య లేక చంద్రవంశపు క్షత్రియులని చెప్పబడలేదు. సరిగదా వారు దుర్జయుని సంతతివారని పేర్కొనబడిరి. శాసనములనుబట్టి దుర్జయులు సూర్యవంశపు క్షత్రియులనియు, చతుర్థవంశజులలో గూడ గలరని తెలియుచున్నది. బేత, ప్రోల మున్నగువారి శాసనములలో కేవలం దుర్జయుని సంతతివారని, మరియు వారికి చతుర్థవంశజులు, దుర్జయుని సంతతివారగు విర్యాల, మల్యాల మున్నగు వంశజులతో సంబంధ బాంధవ్యములు తెలుపబడినవి. దీనినిబట్టి ప్రథమమున వీరు చతుర్థవంశజులేయైనను కాలక్రమమున స్వంతరాజ్యమును నెలకొల్పి ఆంధ్రదేశము నంతటి నేకచ్ఛత్రాధిపత్యముగ నేలునప్పుడు ఇతర యనేక రాజవంశములతో సంబంధము లేర్పడి వీరుగూడా క్షత్రియులుగానే పరిగణించబడియుండురు. దాని కనుగుణముగ శాసన, వాఙ్మయ కవులు వీరికి క్షత్రియత్వము నారోపించి వంశవృక్షము నొకదానిని సృష్టించి సూర్యవంశమునకో, చంద్రవంశమునకో లేక రెండింటిని చేర్చి వర్ణించుట తటస్థించినది.

కందారపతియగు సోమదేవరాజునకు కటకబల్లహునకు అవులమంద మేపుట మూలమున జరిగిన యుద్ధవర్ణన కాటమరాజు కథను, అట్లే ఆ యుద్ధములో సోమదేవరాజు మరణించగా గర్భిణియగు వాని భార్య సిరియాలదేవి యనుమకొండకు పారిపోవుట, మాధవశర్మ యను బ్రాహ్మణోత్తముడామెను గాపాడుట, ఆమెకు మాధవవర్మయను బాలు డుదయించి పద్మాక్షీదేవి వరప్రసాదమున రాజ్యలాభము వడసె ననునవి కాకతీయుల మూలపురుషుని గూర్చిన కథలను తలపించుచున్నవి.

కాకతీయుల మూలపురుషుడగు మాధవవర్మకు ప్రత్యక్షమై రాజ్యమును ప్రసాదించిన పద్మాక్షీదేవి యిట్లు వర్ణించబడినది.

"..... కాళి భయంకరాకార
దేవభూసుత్రాత దేదీప్యమాన

బేతాళ శాకినీ ప్రేత పరివార
వ్రాత రాక్షస యక్షవర పరివృతయై
నెగడున్న పద్మాక్షి ...... "

ఈమెయే మొదట పార్వతి యవతారమని చెప్పబడినది. విద్యానాథుడు ప్రతాపరుద్రీయమున పలుచోట్ల ఈమెను గూర్చియే "కాకతీయ కుల దుర్గా దేవీ సమారాధనేన విజయ ప్రస్థానమంగళం కృత్వా" యనియు, రత్నాపణమునందు కుమారస్వామి సోమయాజి "కాకతిర్నామ దుర్గాశక్తి రేకశిలా నగరేశ్వరాణాం కులదేవత" యని చెప్పియుందురు. తరువాత విజయనగర శ్రీకృష్ణదేవరాయల సమకాలికుడు వోరుగల్లునుండి తురుష్కులను పార ద్రోలి స్వతంత్రముగ కొంతకాలము పరిపాలించిన బోయవంశజాడగు చిత్తాపఖానను సీతాపతిరాజు శంభుని గుడివద్ద గల శాసనమున నీమె శుంభ, నిశుంభ దానవ వంశనిర్మూలనకర్త్రి, కాకతి సామ్రాజ్య పీఠమునకు లక్ష్మి ప్రదమై వట్టిదియు ననాది జగన్మాత యని వర్ణించబడెను.

"దేవీ శుంభనిశుంభదానవ కుల ప్రోన్మూలనో జృంభణా
రంభా కాకతిరాజ్యపీఠకమలావాదిర్జగన్మాతృకా."

దీనినిబట్టి కాకతీయుల కుపాస్య యైన దేవత కాకతి లేక పద్మాక్షి కేవలము దుర్గాపరమేశ్వరియే యని తెలియుచున్నది.

మాధవవర్మ పుత్రుడు, పద్మసేనుడు; పౌత్రుడు వెన్నమరాజట. వీరినిగూర్చి మనకు శాసనాధారము లేమియు లేవు. ఆ వెన్నమరాజు పుత్రుడుగ పోరంకి వెన్నమరా జిట్లు వర్ణించబడెను.

"మొదకొని పోరంకి వెన్నమరాజు
పట్టాభిషిక్తుండై వరంగ రాజ్యంబు
మట్టుగాఁ జేయుచు మరలబడ్డట్టి
కటకబల్లహుఁ ద్రుంచి గాదిలి వాని
కటకంబునకు రాజుగాఁ జేసి మరుని
చేత సువర్ణంబు చేకొని కోట
లాతత జయకీర్తు లంది దిగ్విజయ
మాతలి రాజుల నందఱ గెలిచి
మరిమీఁద బురముకు మగిడి తా వచ్చి
డెబ్బది మూడేండ్లు తెలిఁ గొప్ప భూమి
గబ్బునఁదా నేలికొని పెండ్లిగుండ
రాజుకు రాజ్యంబు రమణగాఁ గట్టి
తేజుండై పోరంకి దేవ వెన్నుండు
రాజు దా శివలోక రాజంబు నొందె."

గూడూరుశాసనమున నితఁడే యనుపమ దుర్జయాన్వయమున సేనులు రాజనందముల తర్వాత నతిప్రసిద్ధుండై విరోధిమండలికి వెన్నుఁడు వలె పోరంటి వెన్న డుద్భవించెనని చెప్పబడినది.

"అనుపమ దుర్జయాన్వయ మహాబ్ధి సనేకులు రాజనందముల్
జనిన బోఱంటి వెన్నఁడను సంభవుఁడయ్యె నతి ప్రసిద్ధుఁడై
వినుత విరోధి మండలిక వెన్నుఁడు వెన్నుఁడ నోల నానికిన్
ఘనుఁడును వెజ్జ భూపతి జగద్వినుతుం డుదయించెఁ గీర్తితోన్"

కాకతి గణపతిదేవుని కొలనెన్ను తామ్రశాసనమున గూడ నీ పోరంటి వెన్నమరాజు ప్రశంస గలదు.

"దానే సూర్యసుతం ప్రతాపవిభవే శ్రీరామచంద్రం నృపం
దైర్యే మేరు మహీధరం హిమకరం కాంత్యాం కవిం తేజసి
ఐశ్వర్యే ప్రమథాధిపం యమసుతం ధర్మే బలే వాయుజం
రూపే పంచశరం విదుః పోరంటి వెన్నక్ష్మాపతిం పండితాః"

పోరంకి వెన్నమరాజు పుత్రుఁడుగ పెండ్లిగుండమరాజు పేర్కొనబడెను. వేంగి చాళుక్యరాజగు రెండవ అమ్మరాజు విజయాదిత్యుని మాగల్లు తామ్రశాసనమున పేర్కొనబడిన కాకర్త్యగుండన ఈతడే యని చరిత్రకారులు యూహించిరి. ఈ గుండరాజునకు యెఱుక దేవరాజని పుత్రుడొకడు గలడు. ఆతడు మిక్కిలి చిన్నవా డగుటచే వాని మేనత్త కుంతల దేవి సామ్రాజ్యంబు తా నేలుచుండి గుజరాష్ట్ర, మహారాష్ట్ర, ఘూర్జర, యవన రాజులపై దండెత్తి వారి నందఱిని జయించి యపారధనములు, అప్పనంబులు గొని జయస్తంభములు వేయించి యనుమకొండకు తిరిగి వచ్చు నంతలో బలాధికుడైన గటకబల్లహుడు పైబడుట యామె గంగిదేవుని సాయమున వానిని జంపి వాని పుత్రునట నిల్పి యెప్పటివలె మరల కట్నములను పొందెనని వర్ణించబడెను.

"ఎరుక దేవరరాజు డెంతయుఁ జిన్న
వీరబాలకుఁడు గాఁగ వాని మేనత్త
కుంతలాదేవన పంతతధర్మ
వంతన చతురంత వార యావాది
కాంత దిగంత విశ్రాంత యెంతయును
వంత సామ్రాజ్యంబు దా నేలుచుండి
గుజరాష్ట్ర మహారాష్ట్ర ఘూర్జర యవన
రాజులపై దొడ్డరయమున వెడలి
వారి నోడించి యపారిత ధనము
లప్పనంబులు గొని యా జయస్తంభ
మొప్పఁగ వేయించి యొగి నమ్మకొండ
నిప్పగు వీధుల నేంచేసి మగిడి
చనుదెంచు నంతలో సరసత నపుడు
ఘనబలాధికుఁడైన కటకబల్లహుఁడు
ఘుఱిలంగఁ బడ్డఁ నా మనుజేశు నపుడు
కరిహయ భటులతో ఘనబలముఁ గూర్చి
రాణి గంగిదేవు రాజునకును
బాణెంబుగా దళనాయకుఁ జేసి
పంపుటయును వాఁడు బల్లహుతోడ
చంపి దావుదుచేసి ? జగడంబు లపుడు
అరు నెలలు చేసి యాతని ద్రుంచి
బోరున నట వాని పుత్రుని నిలిపి
యెప్పటివలెఁ దమ యప్పనంబులును
కుప్పలుగాఁ దెచ్చి కుంతలదేవి
కిచ్చినంతట మెచ్చి పచ్చెంబు లేక
పందొమ్మిదేండ్లు దా భరమూని రాజ్య
మందు నెరుకుదేవు కపుడు పట్టంబు
గట్టి తాను శివుఁ గలయుంగఁ జనియె."

పై నుదహరించిన గూడూరు శాసనములోని ఈ క్రింది పద్యములో ఈవిషయమే వివరించబడినట్లు గాన్పించును.

"అరుదగునట్లు ఎఱ్ఱివు వంగ నగాముమసాని యొకమే
ల్గరుడని బేతభూనిఖుని గాకతివల్లభు లియనాని దా
జరగంగ జేతబట్టి ఘనుఁబల్లహుఁడాయని తోఁగి మెచ్చి భా

భాస్కర విభు చక్రవర్తి గని కాకతి నిల్పుట గోల్ల సేయదే?
కారక కాలుడై వడసె గాడయ నాయకు జంపి మూర డ
వ్వేలుపుగొండ రవ్వప్పు వేలుపు గొండవనిల్పి వానిచే
మేలుగ మూడ ముప్పయిని మేలుగ సేరెడు బోటి పాడునుం
మేలుగ టేకు మావిడులు మేలుగ రెండెయురాజు పంగడుల్."

ఈ పద్యములకర్థము పసిగాలేదని పండితులు చరిత్రాకారులు యందరి పద్యములభముకూర్చి, మార్చి తలకొక విధమున తలంచియున్నారు. నాకుతోచిన యర్థమేమన విరియాల ఎఱ్ఱినృపునిభార్య కామసాని కాకతి వల్లభుడగు ఆ పిన్న బేతరాజుని చేరదీసి భాస్కరవిభుని (మారుడనువానిని) గనుటచే ఘనుడగు బల్లవ రాయునితో ప్రతిజ్ఞచేసి జయించి కాకతిరాజ వంశమును నిల్పుటకోటకాదా? రెండవ పద్యమున పై విరియాల కామసాని, ఎఱ్ఱినృపుల పుత్రుడగు మారుడు కారకకాలుడై కాటయ నాయకుని జంపి వేలుకొండ రవ్వప్పుని వేలుపు కొండనే నిల్పి వానిచే నేరుడుబోటిపాడు, టేకుమావిడులు, రెండెయుర్రాజ పంగడులు మున్నగునవి మేలుగ పడసెను. ఇందలి మారడే పై పద్యమున భాస్కర విభుని చెప్పబడినాడు. ఈపద్యములోని భొట్టు, పిన్న, రవ్వ యన్నియు కాకతి బేతరాజునకు విశేషణములు. కామసాని ప్రతిజ్ఞచేసిన ఘనుడగు పల్లవ రాయడే క్రిందిపద్యమున ఆమెపుత్రుడు మారుడు చంపిన కాడయనాయకుడు. దీనినిబట్టి బాలుడగు కాకతి మొదటి బేతరాజు ప్రబలమగు శత్రువులచే నెదిరించబడి చాల అసహాయస్థితిలో నుండగా విరియాల మారుడు తానండగా నుండి యాతని శత్రువులను జంపి మరల వానిని రాజ్యమునందు సుస్థిరముగ నెలకొల్పెనని తెలియుచున్నది. ఇట్టిసహాయము చేయుటకుగాను కాకతీయుల కును విరియాలవారికిని యెద్దియైన సంబంధము యుండవలెనుగదా! గూడూరుశాసనమున విరియాల వంశజుల మూలపురుషుడుగ పోరంటి వెన్నడు చెప్పబడెను. గణపతిదేవుని కోలవెన్ను తామ్రశాసనమున, ప్రతాప, సిద్ధేశ్వర చరిత్రములయందు పోరంటి లేక పొలికి వెన్నమరాజు కాకతీయుల మూలపురుషుడుగా వర్ణించబడెను. ఇట్లు కాకతీయులు, విరియాలురుకూడ ఈ పోరంటి వెన్నమరాజునే తమతమ మూలపురుషునిగ చెప్పుకొనుటను బట్టి వారిరువురకును గల నికట బంధుత్వము స్పష్టమగుచున్నది. ఈ యంశములనుబట్టి సిద్ధేశ్వరచరిత్రములోని కుంతలదేవియే విరియాల కామసాని యనియు యెఱుక దేవరాజే మొదటి బేతరాజని యూహించవచ్చును.

గూడూరు శాసనమున "వేలుపుగొండ రవ్వప్పు వేలుపుగొండవ నిల్పి" యనుటచే కాకతిమొదటిబేతరాజు రాజధాని నగరము వేలుపుకొండ యనగా నిప్పటి వరంగలు తాలూకాలోని జఫర్‌ఘడ్ లేక పెరుగుట్టయని దెలియుచున్నది. ఖాజీపేట శాసనమునుబట్టి రెండవబేతరాజు కాలమున సమునకొండ విషయమును బాలించుటకు పొందినప్పుడు అనుమకొండ రాజధానియై యుండును. గణపతిదేవునికాలమున మరల యనుమకొండనుండి ఓరుగల్లునకు మార్చబడినది.

సిద్ధేశ్వరచరిత్రమున పేర్కొనబడిన భువనైకమల్లుడు త్రిభువనమల్లుడు వరుసగా మొదటిప్రోలరాజు, ఆతనిపుత్రుడు రెండవబేతరాజు అని గుర్తించిరి. కాని ఖాజీపేట శాసనము, రుద్రుని యనుమకొండశాసనములనుబట్టి త్రిభువనమల్లుడు రెండవబేతరాజు కాడనియు నాతనిపుత్రుడగు దుర్గరాజనియు, ఆత్రిభువనమల్లదుర్గరాజు పుత్రుడే రెండవ ప్రోలరాజనియు తెలియుచున్నది. బహుశః సిద్ధేశ్వర చరిత్రమున వొక్కపురుషాంతరము విడిచి పెట్టబడినట్లున్నది.

రెండవ ప్రోలరాజు స్వతంత్ర కాకతి సామ్రాజ్యమును స్థాపించినవాడు. ఈతడు కట్టించినవిగ వర్ణించబడిన శివాలయ, తటాకాదులు శాసనములను బట్టియు విదితమగుచున్నవి. కాశేశ్వర నామమైన రామారణ్యం గూర్చి ప్రథమమున నీతనికాలమున ప్రశంసించబడినది. ఖాజీపేట, మాధిరెడ్డికుంట, వేయిస్తంభాలగుడి శాసనములలో పేర్కొనబడిన శ్రీశైల మల్లికార్జున మహాచార్యులు కాలాముఖశైవసంప్రదాయమునకు జెందిన సుప్రసిద్ధ రామేశ్వర పండితు డీతడే యని స్పష్టము. ఈ ప్రోలరాజునకు స్వర్ణవేదిలింగ వృత్తాంతమొకటి కల్పించబడినది. ఇది ధూర్జటి శ్రీకాళహస్తి ... లింగించిన సీసలోహములను బంగారముగ మార్చు పరుసవేది వృత్తాంతము వంటిది.

ప్రోలునకు గన్పించిన ఆ స్వర్ణవేదిలింగమూర్తి యిట్లు వర్ణింతబడెను.

"........ దేదివ్య
మానతేజమ్మూర్తి మహనీయ దివ్య
మానవ శరచ్చంద్ర మందారకంద
మాన సితాంభోజ మందరాహార
తారహార పటీర ధారధళ్య ప్ర
సార విస్ఫార కాంతుల నరన మగుచు
దివ్య మంగళమూర్తి తేజః ప్రమూర్తి
నవ్య పాండురమూర్తి నాలింగమూర్తి
బరుసవేది మూర్తి భక్తహితార్థి."

ఇదియే యాతనిచే ప్రతిష్ఠించబడి తదుపరి కాకతీయు లందరికిని కులదైవ మనబడు శ్రీ స్వయం భూదేవుడు. ఆతని పుత్రుడు మొదటిరుద్రదేవుని శాసనములలో 'శ్రీ స్వయంభూదేవ శ్రీపాద పద్మారాధక' యని గలదు. విద్యానాథుడు ప్రతాపరుద్రీయమున పలుమారు శ్రీ స్వయంభూదేవుని వారి కులస్వామిగ పేర్కొనుటయేగాక యాతడే కాకతిసామ్రాజ్యమంతటికిని మహారాజు లేక సార్వభౌముడనియు కాకతిరాజులు తాతని సామంతులు మాత్రమే నని వచించినాడు.

ప్రతాపరుద్రః—

"స్వయంభూస్సత్ర ఇత్యేతా విశ్వకో దివ్యమానుషో
తయో రన్యతరో రాజా యువరాజోఽపి సర్వథా."

మంత్రిణః—రాజపుత్ర! సాధారణోఽయం వినయః కాకతీశ్వరాణాం స్వయంభుని మహారాజే.

పరిజనః—కాకతీయకుల స్థవిర స్మర్తభవాన్ స్వయంభూదేవో భురం ధారయతు. రాజపుత్రః పునః రాజ్యశ్రియ మంశే ఆరోపయతు."

రత్నాపణ వ్యాఖ్యానమున కుమారస్వామిసోమయాజి కూడ అట్లే తెల్పినాడు.

"తర్హి తావత్స్వయంభూదేవనేవ మహారాజోఽస్తుః పూర్వవ దేవాహం యువరాజ ఏవేతి వదన భంగ్యా రాజ్య మంగీకరోతి."

దీనికి తగినట్లు కాకతిరాజులశాసనములలో "శ్రీ స్వయం భూదేవ దివ్య శ్రీపాద పద్మారాధకు"లని చెప్పబడినది. ఇది పశ్చిమ చాళుక్యుల శాసనములలో వారి సామంతులు, రాజకుమారులు వర్ణించబడు "శ్రీమత్త్రిభువన మల్లదేవర దివ్య శ్రీపాద పద్మారాధక" ము వంటిది. ఇట్టి యాచారము పూర్వపు రాజవంశములలో గొన్నిట గన్పించును. తూర్పు గాంగ వంశపు రాజులు, వారి యనంతరము సింహాసనము నధిష్ఠించి అద్వితీయ బల పరాక్రమముచే నాటి హిందూదేశ సార్వభౌమ లందరిలో వ్యగ్రగణ్యుడైన గజపతి కపిలేశ్వరుడు గూడ వారు పూరి జగన్నాథదేవుని సామంతు లనియు, నాతని దివ్యశ్రీపాద పద్మారాధకులని వారి శాసనములలో చెప్పుకొనిరి. విజయనగర రాజుల తామ్రశాసనములో చివర గన్పించు 'శ్రీ విరూపాక్ష' కూడ ఇటువంటిదే.

శాసనములలో తఱుచు గన్పించు ప్రోలరాజు పుత్రులో రుద్ర, మహాదేవరాజు మాత్రమే పేర్కొనబడిరి. ఇందు రుద్రుడు దుర్జయహార్తముగ జన్మించినట్లు, మహాదేవరాజునకు మహారాజ్యభోగము కలదని వర్ణించ

బడెను. రుద్రుడు తండ్రిని చంపిన గాథ కేవలము కల్పితమే కావచ్చును. బహుశః ప్రోలుడు దీర్ఘకాలము పాలించుటచే తండ్రి కొడుకుల మధ్య నేర్పడ్డ యేదైన వివాదము సంభవించెనేమో! తండ్రిని చంపిన పాపమును బాపుకొనుటకు రుద్రుడు బ్రాహ్మణులను గాశికి పంపుట, వారిచే గంగాజలముల స్నానము, నైవేద్యము, పితృతర్పణములు చేయించెనని గలదు.

"మూర్వురు బ్రాహ్మల వేర్వేర పిలిచి
సర్వ సౌభాగ్యంబు సంప్రీతి నిచ్చి
కాశికిఁబంపించఁ గాశి విశ్వేశు
బాసి గంగాంబులఁ జేసి మజ్జనము
లోసి పాపము లటుఁ బాపి చనంగఁ
జేసి నైవేద్యంబుఁ జేసి తర్పణము
జేసిరి పితృసమర్పణముగా ద్విజులు."

పితృదేవతల సంతర్పణార్థము కొంతమంది బ్రాహ్మణులను నిజముగ నీతడు కాశీ, గయాది క్షేత్రములకు పంపియుండును. గయలో దొరకిన రుద్రదేవుని శాసన మిందులకు తార్కాణము కాగలదు.

రుద్రదేవుని పుత్రుడు గణపతి యని సిద్ధేశ్వరచరిత్రమున చెప్పబడినది. గణపతిదేవుని ఉప్పరపల్లి శాసనమున నాతడు రుద్రుని పుత్రుడనియే గలదు. కాని గణపతిదేవుని, ఆతని సంతతివారి తదితర శాసనము లన్నిట నాతడు రుద్రుని తమ్ముడగు మహాదేవరాజు, బయ్యమాంబల పుత్రుడనియే స్పష్టముగ నున్నది. రుద్రదేవుడు తనకు సంతానము లేకపోవుటచే బహుశః తమ్ముని పుత్రుడగు గణపతినే వారసునిగా భావించి చిన్నతనము నుండియు అభిమానముతో పెంచియుండవలెను.

రుద్రుడు తన తండ్రిని చంపి రాజ్యమునకు వచ్చెనని వర్ణించినట్లే మహాదేవరాజు అన్నను జంపి రాజ్యమునకు రాదలంచెనని చెప్పబడినది. హేమాద్రి వ్రతఖండమునుబట్టి రుద్రదేవరాజు జైతుగి చేతిలో మరణించినట్లు స్పష్టము.

త్రిల్లింగాధిపతేః యశోర్వినశనం రుద్రస్య రౌద్రాకృతేః
కృత్వా పూరుషమేధ యజ్ఞ విధినా అబ్జ త్రి్లోకీ జయః.

రుద్రుని యనంతర మాతని తమ్ముడు మహాదేవరాజు మూడేండ్లు పాలించినట్లు గలదు. కుందవరము మున్నగు పనేక శాసనములలో గూడ నాతడు కొద్దికాలము రాజ్యము పరిపాలించినట్లే యున్నది.

తస్మా దనంతరం తస్య మహాదేవో మహీపతిః
అనుజో మనుజాకార మహాదేవో మహీమధాత్.

శంభునిగుడివద్ద గల శాసన మొకదానిలో నీతడు దుర్లభము, సకల సమ్మత సంపదాశ్యమునైన చతురస్త్ర ధరాధిపత్యమును చిరకాలమునకు పొంది నప్పటికి దానిని తృణముగ భావించి సాంబశివుని శ్రీపాదపద్మ పరిపూజన తత్పరుడాయెనని యున్నది.

లబ్ధ్వా చిరాయ చతురస్త్ర ధరాధిపత్యం
యోదుర్లభం సకల సమ్మత సంపదాశ్యం
మత్వా తృణాయ తదశేష మముష్య శంభోః
శ్రీపాదపద్మ పరిపూజన తత్పరోభూత్.

అట్టి శాంతుడు రాజ్యమునకై అన్నను చంపెననుట తలంచరాదిగా నున్నది.

మహాదేవుని యనంతరము గణపతిదేవుడు రాజయ్యెను. ఓరుగంటికి ప్రాకారాలు కట్టించెనని గణపతి సేనాపతి నిర్మించినట్లు గలదు.

అనుమకొండనుండి రాజధాని నీతడే గిరిదుర్గమగు నోరుగల్లునకు మార్చివేసెను. వెనుక తమతాత ప్రోలరాజుచే ప్రతిష్ఠింపబడి తమకుల దైవమైన శ్రీ స్వయంభూదేవుని ఆలయముతో సమానమగు మహిమా వైభవములు గల వేరొక శివాలయమును దన పేరుతో గణపేశ్వరాలయమని యోరుగల్లులో నిర్మించినట్లు విద్యానాథుని ప్రతాపరుద్రీయమును బట్టి తెలియు చున్నది.

"యస్య ప్రద్యోత్ర మహత్తరస్య జగతాం త్రాతు స్వయంభూ విభో
స్తత్రా ద్యుష్కరితాద్యుతై ర్మహిమభి స్స్వస్మిం ర్ద్వితీయో భవత్
దేవోఽసౌ గణపేశ్వరః ప్రతికలం స్ఫార ప్రసాదోన్ముఖో
పుష్ణాతు కులమండనస్య మహతీం పుష్ణాతు రాజ్యశ్రియం."

గణపతిదేవుని యాస్థానమునకు తిక్కన సోమయాజి రాక; అక్కన బయ్యన లనువారు నెల్లూరి రాజ్యము నాక్రమించి మనుమసిద్ధి రాజును రాజ్యభ్రష్టుని జేసిరని యాతడు విన్నవించి, తమ రాజునకు మరల రాజ్యము ప్రసాదింపుమని వేడుట; గణపతిదేవుడు దక్షిణదేశముపై దండెత్తి అక్కన, బయ్యనలను పారద్రోలి మనుమసిద్ధిని మరల సింహాసనమునందు ప్రతిష్ఠ చేయుట వర్ణింపబడినది. గుంటూరుజిల్లా బాపట్లతాలూకా నాయనిపల్లిలోని కాకతి గణపతిదేవుని శిలాశాసనమును బట్టి ఇందలి యథార్థము గొంతవఱకు దెలియుచున్నది. సుప్రసిద్ధ శైవాచార్యుడగు శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల వద్ద గణపతిదేవుడు శివదీక్ష గైకొని నిత్య పూజాది విధులకు పదునొకండు గ్రామములను ధారవోసినట్లున్నది. మాల్కాపుర శాసనమున నాతడు గోళగి మఠాచార్యుడు ధర్మశంభుని పుత్రుడగు శ్రీ విశ్వేశ్వర శంభువు వద్ద దీక్ష గైకొనినట్లు తెలియుచున్నది.

త్వంగత్సింగజటాకిరీట ముదయస్మేరారవిందాననం
ముక్తాకుండలతాడితాంసశిఖరం హారై ర్మనోహారిణం
విద్యా మండపవర్తినం గణపతిక్ష్మాపాల దీక్షాగురుం
శ్రీ విశ్వేశ్వర శంభు మీక్షితవతాం తే చక్షుషీ చక్షుషీ.

మరియు పనేక శాసనములలో శ్రీ విశ్వేశ్వర శంభువు 'రాజ గురువని' పేర్కొనబడినాడు. మల్కాపురము మున్నగు శాసనములనుబట్టి గణపతిదేవుడు శివాలయముల కిచ్చిన యనేక గ్రామములు తెలియుచున్నవి.

గణపతిదేవుని కాలమున సిద్ధుడొకడు యాతని వద్దకు వచ్చి యనుమకొండ మాహాత్మ్యమును వివరించి కొన్నినే ళ్ళనుండి తా నప్పటి బిలములో నుండి కొద్దికాలము క్రితము భూసంచారార్థమై బయలుదేరి సకల దేశము లను జూచి యిప్పుడే తిరిగి వచ్చినట్లు, యోగతాప మెక్కువగ నుండుటచే మంచి ఆవుపాలు త్రాగినగాని ఉపశమన మొంద దనుట, గణపతిదేవుడు వెంటనె మూరు ఆవుల పాలు పిండించి వానికిచ్చి యాతని దాహమును తీర్చె ననియు, తదుపరి ఆ సిద్ధుడు మిక్కిలి సంతసించి గణపతి దేవునకు ననుమకొండ లోనిబిలము, కేదార తీర్థము మున్నగునవి జూపి తీర్థస్నానాదులను చేయించెనని వర్ణింపబడెను. రెండవ ప్రతాపరుద్రుని యాస్థాన విద్వాంసు డగు నృసింహ, విద్యానాథులు ప్రశంసించిన సిద్ధు డితడే కావచ్చును.

గణపతిదేవుని యనంతర మాతనిభార్య రుద్రాంబ సింహాసన మధిష్ఠించెనని గలదు. ఆమె యాదవుల యింటి ఆడుబిడ్డ యట. కుమారస్వామి సోమయాజి రత్నాపణవ్యాఖ్యానమున మొదట ఆమె గణపతిదేవుని భార్యయని చెప్పినట్లే గలదు.

"పురాకిల కాకతికులసంభూతే గణపతినామ్ని మహారాజే దుహితృమాత్ర సంతానే క దాచిద్దైవ యోగేన కాల పరిపాకముపేయుషి తన్మహిషీ రుద్రదేవి నామరాజ్ఞీ బహుని వర్షాణి తద్రాజ్య మకంటకం పరిపాల్య పరిణతానతి దౌహిత్రే ప్రతాపరుద్రే రాజ్యధురా నిదధే."

విశేషయుతగు మార్కొపోలో గూడ ఆమె గణపతిదేవుని విధవ భార్య యనియే చెప్పినాడు. కాని గణపతిదేవుని యనంతరము సింహాసనము నధిష్ఠించిన దాతని పుత్రికయగు రుద్రమదేవి యనుటకు చాలినంత శాసన వాఙ్మయాధారము గలదు. కుమారస్వామి సోమయాజియే పై నుదహరించిన వ్యాఖ్యాన శ్లోకము క్రిందను, "రుద్రాంబాయాః పితరో సోమాంబా గణపతి దేవః. తయో రుమామహేశ్వరాత్మకత్వం లోకవిదితం" అని వచించినాడు. ఇట్లు పరస్పర విరుద్ధమైన విషయముల నాతడెట్లు పేర్కొనెనో తెలియుట లేదు. ఇది చరిత్రాంశములు తెలియని పరిష్కర్త లెవరో చేసిన పొరపాటని సించును. శ్రీ ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు గణపతిదేవునకు రుద్రాంబ యను భార్య, పుత్రికయు గూడ యుండవచ్చునని సమన్వయము చేసిరి.

రుద్రాంబ కాలమున నామె యోరుగల్లులో లేని సమయమున హరిహరదేవ, మురారిదేవు లనువారు యోరుగంటిపై బడ్డట్లు, రుద్రాంబ వారిని కఠినముగ శిక్షించెనని గలదు. ప్రతాపచరిత్రమున వీ రామె సవతి సోదరులని యున్నది. గణపతిదేవుని ఏకామ్రనాథశాసనమున కాకతి రుద్రదేవునకు మహాదేవరాజు గాక ఇంకను మరి ముగ్గురు సోదరులు గలరని తెలియుచున్నది. ఈ హరిహరదేవ, మురారిదేవులు బహుశః వారి సంతతిలోని వారు కావచ్చును. దేవగిరి యాదవరాజులతో రుద్రాంబ యుద్ధము వర్ణించబడినది. హేమాద్రి వ్రతఖండమును బట్టియు నిది స్పష్టము.

అయం శిశు స్త్రీ శరణాగతానాం
హంతా మహాదేవ నృపో న జాతు
ఇత్థం వివిశ్చిత్య తతో ఒతిభీతై
రంధ్రై: పురంధ్రీ నిహితా నృపత్వే

సిద్ధేశ్వర చరిత్రమున కాకతి రుద్రాంబ జయించినట్లు, హేమాద్రి వ్రతఖండమున యాదవులు జయము పొందినట్లును వర్ణించబడెను. ఇరువురకు నేమైన సంధి జరిగియుండును.

రుద్రాంబ గణపతిదేవుని భార్య యనినట్లే ముమ్మడాంబ యాతని కుమార్తె యనియు నామె భర్త చాళుక్య వీరభద్రుడనియు చాల విరుద్ధముగ సిద్ధేశ్వరచరిత్రకారుడు తెల్పినాడు.

రుద్రాంబ తనకుమార్తె ముమ్మడాంబకు వంశ వర్ధనుడగు పుత్రు డుదయించవలెనని చేయించిన యశ్వమేధము, ఇలవేల్పగు కాకతిదేవి కర్పయింపగు జాతరులు, ఒడ్డెవల్లిలోని గణపతికి గుడహోమము, మోదకముల నివేదన, మొగిలిచర్లలోని ఏకవీరాదేవిని గొల్చుట, అనుమకొండ సిద్ధేశ్వరుని స్వర్ణపుష్పముల బూజించుట, పద్మాక్షిదేవికి నిత్యోత్సవ, సంతత జాతరలు, బ్రాహ్మణులకు సదా సమారాధనలు, వ్రతములు మున్నగునవి చాల చక్కగా వర్ణించబడినవి. తదుపరి ముమ్మడాంబ దోహదలక్షణములు, ప్రతాపరుద్ర జననము కావ్యరీతిలో సర్వప్ప యద్భుతముగ వర్ణించెను. అవ్వ రుద్రాంబ పురిటిల్లు సొచ్చి యా పత్తుల బిడ్డనే యెత్తుకొని పోయి కాకతి సామ్రాజ్య సింహాసనమున బవ్వళింపజేసి యానందపరవశురాలైనదట.

"తగరుద్రమాదేవి తగ పురుటింటి
కొగి వచ్చి సుతుఁ జూచి ......
...... తెచ్చి సింహాసనంబు మీఁదటను
తలుకుఁ బొత్తులఁ దగఁ దానమర్చి
పవ్వళింపఁగఁ బెట్టి యవ్వతా నపుడు
నవ్యము నానంద రసమగ్న యగుచు."

ప్రతాపరుద్రునకు అన్నమదేవుడను తమ్ము డొకడు గలడని యున్నది. బస్తరు రాజ్యమునందలి దంతేశ్వరాలయమున గల 18 వ శతాబ్దినాటి శాసనములలో ఆ రాజులు తాము కాకతిరెండవ ప్రతాపరుద్రుని తమ్ముడగు అన్నమదేవుని సంతతివారమని పేర్కొనబడిరి.

సిద్ధేశ్వరచరిత్రకారుడు ప్రతాపరుద్రుని తల్లి ముమ్మడాంబ యని స్పష్టముగ చాలచోట్ల పేర్కొనినాడే గాని తండ్రిని గూర్చి యంతగా తెల్పలేదు. రుద్రాంబ గణపతిదేవుని భార్య యనినట్లే, ముమ్మడాంబ భర్త చాళుక్య వీరభద్రుడని తప్పుగా వచించినాడు. ప్రతాపరుద్రునితండ్రిని గూర్చిన వివాదములు పెక్కు గలవు. ప్రతాపరుద్రీయమున విద్యానాథుడు ప్రతాపరుద్రుని తండ్రి మహాదేవరాజనియు, తల్లి ముమ్మడాంబ యని కంఠోక్తిగనే చెప్పినాడు. రత్నాపణ వ్యాఖ్యానమున కుమారస్వామి సోమయాజి కూడ దానినే సమర్థించినాడు. శివయోగసారమున "అకుపిత రుద్రమాంబికకు నాత్మజయౌ బొగడొందు ముమ్మడ, మ్మకు మహాదేవరాజునకు నాత్మజుడైన ప్రతాపరుద్రుడు" నియే గలదు. కాని ఈ మహాదేవరాజెవ్వడనునది తెలియుట లేదు. మైసూరు రాష్ట్రమందలి తుముకూరులోని ముకుకుంటి యుగ్రహార మునగల తామ్రశాసన మొకదానిలో నీ మహాదేవరాజు కాకతి వంశజునిగ పేర్కొనబడెను.

"తాం పురిం పోరుగల్లాఖ్యాం పాసన ద్రాజ పల్లభః
కాకతీయ మహారాజ వంశ దుగ్ధాబ్ధి చంద్రమాః
మహాదేవ ఇతిఖ్యాతో రాజా సర్వ గుణాన్వితః
సోవ్యమాం శంభువత్కన్యాం ముమ్మడాంబాం మనోరమాం
భూధరేంద్ర సుతాం స్నిగ్ధా ముపయేమే మహామతిః,
తస్యామా పితయా ప్రియా న్మహాదేవః ప్రతాపవాన్
ప్రతాపరుద్ర రాజాసౌ కందర్ప ఇవ మూర్తిమాన్."

విద్యానాథుడు ప్రతాపరుద్రీయమున ప్రతాపరుద్రుని గూర్చి కాకతీయకుల ప్రదీపము, కాకతీయ ప్రభు ఇత్యాదిగా కవించినాడు.

మరియు గణపతీశ్వరాలయ విద్యాంసుల యాశీర్వచన సందర్భమున ప్రతాపరుద్రుడు గణపతిదేవునకు ప్రపౌత్రుడని గూడ సూచించినాడు.

"దేవోఽసౌ గణపేశ్వరః ప్రతికలం స్ఫార ప్రసాదోన్ముఖో

వ్యక్తం త్వత్కులమున్నయన్ మహతీం పుష్ణాతు రాజ్యశ్రియం,"

కుమారస్వామి సోమయాజి రత్నాపణమున దానినే స్పష్టముగా నిట్లు వివరించినాడు. "అసౌదేవః (గణపేశ్వరః) ప్రతికలం ప్రతి క్షణం, స్ఫారస్య ప్రభూతస్య ప్రసాదస్య మున్ముఖస్సన్ రాజ్ఞో దేవస్య చా భేదోపచారా ద్వీరరుద్రస్య వస్తుత్వ వ్యవహారః. తస్య తే రాజ్యశ్రియం పుష్ణాత్వితి సంబంధః."—దీనిని బట్టి గూడ ప్రతాపరుద్రుని తండ్రి మహాదేవరాజు కాకతివంశజుడే యని తెలియుచున్నది.

తరువాత ప్రతాపరుద్రుని బాల్యము, విద్యాభ్యాసము, విశాలాక్షి మొదలగు రాజకన్యకల వివాహము వర్ణింపబడినది. సిద్ధేశ్వర చరిత్రమును బట్టి యాతడు పదారవయేటనే రాజ్యభారము వహించినట్లు తెలియుచున్నది. విద్యానాథుని ప్రతాపరుద్రీయమున గూడ అట్లే చెప్పబడినది.

"ధర్మార్థౌ చ త్రిలోకీకృతోఽయ మధునా కస్యాంచరే దర్శనం

వ్యస్తం కిల యౌవరాజ్యమపి మే బాల్యోత్సవే క్రీడతః."

దర్శి, మల్యాల, కర్ణోపల్లి, గణపవరము మున్నగు రుద్రాంబ కాలము నాటి శాసనములలోని మహామండలేశ్వర కుమార రుద్రదేవుడు యువరాజగు ప్రతాపరుద్రుడే యని గుర్తింపబడినది.

ప్రతాపరుద్రుని రాజ్యపాలనము, దిగ్విజయము కూడ చక్కగా వర్ణింపబడి గలవు. అతనికి విశాలాక్షియందు విరూపాక్ష, వీరభద్రులను పుత్రులు బుట్టిరట. దీనికి మనకు శాసనాధార మేమియు గానరాదు. తరువాత పెక్కు శివాలయములు, విష్ణు స్థానములు, మైలార, దుర్గ, భైరవ, గణపతి, వీరభద్రాలయములు మున్నగునవి పేర్కొనబడినవి. నిజమున కిప్పటికిని తెలంగాణా ప్రాంతము ముఖ్యముగ వోరుగల్లు జిల్లాలోని యే గ్రామమున జూచినను బ్రహ్మాండమైన పెద్ద శివలింగములు, శాసనస్తంభములు, కాకతీయుల నాటి శిథిలాలయములు ననేకముగ మనకు గోచరించును. దీనినిబట్టి కాకతీయులనాడు కొన్నివేల శివాలయ నిర్మాణములు, లింగప్రతిష్ఠలు జరిగిన వనుట కేవల మతిశయోక్తి కానేరదు. మైలారదేవు డొకడు కాకతీయులనారాధింప బడెడివాడు. క్రీడాభిరామమున గూడ నీతని ప్రసక్తి గలదు. వరంగల్లునకు సుమారు పదిమైళ్ల లోపున గల అయినవోలి గ్రామమున నేటికిని మైలారదేవుని గుడి కాన్పించును. అందలి శాసనమును బట్టి యాతడును గాకతీయులకు కులదైవమని తెలియుచున్నది.

సాన్నిధ్యా నయ్యనవ్రోలు నంక్ష్మే

నిత్యం కృతార్థీకృతభక్తసార్థః

మైలారదేవః కులదేవతాఽసౌ

రాజ్ఞాం సతా మేకశిలానగర్యాం.

పశ్చిమచాళుక్యులశాసనములలో గొన్నిట నీ మైలార దేవుడు, స్వయంభూనాథుడు పేర్కొనబడి యుండిరి. మొదట వారి సామంతులుగ నుండి తరువాత స్వతంత్రసామ్రాజ్యమును స్థాపించిన కాకతీయులు వారి పరంపరాగతమగు స్వయంభూదేవ, మైలార దేవులను గూడ గ్రహించి యుండవలెను.

ప్రతాపరుద్రుని యాస్థాన జనము, దినచర్య, రాజ్యవైభవము, విద్యావినోదములు మున్నగున విన్నియు వర్ణింపబడినవి. అవి యా కాలపు సాంఘికచరిత్ర, నాగరికత తెలిసికొనుట కత్యంతోపయోగకరమైనవి. మల్లికార్జునభట్టు, కృష్ణమాచార్యులు, కుమ్మరమొల్ల, భాస్కరుడు, రంగనాథుడు, పాలకుర్కి సోమనాథుడు, విద్యానాథుడు మున్నగుకవులు నాటి ప్రధానములు పేర్కొనబడినవి. తరువాత తురకలదండయాత్ర, ప్రతాపరుద్రుని చెర, ఢిల్లీశ్వరు డాతనిని మిక్కిలి గౌరవించి విడిచిపెట్టుటయు గలదు. కాని ప్రతాపరుద్రుడు మరల నోరుగల్లు ప్రవేశింపక కాశీ మున్నగు ననేక తీర్థములు సేవించి గోదావరి యొద్దనుగల కాళేశ్వరమున పుత్రమిత్ర, బంధువర్గ మెల్లరు తనను గొలువ గోదావరీ పుణ్య జలంబుల తీర్థమాచరించి విభూతి, రుద్రాక్ష, దుకూలాదులను ధరించి గోదావరీగర్భంబున గూర్చుండి శ్రీ శంభులింగమును దన హృదయమున ధ్యానము చేయుచు భౌతికదేహమును విడిచిపెట్టెనని వర్ణింపబడినది. దీనినిబట్టి తురుష్కులచే బంధిగా గొంపోబడిన ప్రతాపరుద్రుడు మరల యోరుగల్లున నడుగుబెట్టలేదనియు, తన ఇష్టానుసారముననే నదీగర్భమున గలసి ప్రాణములు విడచెనని తెలియుచున్నది. ముసునూరి ప్రోలయనాయకుని విలస తామ్రశాసనమున నాతడు ఢిల్లీకి గొనిపోవు సమయమున నర్మదా నదియొద్దన ప్రాణములు విడచెనని స్పష్టముగ నున్నది.

నీత ప్రకాస్తోఽపి బలాధికోఽపి

సహాయ యుక్తోఽపి చ వీరరుద్రః

భాగ్యక్షతే ర్మానుష మండలస్య

తురుష్కభర్తు ర్వశతా మయాసీత్.

స నీయమానో నగరీం స్వకీయాం

ఢిల్లీ ప్రయత్నా ద్యవనేశ్వరేణ

సోమోద్భవా యాః సరితః ప్రతీరే

దైవాదయాసీ త్త్రిదశాధివాసం.

అనితల్లి కలువచేరు శాసనమున గూడ నాతడు తన ఇష్టానుసారముగనే స్వర్గమునకు బోయెనని గలదు. ఇట్లు ఆంధ్రదేశము నంతటిని ఏకచ్ఛత్రాధిపత్యమున నేలిన కాకతిసామ్రాజ్యము ప్రతాపరుద్రభూమునితోడ నస్తమించెను. ఈతని సంతతివా రెవ్వరును రాజ్యము పాలించినట్లు శాసనాధారము గానరాదు. శివదేవయ్య వాక్యముగ సిద్ధేశ్వరచరిత్రమున గూడ "సీ సింహాసనంబు నీ సంతతికి లేదు. అట యుడుగుండ"ని గలదు.

ప్రతాపరుద్రుని పుత్రుడు వీరభద్రయ్య కొద్దికాలము పాలించి ఢిల్లీ సుల్తాను భృత్యులు చేయు కృత్యములు భరింపలేక తాను సమస్త జనంబులతో పురము వెడలి కొండవీటనున్న రాయలను గలసెనని యున్నది. ఇది తాత్కాలికముగ వోరుగల్లు ఢిల్లీసామ్రాజ్యమున చేరిన దనుటయు, తరువాత రెడ్డిరాజ్యము కొండవీట వెలసిన దనుటకు సూచన గాబోలు.

చరిత్రకారు లందరకును సిద్ధేశ్వరచరిత్ర మనునామముగు గ్రంథరాజము. సర్వతోముఖముగ నాంధ్రదేశ చరిత్రము నభివర్ణించిన కావున సర్వులకు తిరస్కరణీయము.



# నేను

శ్రీ తుమ్మల సీతారామమూర్తి

క్రొత్త జీవగఱ్ఱగతి నుపదేశమ్ము,
లనువునట్లు కళయుఁ దనరుఁ గాక
జాతి కుపకరించు సందేశమును గళా
న్వితముగా వచించు మతము నాది

"ఇన్ని నీతులు సెప్పితి, నింత వెక్క-
రించితిని ధర్మమున్ గికురించువారి,
నన్ను నే దిద్దుకొంటినా" యన్న మథన
మేను విడువ కించుక తలయెత్తఁగంటి

నిత్యసత్యవచననియతిమై బుధ సమా
రాధనేచ్ఛమై నిరంత రేందు
మకుటచరణ భక్తిమైఁ గాక యలవోక
వినుతికెక్కెనా కవిత్రయమ్ము?

శోకము శ్లోకంబయి వా
ల్మీకి మహాకవిపదాన మెఱసె నటన్నన్
లోకమునార్తి నిజార్తిగ
నీకొనుకవి గెల్చు ననుటయే తేటపడున్

"మీపద్య మొక్కటియు నా
లోపలి చీఁకటిని జీల్చి లోకశ్రేయో
వ్యాపృతుని జేసె న" న్నని
కాఁ బొకరుఁడు తన్ను మెచ్చఁగా మ్రాన్పడితిన్

వదలె నధికారవాంఛ, సంపన్మదమ్ము
వదలె, లోభాది వికృతులు వదలె, నితఁడు
కదలె భూదానకర్తగా గ్రామసేవ
మరగి మల మెత్తుమనిసిగా మనసు పండి

* "వట్టికూటి"వారి వంశాన వేంకట
సుబ్బయాఖ్యనలరు సుకృతి యితఁడు
త్రెళ్ళఁ జేసెనంట "క్రుళ్ళిన దొముశక్తై"
యనెడు పద్య మితని యవగడముల

---

* (ఈ పద్యము "అమరజ్యోతి" లోనిది).

కవిత కింతచేవ కలదె ? యా నొకనాఁడు
తిక్కయజ్వ కాకతీయనృపతి
నాంధ్ర భారతోక్తి నలరించి కరఁగించి
నిజమహీశు పరువు నిలుపలేదె!

నిలు! నిలు! రాజా! తెఱచిన
యిలు సొచ్చెదుకుక్క వాఁడవే?" యని యలనాఁ
డలసానిసుకవి పల్కిన
వెలవెలనై రెడ్డిఱేఁడు వెనుకకుఁ జనఁడే!

అదిర! శబ్ద మెంతయద్భుత మిది పైర
గాలివంటి దయ్యెఁ గన్నకలువ
తేకువంటిదయ్యె లోకాల నదలించు
పిడుగు పడఁచికొట్టు పిట్టపిడుగు

ఎట్టి పిడుగైన నే మిది
పుట్టింపదు చెట్టు; దీని పోయిన చోటన్
నెట్టుకొని పొంగు నెయ్యము
చుట్టము లయ్యెదరు పగల క్రుక్కడివారున్

నిబిడ సంయమమ్ము నిశిత సత్యముగల
వాకు గెల్చు నెల్లలోకములను;
వాకుబలిమి లేనివాఁ డవివేకి యై
వాకుబలిమి కానపడి యడంగు

సత్యానుచరము సాహితి;
నిత్యము సమృతాంశు వెంటనే కదలుఁగా సా
హిత్యము నిడి యజడ జడ
జాత్యవనము సేయు చాంద్రికిన్ సవ తిదియే.

నరుల సురలఁ జేసి నందనసుమనస్స
ముత్థసౌరభముల ముంచియెత్తుఁ
దత్త్వవిదులఁ జేసి తనియించు నప్సరా
నందపదముదెసకు నడిపి కవిత

బాహిరం బైన ప్రకృతికి భయద కాన
నము సృజించి భూపతి సమాజమును గాచు
నాంతరంబైన ప్రకృతికిఁ గాంతవోకి
హితము వినిపించి కవి ప్రోచు నీ జగమ్ము

# చిత్రకళలో రాజపుత్రశైలి

**శ్రీ వేలూరి రాధాకృష్ణ**

భారతదేశపు చిత్రకళలో రెండు ప్రసిద్ధ శైలులున్నవి. అందులో మొగల్ శైలి ఒకటి. దానికన్న అతిముఖ్యమైన శైలి ఈ రాజపుత్ర శైలి. స్వర్గీయ డాక్టర్ ఆనందకుమారస్వామి ఈ శైలిపై ఒక బృహద్గ్రంథాన్ని వ్రాసారు. గ్రంథవిస్తరణకు వీలైన ఈ కళాచరిత్రనుగూర్చి సమగ్రంగానైనా తెలుసుకోవటం ఎంతైనా అవసరం.

రాజపుత్రశైలి ముఖ్యంగా రాజపుత్రస్థానంలో సాధనచేయబడినది. కాన దాని కాపేరు సార్థకమయింది. తరువాత తరువాత ఇతర ప్రాంతాల్లో చిత్రకారులు ఆ శైలిలోనే సాధన చేసిఉండటం మూలాన, అది కేవలం రాజపుత్రస్థానానికే చెందింది కాక, అంతకుమించిన విశాలత్వాన్ని ఏర్పరుచుకున్నది. ఉత్తర హిందూస్థానంనుంచి అటు ప్రాగ్దిశనున్న బుందేల్ ఖండ్‌వరకూ ఇటు గుజరాత్‌వైపుకూ ఈ శైలి ప్రాబల్యం ప్రాకింది ఈప్రాంతాలు రాజపుత్రరాజుల పాలనలో ఉండటంమూలాన వారి బలపరాక్రమాలూ, యుద్ధప్రీతి, వారిలో ప్రత్యేకంగానున్న ధైర్య, వీర్య ప్రవృత్తులూ చిత్రకళను సజీవం చేసినవి.

రాజపుత్రరాజులు మహమద్ ఘజనీ దండయాత్రతో ప్రారంభమై మొసల్మాను పరిపాలన కొన్ని శతాబ్దాలవరకూ నెలకొన్న సమయంవరకూ వారి శౌర్య ధైర్యశక్తులను సమయం వచ్చినప్పుడల్లా ప్రదర్శిస్తూనే వచ్చారు. పశ్చిమ భారతపు చాళుక్యరాజ్యపాలన అంతమొందటంతోనూ 1261 లో వైష్ణదేవి మృతితోనూ చిన్నచిన్న రాజపుత్రసంస్థానాలు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్నవి. పశ్చిమ హిమాలయప్రాంతంలోని కొన్ని చిన్న చిన్న సంస్థానాలను రాజపుత్రరాజులు యుద్ధంలో గెలుచుకుని వాటిపై పలుకుబడిని సాగించారు.

ఈ రాజకీయ స్వాతంత్ర్యం రాజపుత్రరాజులపై ఒక బాధ్యతను మోపింది. సాంస్కృతికంగా ఆయాసంస్థానాల స్థాయినీ నాగరికతనూ ప్రశాంతంగా వృద్ధిపొందించే అవకాశాన్నిచ్చింది. ఆ సంస్థానాల రాజ్యపాలన ఆ రాజుల వంశపారంపర్యంగానే జరుగుతూ వచ్చింది. ఆవిధంగా ఆ సంస్థానాల్లో పనిచేసిన చిత్రకారుల కళాసాధనకూడా వంశపారంపర్యంగానే వృద్ధి పొందుతూ వచ్చింది.

ఆ సమయంలో, అనగా పదిహేనవ శతాబ్దంలో రెండు విషయాలు కళాసాధనలో ఒకవిధమైన విప్లవానికి కారణభూతములైనవి. ఒకటి, ఆయా ప్రదేశపు మాతృభాషాభివృద్ధి; రెండు, తాటియాకుల స్థానే కాగితపు వాడుక. ప్రాంతీయ భాషాభివృద్ధి జరగడానికి కారణం ఆ కాలంలోని హిందూరాజ్యాలన్నీ కూలిపోవడంతో సంస్కృతభాషకి పతనమేర్పడటం, తరువాత ఆ ప్రాంతీయ జనబాహుళ్యానికి వారి మాతృభాషలోనే మతవిషయిక, సాంస్కృతిక ప్రచారం కావలసి రావడం. ఆ విధంగా స్వామీ రామానందుని మతం ఆనాటి జనుల హృదయాల్లో వజ్రమాలిక నమ్మకాన్ని కుదిర్చింది. దాని రహస్య మేమిటంటే రామానందుని మతం ప్రతి సామాన్యునికీ అర్థమయ్యే సుగమమార్గాన్ని చూపించింది. ఆయనమతస్థులు ప్రత్యేకంగా 'మోక్షసిద్ధి'ని పొందినవారుగా పేరుబడ్డారు. అప్పటి ఛాందసపు పండితవర్యుల అత్యాచారాలవల్లనే జనానికి రామానందుని మతం అత్యుత్తమమైనదిగా తోచి యుంటుంది. ఈ రామానందుని ప్రచారంకూడా ఎంతో వ్యాప్యంగా ఉండేది. మన పురాణాల్లోని దైవకథలను ప్రాంతీయభాషల్లో కవులు గీతాలుగా వ్రాసి వాటిని వాడవాడలా పాడుకుంటూ పోయారు. జనం పరవశులయ్యారు. ఆవిధంగా పదహారవశతాబ్దం ప్రారంభంకాగానే మత సంస్కర్తలకు బదులు కవులే 'సంస్కర్త'లయ్యారు. అది కేవలం ఒక ప్రత్యేక దేవమూర్తిగా కేంద్రీకృతమైంది. జనానికి ఆ దేవమూర్తిలో ఏకాగ్రతను కలిగించటంలోనే ఆ దేవుడు 'రాముడు' కాని 'కృష్ణుడు' కానీ, ఆ కవులు ప్రత్యేకత చూపించారు. ఆ విధంగా తులసీదాసు రామాయణం దేవమూర్తిగా జనాదరణనీ వారి అపార భక్తినీ చూరగొన్నది. చైతన్యదేవుని కృష్ణస్తుతి, మీరాబాయి కృష్ణభక్తి, ఈ రెండూగూడా జనాన్ని ఆనందాంబుధిలో ముంచివేసినవి.




పూజారి - లినోకట్ చిత్రం : వేలూరి రాధాకృష్ణ

సీతారాములను గూర్చిన ప్రశంస విశ్వవిఖ్యాతిని గాంచింది. దానికి కారణం వారి స్తుతి, సుందర ప్రాంతీయభాషల్లో తయారయి, అది ప్రపంచంలోని అన్ని భాషల్లోనూ ప్రచారం కావటమే. దానికి తోడుగా, దేవా



విరహ నాయిక; (కాంగ్రాశైలి); 19 వ శతాబ్ది

యాలో, శిల్పాలు, ప్రతిమలను, రాతి శిల్పాలనూ మలచారు. చిత్రకారులు రామాయణాన్నంతనీ, చిత్రాలలో ప్రతిబింబించారు. ఆవిధంగా పురాణ గాథలు, మతాన్ని విశ్వప్రచారం చేయటానికి, ఖ్యాతిని సంపాదించటానికి కారణభూతమయ్యేవి. ముఖ్యంగా రామాయణాన్ని రచించిన తులసీదాసు, ఉత్తమోత్తముడుగా మొగల్ చక్రవర్తులచేత కొనియాడబడినాడు !

సీతారాముల పురాణగాథాసృతితోపాటు రాధాకృష్ణుల విశ్వప్రేమ మూర్తి కూడా గానం చేయబడింది. చిత్రీకరించబడింది. ఆ గానసరళి అప్పటి నుంచి, ప్రతి మానవుని నోట మృదుమధురంగా వినవచ్చింది. ప్రేయసీ ప్రియుల కాదర్శమైన రాధాకృష్ణులగాథ చిత్రకారులను భక్తివివశులను చేసి దివ్యానందాన్ని కలగజేసే చిత్రాలను సృష్టింపజేసింది. కేవలం విశ్వప్రేమనే మూర్తీభవింపజేసినవారు 'పహాడీ' (పర్వత ప్రాంతపు) చిత్రకారులు ..... కేవలం, ఒక గేయానికి చిత్రానుకరణ కాకుండా ఆ గేయ గీతాలలో వున్న సారాన్నంతా ఒకటిగా చేసి, నాయికానాయకుల చిత్రాలను తయారుచేశారు. ఆ చిత్రాలలో కథ గ్రాహ్యంకావటంకన్న రసస్ఫూర్తే సువ్యక్తమయింది. ఆ విధంగా ఉత్తమచిత్రాలకు దోహదమైన కావ్యరచన సాగించింది ప్రాచీన కవిపుంగవుడు బుందేల్‌ఖండ్ నివాసి శ్రీ కేశవదాసు. ఆయన 'రసికప్రియ' అనే గ్రంథాన్నంతా తరువాత చిత్రకారులు సచిత్రం చేశారు. ఈ కవికి దాతగా వర్తించింది, అప్పటి బుందేల్‌ఖండ్‌ను ఏలిన రాజా ఇంద్రజిత్ సింగు అని తెలుస్తుంది. ఈ నాటికీ కేశవదాసు గీతాలు ఉత్తరహిందూస్థానములో గానంచేయబడుతూనే ఉన్నవి

'రసికప్రియ' కనుకరణగా గీచిన సూక్ష్మాకార చిత్రాలు లెక్కగా వందకైరెండు మిగిలినవి, బోస్టన్‌లోని లలితకళా ప్రదర్శనశాలలో పొందుపరుపబడినవి. ఆ చిత్రరచనలోని ప్రత్యేకత మొగలాయి శైలిలోని రంగుల పొందికకు ప్రాధాన్యమిస్తూ ఆనాటి గుజరాత్‌లోని జైనమతప్రచారానికి గాను రచించిన గుజరాత్ చిత్రకారుల రచనావిశిష్టతను కూడా జోడించి అసలు భావానికి భంగము రాకుండా కాపాడి దివ్యప్రభావాన్ని తేవటమే.

అసలు గుజరాత్ చిత్రశైలినిగూర్చి ప్రత్యేకంగా అనేకమంది భారతపాశ్చాత్య దేశాల పండితులు ప్రశంసాపూర్వకంగా రచనలు చేశారు. ఆ రచనల సారాంశమేమిటంటే పన్నెండవశతాబ్దంలో తాటియాకులమీద చిత్రరచన ప్రారంభమయి, ఆ చిత్రాలలోనున్న ప్రత్యేకతను మొఘల్ పరిపాలనాసమయం వరకూ తదుపరి చిత్ర రచనలోనూ అతి నిపుణతతో నిలుపుకుంటూ వచ్చారు. అవి—ఆ రేఖలలోని శక్తి, వర్ణసంకలనంలోని జీవం, అలంకరణలోని నైపుణ్యం, ఇవన్నీ 12 వ శతాబ్దంనుంచి 15 వ శతాబ్దంవరకూ అసంఖ్యాకమైన చిత్రాలలో చూపబడిన చిత్రకారుల ప్రతిభ ఎంతైనా కొనియాడతగినది. ఆ చిత్రరచనలో పర్షియన్ కళలోని సాంప్రదాయం కొద్దిగానైనా అవలంబింపబడినదని ఒప్పుకోవలసివస్తుంది. గుజరాత్ పర్షియాలకు వర్తక వ్యాపార సంబంధం అనాదినుంచీ ఉంది. పర్షియన్ వస్తువ్యాపారం చేసే, ముఖ్యంగా, గుజరాత్‌లోని వ్యాపారస్తులు కోటీశ్వరులయ్యారు. ఈ వ్యాపారసంబంధమే సాంస్కృతిక సంబంధానికికూడా దోహదమయింది. అందువల్లనే అక్బరు, గుజరాత్ చిత్రకారుల కళాప్రతిభను మెచ్చుకొని ఎక్కువమందిని తన ఆస్థానంలో నియమించాడు. వారి చిత్రరచనే పర్షియన్ ప్రాతప్రతులలో గమనార్హం పూర్వంనుంచీ గుజరాతుకీ, పర్షియాకూ వర్తక వ్యాపార సంబంధం ఉండడం, ఆ తరువాత, ఎక్కువ మంది గుజరాత్ చిత్రకారులు అక్బరు ఆస్థానంలో నియమితులు కావటం గమనిస్తే, పర్షియన్ చిత్రశైలి కేవలం మొగల్ పరిపాలనలోనే తొలిగా అనుకరణ కాలేదనీ, అంతకు పూర్వమే, అనగా రాజపుత్రరాజుల పాలనలోనే గుజరాతులో ప్రారంభమయి, మొగల్ సామ్రాజ్యసమయంలో కూడా కొనసాగింప బడిందనీ విశదమవుతుంది. అందువల్లనే రాజపుత్ర చిత్రరచన

లోనూ, మొగల్ చిత్రరచనలోనూ అతి నిశితవిమర్శనే చేస్తేగాని, ఎక్కువ భేదం కనిపించదు. ఒక విధంగా చెప్పాలంటే, రాజపుత్ర శైలి అంతర్లీనమై ఉంది. అందువల్లనే, ఈరెండు విశిష్టశైలులకీ ఒక విధమైన అవినాభావసంబంధం ఉందనేది నిర్వివాదాంశం.....

ఇప్పటికి మిగిలిన రాజపుత్ర చిత్రాలనుబట్టి — అవి పదహారవ శతాబ్దానికి పూర్వం రచించినవి కావని చెప్పవలసివస్తుంది. నిజానికి పూర్వం ఉన్నవాటిని గూర్చిన వాస్తవిక చరిత్ర మనకు తెలియదు—లేదనికూడా చెబుతారు. కాని పదహారవ శతాబ్దానికి పూర్వపు చిత్రాలుగా పేర్కొన్న కొన్ని చిత్రాల వరలికీ 1591 నాటికి చెందిన ఒక సచిత్ర ప్రాతప్రతికీ రచనా విషయంలో ఎక్కువ పోలికలు కనిపిస్తున్నవని కొందరు విమర్శకు లంటున్నారు. ఈ అభిప్రాయానికి సాదృశ్యంగా కనిపిస్తున్నవి గీతగోవిందమును వర్ణిస్తూ రచించిన చిత్రాలు. ఈ చిత్రాలలో నున్న గొప్పదన మేమంటే, ఎక్కువ అలంకరణ లేకుండా సువిశదమైన రెండుమూడు రంగుల్లో రచించిన చిత్రాలు—అనగా రెండుమూడు రేఖాచిత్రాల వెనుక సాదా నీలి రంగుకానీ లేక అదేమాదిరి సాదాయైన మరో రంగుకానీ ఉండి, ఆ రేఖా చిత్రాలను తెల్లటి ఛాయలుగా ప్రదర్శించే పద్ధతి అది. మామూలుగా తెల్లటి కాగితంమీద నల్లటి రంగుతో చిత్రాలను గీచినప్పుడు అవి 'నల్లటి' ఛాయా రూపాలుగానే కనిపించుతవి. దానినే ఇంగ్లీషులో 'సిలువెట్' అని అంటారు. అట్లాంటి చిత్రాలు వెంటనే జనాన్ని ఆకర్షిస్తవి. అందులో చిత్రకారుని పనితనం ఎక్కువ కనిపించకపోయినా చమత్కారం గమనించదగింది! పైన పేర్కొన్న ఆ ఛాయామాత్రపు గీతగోవింద చిత్రాలలోనున్న ఆకర్షణ కేవలం నిరాడంబరమైన రేఖా, వర్ణ సమ్మేళనం. ఆ ప్రత్యేకత వాటికే దక్కింది. ఆ తరువాత రచించిన చిత్రాలలో ఆడంబరం, అలంకారం ఎక్కువగా కనిపిస్తవి. పదిహేనవశతాబ్దపు అవసానదశలోనూ, పదహారవ శతాబ్దపు ప్రారంభసమయంలోనూ, రచించిన చిత్రాలతో పోల్చదగినవి బిల్హణుని రచనయైన 'చౌర పంచశిక' ప్రేమగాథను వర్ణిస్తూ రచించిన అలంకారిక చిత్రాలు. వాటిలో నున్న రంగుల మెరుపూ, అలంకారంలోని పనితనం, పదిహేను, పదహారు శతాబ్దాలలో రచించిన మొత్తం చిత్రాలలోనే గమనించదగింది! ఆ చిత్రాలలో పొందుపరచిన మరో విశేష మేమంటే, గుజరాతు చిత్రాలలో అంతకుముందు లేని నాట్యభంగిమ, వర్ణనా. ఈ చిత్రాల తర్వాత పేర్కొనదగినవి మరి రెండు శీర్షికలలో పన్నెండు, పన్నెండు— మొత్తం ఇరవైనాలుగు చిత్రాలు. (ఇవి ఇప్పుడు లాహోరు మ్యూజియంలో ఉన్నవి). అవి సంవత్సరంలోని పన్నెండు మాసాలకీ వర్తించే కథలతాలూకు చిత్రవర్ణన—'బారమాస' అని. అవి కేవలం ఋతువుల మార్పును సూచించే వర్ణన కాకుండా, వాటికి ఒక చక్కని ప్రేమగాథని కూడా జోడించి, చిత్రించినవి. 'చౌర—పంచశిక'' చిత్రాలలో 'వర్ణికాభంగం' లేకపోయినా, వర్ణనలో ఒక ప్రత్యేకత ఉంది. వాటిని 'కృష్ణలీల' ను వర్ణిస్తూ రచించిన చిత్రాలతో పోల్చవచ్చును. ఈ కృష్ణలీల చిత్రాలు బోస్టన్ మ్యూజియంలో నున్నవి. వీటిలో ప్రకృతి వర్ణన ఎక్కువగా కనిపిస్తుంది. బొమ్మలు చందనపు ఆటబొమ్మలవలెనే ఉంటవి. ఏది ఎట్లా ఉన్నా, ఆ చిత్రాలలో అభివర్ణనా శక్తి, అనగా బొమ్మలద్వారా కథను నడిపించజేసే శక్తి ద్యోతకం అవుతుంది. ఇదే, తరువాత తరువాత, కేవలం అలంకారికచిత్రాల సరళిలోనికి మారిపోయిందని పదిహేడవ శతాబ్దపు చిత్రాలను చూస్తే తెలుస్తుంది. ఈ చిత్రాలను రచించిన స్థలవివరణ మన కేమీ తెలియరాదు. ఈ చిత్రాలతో పోలికలుగల చిత్రాలు గుజరాతులో 1591 లో నున్న 'ఉత్తరధ్యాన సూత్ర' మనే గ్రంథంలోని చిత్రాలవలె మరి యెక్కడా కానరావు. శైలినిబట్టి, ఈ చిత్రాలన్నీ రాజపుత్ర శైలి నవలంబించిన ఉత్తర దేశంకంటే పశ్చిమానికి చెందినవనే వాదుకను మనం కాదనలేము.

పదహారవ శతాబ్దంలో మొగల్ సంస్థానంలో పనిచేసిన రాజపుత్ర చిత్రకారుల పనితనంమాత్రం వారి రచనాకౌశలం ద్వారా మనకు తేటతెల్లమవుతుంది. వారే మొగల్ శైలి అనుసరణకి చేయి కలిపారని, వారి చిత్రశైలి అంతకుముందు మొగల్ శైలిలో లేనిది ప్రత్యేకం ఒకటి ఉందని కూడా తెలిసిరానంత ఏకత్వం మొగల్ శైలిలో పొందిందని సువిశద మవుతుంది. మొగల్ సంస్థానంలో చేరకముందు వారిలో ఎంతటి కుశలత లేకపోతే, వారు అక్కడ చేసిన పని అంతటి విన్నాణాన్ని పొందియుంటుంది! కొద్దిగా అంతకుపూర్వమే తమ శైలిలో పర్షియన్ ప్రాబల్యం ఉంటంమూలాన, మొగల్ సంస్థానంలో బహుముఖమైన అలంకారిక చిత్రణకి వారి పనితనం ఎంతో తోడ్పడింది. 'హామ్జనామా' అనే ఇస్లాం మతనాయకుని చరిత్ర చిత్రించటంలో వారు చూపించిన నిపుణత వేనోళ్ల కొనియాడదగింది. ఆ చిత్రాలలో రాజపుత్రశైలి అంతర్లీనంగా ఉండనే ఉంది. దానివలనకూడా, రాజపుత్ర శైలిలో కొంతమటుకు అనామకంగానే పదహారవశతాబ్దం మూడో పాదం వరకూ సాధన జరుగుతూనే ఉంది. ఆ శైలి చివరికి మొగల్ శైలిలో లీనమైంది. బహుశః రాజపుత్ర చిత్రాకారులు కొంతమంది కొంతకాలంపాటు మొగల్ సంస్థానంలో పనిచేసి, సాక్షాత్కారంలో చిత్రరచన చక్కగా అలవాటు చేసుకొని, తరువాత 'రసకప్రియ' అనే గ్రంథాన్ని చిత్రించి యుండవచ్చును- (కొంతమంది విమర్శకులు ఈవిధంగాకూడా చెబుతారు) మొగల్ రాజ్య సమయంలోనే 'రసికప్రియ' గ్రంథం చిత్రీకరించటంవల్లనూ ఈ చిత్రాలలోని పనితనం ఒకేవిధంగా కనపడటంవల్లనూ, పై విధంగా, విమర్శకులు భావించియుండవచ్చును. అదేసమయంలో 'రాగామాలా' చిత్రాల రచన జరిగింది. ఈ రాగామాలా చిత్రాలలో అభివర్ణించిన భావాలనే పదిహేడవ శతాబ్దం ఆఖరివరకూ చిత్రకారులు చిత్రీకరిస్తూ వచ్చారు. సంగీతం, గానం, నృత్యం, మతప్రచారంలో అనగా, చైతన్యుని కృష్ణస్తుతిలో మిళితమయి, జనాన్ని సమ్మోదభరితుల్ని చేసినవి. కావ్యమూ, చిత్రరచనా, చేదోడు వాదోడుగా నడచినట్లే, కావ్యమూ, సంగీతమూ కూడా ఒకదాని నంటి ఒకటి అభివృద్ధి చెందినవి. పూర్వం ఉన్న భావావేశాలకీ, మతావేశాలకీ, భక్తిప్రవత్తులకూ, గానసరళికీ అనుకూలంగా కావ్యరచన సాగింది. ఆ కావ్యాల ననుసరించి, చిత్రరచనకూడా అదే ఉద్వేగంలో జరిగింది. ఆవిధంగా సేకరించిన గీతాలూ, చిత్రాలూ కలిసి, 'రాగమాల' అయినవి. అందులో చిత్రించిన నాట్యభంగిమలు వాస్తవంగానే చూచి వేసినవని విమర్శకు లన్నారు. ఆ భావ ముద్రలన్నీ తు. చ. తప్పకుండా తీసుకురాబట్టే వారు వాస్తవికతను అవలంబించారని మనం రూఢిగా నమ్మవచ్చును.

తదుపరి చిత్రాలు అంత గొప్పవి కావని చెబుతారు. అందులో సగం మొగల్ శైలి కొట్టవచ్చినట్లు కనపడుతూ స్వచ్ఛందమైన శైలిలేక రచించినవి కాబట్టే, ఆ మాదిరి విమర్శ వాటిపై వచ్చియుండవచ్చును. ఈ తరగతికి చెందిన చిత్రాలను, ఒక పుస్తకరూపంలో ఆర్చిబిషప్ లాడ్ అక్సుఫర్డ్ విశ్వవిద్యాలయానికి బహూకరించాడని తెలుస్తుంది. ఆ పుస్తకంపై ఒక విమర్శకుడు ఆ చిత్రాలలో పొందిక హాయిగాలేదని రేఖలతో అయా సాదృశ్యాలు కూడా నైపుణ్యంతో ప్రదర్శించలేదని వ్రాశాడు. మరితరగతికి చెందిన ఒక చిత్రసంపుటిలో జహాంగీర్ కాలంలో చూపిన పనితనం, వస్త్రధారణంలోనూ, అయా వర్ణికాభంగంలోనూ తేలికగా గమనించవచ్చును. పూర్వపు మామూలు తాటియాకులమీద రచించిన చిత్రసరళిమాదిరి కాక, తరువాత జహంగీర్ ఆదేశంపై వ్రాసిన ప్రత్యేకరచన కూడా వాటిలో కానవగును. ఏది ఎట్లా ఉన్నా "చౌర—పంచశిక" గ్రంథానికి రచించిన చిత్రాల నాధారం చేసికొనే రాగమాలా చిత్రాలను రచించారనేది సత్యం. ఈ రాగమాల తరగతిలోని మూడు చిత్రాలు మాత్రం బ్రిటిష్ మ్యూజియంలో నున్నవి. వీటిలో హావభావప్రదర్శన చిత్రకారులు ఎంతో నిగ్రహంతో చేసారు. మిదుమిక్కిలియైన అలంకారం లేకుండా కాగితంలోనున్న స్థలాన్ని ఎంతో నిగ్రహంతో వాడి, దాని కనువైన, పొందికైన రేఖలతో చిత్రించిన తీరుకూడా ప్రశంసార్హం. ఈ పద్ధతినే తరువాత చిత్రరచనలో కూడా గమనించవచ్చును.



'శ్రావణమాసం'—పశ్చిమ భారతీ శైలి ('బారమాసలో' ఒక చిత్రణ); 19 వ శతాబ్ది

కొంతమంది—అనగా గుజరాతుకు చెందిన కొందరు విమర్శకులు, రాజపుత్రశైలి కేవలం, గుజరాతులో ప్రవర్ధిల్లిన చిత్రశైలిలోనే అనుకరించబడిందనీ, అదేకాక గుజరాతు చిత్రశైలియే రాజపుత్రస్థానం అంతా ప్రాకిందనీ, వారికి గర్వకారణంగా ఉండే—అభిప్రాయాలను వెలిబుచ్చారు. అయితే గుజరాతీశైలిలోని పాటవమే, రాజపుత్రశైలిలో ఉందనేది సత్యం. ఎన్ని విధాలుగా ఆలోచించినా గుజరాతీచిత్రశైలి పదిహేను, పదహారు శతాబ్దాలలో అత్యున్నతస్థాయిని పొందిందనీ, అదే రాజపుత్రశైలికి ప్రాకి కొద్దికొద్దిగా పర్షియన్ శైలి నవలంబింపచేసిందనీ—చారిత్రకంగా తెలుస్తుంది. ఎంతైనప్పటికీ, రాజపుత్రశైలికి మొగల్ శైలిక్రిందిస్థాయిలోనిదే కాని, దానితోపాటు పోల్చి చూచినప్పుడు దానికన్న ఉన్నతస్థాయి నివ్వ వీలుకాదు.

మొగల్ సంస్థానంలోని ముఖరూప చిత్రరచనను రాజపుత్ర చిత్రకారులు అవలంబించక పూర్వమే, రాజపుత్రస్థానంలో, వందిమాగధులు, ఆయా రాజుల శౌర్యధైర్యాదులను గూర్చి పొగడుతూ వారి వ్యక్తిగత విశేష మగ్గడిస్తూ స్తోత్రగానాలు చేస్తూనే వచ్చారు! అనగా ఇది పదిహేనవశతాబ్దికిపూర్వవిషయం. పద్దెనిమిదవ శతాబ్దంలోనే రాజపుత్రరచనలో సంస్థానపు దృశ్యాలను రచించటం ప్రారంభం అయింది. డాక్టర్ గోయెజ్, రాజపుత్ర స్థానంలోని కొన్ని పెద్ద సంస్థానాల్లో భద్రపరచిన చిత్రాలను బాగా పరిశీలించి, ఆ చిత్రాలు పదిహేనవ శతాబ్దంలోనివి, ఆ తరువాత చిత్రించినవే కాని, అంతకు పూర్వపువి కావనీ, ఆ చిత్రాలలో మొగల్ శైలి సాదృశ్యం




రాశిపై నారి - లినోకట్ చిత్రం: వేలూరి రాధాకృష్ణ

ఎక్కువగా కనిపిస్తుందని అభిప్రాయపడినాడు. అల్లాంటి చిత్రాలు, ముఖ్యంగా జైపూర్, జోధ్పూరు, సంస్థానాల్లో ఉన్నవట. 1725 వరకూ రచించిన రాగమాలా చిత్రాలలోకూడా మొగల్ శైలి పొడసూపినదనికూడా అభిప్రాయపడినాడు. దీనినిబట్టి చూస్తే, శిల్పనిర్మాణంలోవలె, చిత్ర రచనలో కూడా, ఉత్తరహిందూస్థానంలో అంతటా, పద్దెనిమిదో శతాబ్దం వరకూ మొగల్ శైలి ప్రాబల్యం బాగా కలదని అభిప్రాయ పడవలసి వస్తుంది. పద్దెనిమిదవ శతాబ్దపు రెండవపాదంలో మంచి బలసమన్వితాలైన సంస్థానాలు 'జమ్మూ', 'కాంగ్రా' అనే విషయం సత్యం. జమ్మూ పరిపాలకుడైన రంజిత్‌సింగ్ చాలా పెద్ద దేశాన్ని—అనగా బసోలీ సంస్థానాన్ని కూడా కలుపుకొని రాజ్యమేలాడు. బసోలీ రాజైన అమృత్‌పాల్, రంజిత్ అదుపులోనే ఉంటూ వచ్చాడు. కాంగ్రా సంస్థానంలోనే విశిష్టమైన చిత్ర రచన జరిగిందనీ, దానికి మొగల్ చిత్రాకారులు కూడా చేయూత నిచ్చారనీ తెలుస్తుంది. డాక్టర్ గొయెట్ అభిప్రాయం ప్రకారం కాంగ్రా చిత్రరచన ఘమండ్‌చంద్ పరిపాలనాసమయంలో ప్రారంభమయి సంసారచంద్ పాలనలో మంచి ఉన్నతస్థాయి నాక్రమించింది. సంసార్‌చంద్ కాంగ్రా చిత్రరచనను చాలా ప్రోత్సహించి 'కాంగ్రా'నే ఒకవిశిష్ట సాంస్కృతిక కేంద్రంగా మార్చిన విషయం ఎంతో మెచ్చుకోతగింది. ఈ కాంగ్రా చిత్రరచనా శైలియే, కాశ్మీరు, లాహోరు, ఘర్వాల్, చాంబా ప్రాంతాలవరకూ ప్రాకి, ప్రఖ్యాతి గడించింది. సంసార్‌చంద్ తదనంతరం ఆ చిత్రరచన పతనమయినప్పటికీ, సిక్కు రాజుల పరిపాలనలో కూడా ఆ రచనాశైలి కొనసాగుతూ పంధొమ్మిదవ శతాబ్దం మధ్యవరకూ వచ్చింది.

మొత్తంమీద, రాజపుత్ర శైలిలో కాంగ్రా చిత్రములను అత్యుత్తమమైనవిగా డాక్టరు ఆనందకుమారస్వామి మెచ్చుకున్నారు. వివిధశైలులన్నీ కలసి ఒక జీవనదీప్రవాహంవలె రాజపుత్ర శైలిని పునీతం చేసి, ఉన్నత స్థాయిని పొందినవని మ[illegible]రమూ మెచ్చుకొని తీరాలి !

(ఇందులోని రేఖాచిత్రాలు పురాణవర్ణచిత్రాలకు నా ప్రతికృతులు)



# వాల్మీకి కోకిలము

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

'వల్మీక ప్రభవో యస్మా త్తస్మా ద్వాల్మీకి రిత్యసౌ'—వల్మీకముమండి వచ్చిన వాఁడే వాల్మీకి. పుట్టంబుట్టువని తెలుఁగు కవులు పెట్టిన పేరు. అతఁడు కవితాశాఖ నెక్కి 'రామరామ' యని మధురాతి మధురముగా కూసెడి కోయిల యఁట. కాకి గూఁటిలో పుట్టి పెరిఁగి కూఁతకు వచ్చిన కోకిలము రెక్కలు రాఁగానే కుహూకుహూ యని కూయుచు మకామ మార్చుకొనునఁట. అటవికుఁడుగా పుట్టి బ్రతికిన ఒకానొకఁడు ఆది కవిగా మారిపోయెను. ఒక నాఁటి ఘట్టములో పుట్టిన శోకమే శ్లోకముగా పరిణమించెను. ఆ శ్లోకమే మహాకావ్యమునకు నాందియై మహాపురుషవృత్తాంతమునకు మూలమాయెను. ఇది యంతయు ఒక విచిత్రమైన పరిణామ ఘట్టము.

లోకోద్ధరణార్థమై వేదార్థోపబృంహణము కావించినవారిలో వాల్మీకి మహర్షి మొదటివాఁడు. అతని రచనమే రామాయణము. అదియే లోకములో ఆదికావ్యము. వేదములోని ఉత్తరభాగమైన ఉపనిషదర్థమును బోధించుటకే 'ఇతిహాస—పురాణములు' పుట్టినవి. అక్షర సంఖ్యనుబట్టి "పురాణేతిహాసము' లని పిలువవలసి యుండగా అభ్యర్హిత మగుటచే ద్వంద్వములో ఇతిహాసమే మొదటికి వచ్చినది. ఇతిహాసముగా పూర్వరాజుల వృత్తాంతము. రామాయణ భారతములా తెగలోనివే, రామాయణమునకు కర్త వాల్మీకి కాఁగా—భారతమునకు కర్త వ్యాసుఁడాయెను.

రామాయణ భారతములలో కాలమును బట్టి ఏది పూర్వము ఏది పరము అన్న వివాదము, ఇటీవలి చదువులలో ఉద్భవించినది. భారతములో రామాయణగాథ ఉండుటఁజేసియు శ్రీరాముడు త్రేతాయుగమువాఁ డగుటఁజేసియు పాండవులు ద్వాపరమువా రగుటఁ బట్టియు రామాయణ కాలము భారతకాలముకన్న పూర్వము గదా యని సనాతన సంప్రదాయ మున్నది. భారతములోని రామాయణ కథను ఇటీవల చేర్చిరనియు, రామాయణము నాఁటి నాగరకత భారతకాలమునాఁటికి లేదనియు కావున రామాయణ కాలమే నవీనమనియు నవీనులలో కొందఱి వాదము. అది ఏది యైనను వాల్మీకి ఆది కవియనియు రామాయణము ఆది కావ్యమనియు వాఙ్మయములో ఎందఱో నిర్ణయించి చూపిరి.

'వాల్మీకి రాదశ్చ ససర్జ పద్యమ్'—అని అశ్వఘోషుఁడు.
"స్వకృతిం గాపయామాస కవిప్రథమ పద్ధతిమ్'—కాళిదాసు.
'బభూవ వల్మీకభవః కవిః పురా'—రాజశేఖరుఁడు.
'అథ భగవాన్ ప్రాచేతసః ప్రథమం మనుష్యేషు శబ్దబ్రహ్మణం
తాదృశం వివర్తమితిహాసం రామాయణం ప్రణినాయ'—భవభూతి.
'భాస్వద్వంశవతంస కీర్తిరమణీరంగ ప్రసంగ స్వనద్వాదిత్ర
ప్రథమధ్వని ర్విజయతే వల్మీక జన్మామునిః;—జయదేవుడు.
'శుభ మతమత కావ్యం స్వాదు రామాయణాఖ్యం
మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః'
—భోజుఁడు; ఇట్లే ఎందరో.

అనఁగా వేదములలో ఓంకారము వోలె మానవులలో మనువు వోలె కాలమును బట్టియే కాక, గుణమును బట్టి కూడ వాల్మీకియే మొదటివాఁడన్న మాట పూర్వులు నిర్ణయించిన బాట. లౌకికవాఙ్మయములో శ్రీకారము చుట్టినది వాల్మీకి రామాయణమని తేలుటచే ఆదికవి యనఁగా వాల్మీకి యనియు ఆది కావ్యమనఁగా అతని రామాయణ మనియు సిద్ధాంతము చేయవచ్చును.

భారతము పంచమవేదము కాఁగా రామాయణము మహాకావ్యమైనది. భారత కథానాయకుఁడగు శ్రీ కృష్ణమూర్తిని ఉపదేశబలమును బట్టి పండితులే గుర్తింపవలసి యుండుగా రామాయణ కథానాయకుఁడగు శ్రీరామచంద్రమూర్తిని అనుష్ఠాన పాటవముచే పామరులు సైతము సేవింపవచ్చునని యభిజ్ఞు లందురు. ఎదుట నున్న వస్తువుమాత్రమే అద్దములో కన్పింపఁగా కాలాంతరమందున్నదంతయు కావ్యమునఁ గన్పట్టును. విశ్వస్రష్ట కావించిన సృష్టి, అద్భుతము అనంతము కావచ్చునుగాని అది యొకనాఁడు జీర్ణమై పోవచ్చును. ప్రళయమే పొందవచ్చు. ఇఁక—కవిబ్రహ్మ సృష్టికో జరామరణములే లేవఁట. ప్రజాపతి సృష్టిలో శోకక్రోధములు కావలసినన్ని. వానివలన లోకమునకు రోఁత పుట్టవచ్చును. భీతి కలుగవచ్చును. కవి యొనర్చు సృష్టిలో అట్టి వన్నియు ఆనందరూపముగ పరిణమించి పరిఢవించును. ఉదాత్తమైన నాయక వృత్తాంతమును బట్టియే కావ్యమునకీ ఘనత యేర్పడును. 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' తన్నమాట అసత్కావ్యములను గూర్చియే యని నిష్కర్షచేసిరి. కావ్యమున కెక్కిన మహారాజులు భౌతికముగా ఎన్నఁడో గతించినను చరిత్రలో వారిని బ్రతికించునది ఈ కావ్యమే. కావుననే కవిని కవిబ్రహ్మయని కవీశ్వరుఁడని వ్యవహరింతురు.

వియద్గంగను భూమికి దించినవాఁడు భగీరథుఁడు కాఁగా ఆ భగీరథి నందరు స్నానపానములకై వాడుకొందురు. ఆదికావ్యమును వాల్మీకి సృష్టింపఁగా అనంతర మందఱి వస్తువునే తీసికొని కాళిదాసాదు లెందరో మహోహార కావ్యములుగా వ్రాసి మన కిచ్చిరి. మధురాతి మధురముగా వాల్మీకి కోకిలము కూయుటకు క్రౌంచమిథునము కారణమైనది. అకాండ ప్రాణిహింసను గన్నులారఁ గాంచిన వాల్మీకి మహర్షికి శోకము కలిగి ఉద్రేకము పొడమి ఛందోబద్ధముగా వాణివెడలి రామాయణముగా అవతరించెను. ఒకానొక ఆవేశము, ఆవేదన కలిగినప్పుడే నిజమైన కవిత్వ ముద్భవించు ననుట కింతకన్న సాక్ష్య మింకేమి కావలెను ? ఆ యావేశమే ఒక సత్సంకల్పమై మహాకావ్యముగా పరిణమించినది.

వట్టి శబ్దార్థములే కావ్యము కానేరదు. ఆ శబ్దార్థములలో సాహిత్య ముండవలెను. సర్వశాస్త్రముల సారమే సాహిత్యము. సాహిత్య శబ్దము కావ్యప్రపంచమును వ్యాప్తిచేయు చుండును. ఏవం విధ లక్షణ లక్షితమైన వాల్మీకము మనకేమి బోధించినదో రవ్వంత చూతము.

రామాయణ ప్రాదుర్భావమునకుఁ గారణమైన క్రౌంచమిథున ఘట్టమువలన నిషాదుని చర్య అసహ్యమై ఆ మహర్షికి ఒకానొక ధర్మోపదేశము స్ఫురించినది. ఏమని ! ఓయి వ్యాధుఁడా ! కామ మోహితమైన క్రౌంచమిథునములో ఒకదానిని జంపితివి. కావున నీకు శుభము లేదు-అని. ఈ భావముతోబాటు—ఓ రామయ్యా ! కామ మోహితుఁడైన రావణుని సంహరించిన నీవు శాశ్వత ప్రతిష్ఠ నందెదవు గాక—అన్న మరొక భావము కూడ స్ఫురించును. కావ్యార్థ సూచనగా సాగిన క్రౌంచమిథున ఘట్టమే రామాయణకావ్యమును లోకమున కిప్పించినది. ఈ కథలో మనకు పిండితార్థముగా రెండు విధాల ధర్మోపదేశము వ్యక్తమగును. 'రామాదివద్వర్తి

త్యున్——న రావణాదివత్. మంచి సెబ్బరలలో మనము రామరావణులను ఆదర్శముగా ఉంచుకొని సంచరింపవలెను. ఇదే కావ్యోపదేశము. వేదశాస్త్రములు ప్రభుసమ్మితములు కాగా కావ్యము కాంతాసమ్మిత మగునట. ప్రేయ కాంత, సన్నిధిలో నుండి మెత్తని మాటలతో హృదయమున కత్తుకొను రీతి—ఇది మంచిది. ఇది కాదు—అని హితోపదేశము చేసినట్లు, కావ్యము మనకు కర్తవ్యము నిరూపించి హితోపదేశము చేయునని శాస్త్రము చెప్పును. కొన్ని యెడల పెడత్రోవను పట్టించు కావ్యములు కూడ ఉండవచ్చునన్న భావముతోనే 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అన్న కారిక పుట్టియుండును. ఆ కారికకు పూర్తిగా అన్వయింపని ఈ రామాయణ కావ్యము మనకు నేర్పిన నీతులు మన కల్పితములు గావు. మనలో మనము నిత్యము ఆచరణములో తెలుసుకొనవలసిన అంశము లనేకములు మృదువుగా కథారూపముగా వాల్మీకి మనకు ఉపదేశించెను. ఆ యుపదేశముల సారమును బట్టియే—ఆ రచనలోని మాధుర్యమును బట్టియే వేల తరబడి యేండ్లుగా ఈ దేశములో ఈ కావ్యమును భారతీయు లారాధించుచున్నారు. రాముడు కేవలము జగదేకవీరుడని మాత్రమే కాదు మనము ఆరాధింపవలసినది. అంతటి వీర క్షాత్త్రము కలిగియు తనయుడు తండ్రిమాట జవదాటక లోకారాధనమే ధ్యేయమని సత్య ధర్మసూత్రములకు కట్టుపడియున్నాడనియే మనము గుర్తింపవలెను. సీతను మించిన సుందరీమణులు ఈ లోకములో ఎందఱో యుండవచ్చును. కాని, ఆమె శీలమువంటి శీలము అందరిలో మనకు గన్పింపదు. రామానుజులు మువ్వురుండగా ఒక్క లక్ష్మణుడే రామానుజ పదవాచ్యు డగుటలో అర్థమేమో మనము గుర్తింపవలెను. గుణగణములో లక్ష్మణుని కన్న భరతుడే మేలన్నమాట రాముని నోటనే మనము వినుట వలన రాముని శీలములోని విలువయు స్పష్టముకాగలదు. అసలు రామాయణ కథ భౌతికముగా జరిగెనో లేదో కాని వాల్మీకి చేతిలో ఈ మూర్తులు దివ్యమూర్తులుగా వెలసిరి.

ఉత్తమ శ్లోక గుణాభివర్ణనమే కావ్యమునకు ముఖ్యమన్న సంప్రదాయమును వాల్మీకము మనకు జెప్పినది. రాజ శాసనముగా ప్రవర్తిలు శాస్త్రముల బోధకు లొంగనివారికి కాంతా సమ్మితమైన ఈ కావ్యము; మానవునకుండవలసిన యుత్తమ గుణము లన్నియు బోధించినది. సత్యము, ధర్మము, శౌర్యము, ధైర్యము, క్షమ, శాంతి, దాంతి దయ దాక్షిణ్యము—ఇట్టి వన్నియు రామాదుల పాత్రల మూలమున వాల్మీకి మనకు నేర్పెను. ఒక కుటుంబమును దీసికొని వారివారి వివిధమానసిక ప్రవృత్తులచే మనకు నేర్పవలసిన నీతు లన్నియు మనోహరముగ బోధించినది ఈ వాల్మీకము. సీతవంటి భార్య, భరత, లక్ష్మణుల వంటి తమ్ములు, శ్రీరాముని వంటి బిడ్డ, లోకములో ఎందఱు ఉందురో పరిశీలించి చూచినచో రామాయణ కావ్యము మనకు అర్థమైనట్లే. వేలకొలది యేండ్లకు మున్నే ఈ కావ్యములో నిర్ణయించి చూపిన గృహస్థ ధర్మములే నేటికిని చెక్కు చెదరని రీతిలో కొంతవఱకు ఆచరణములో నున్న దనుటకు ఈ యాది కావ్యమే కారణము కావచ్చును. ఇందలి ఇరువదినాలుగువేల శ్లోకములలో ఒక్కొక్క వేయికి ఒక్కొక్క యక్షరముగా గాయత్రీ మంత్రమును ఆదికవి కూర్చె నన్నమాట మనకు దెలియక పోవచ్చును. వేద మంత్రములన్నియు గాఢముగ గూఢముగ ఈ కావ్యములో అన్వయింపవచ్చునన్నవిషయము మన మెఱుగకపోవచ్చు కాని, యుత్తమగుణములు గల మానవు డెట్లు సంచరింపవలెనో సూటిగా ఈ కావ్యము వలన మనము గుర్తించి హాయిగా నెలగి చరితార్థుల మగుటకు మార్గము లున్నవి. అదే, ఆదికవి ఆర్షకవియై మన కిచ్చిన మహాభాగ్యము! ఈ భాగ్యము చెక్కుచెదరక ఇన్ని యేండ్లుగా అనుస్యూతముగా మనకు దక్కుటవలననే—ఇది నిత్యశ్రేయముగా మనము భావించుటకు కారణము లుండుటవలననే కావ్యము నిత్యశ్రేయ మన్నమాట—ఋషి కానివాడు కవి కాలేడన్న సూక్తి మనము పాటింపవలసి వచ్చినది.

సత్యవాక్పరత సదుపదేశము పితృవాక్యపరిపాలనరూపధర్మాచరణము—ఐహిక భోగవిరక్తి స్వధర్మాచరణము—ఆశ్రిత సంరక్షణము ప్రజావిశ్వాసము, భ్రాతృవాత్సల్యము, పాతివ్రత్యమహిమము, లోకారాధనము—ఇట్టి యంశములచే రామాదులను ఉత్తమ పాత్రలుగా చిత్రించి రామాయణమును మహాకావ్యముగా నిర్మించి వాల్మీకి మహాముని సర్వవాఙ్మయమునకు మార్గదర్శి అయ్యెను. రామాదులవలన వాల్మీకికి ఖ్యాతి గలిగెనో వాలికి వలన రామాదులకు కీర్తి నిలచెనో గుర్తింపవలసిన బాధ్యత మనది. విశ్వస్థితికి రామ పరబ్రహ్మము కారణము కాగా ఆయన యునికికి వాల్మీకి హేతువాయెను. సర్వసైన్యముతో సర్వాస్త్రములతో రాముడు ఒక్క రావణుని సంహరింపగా ఒక్క రామనామముతో వాల్మీకి అనంతమైన పాపములను అంతరింపజేయువాడు. సర్వ రసామృతభూతిని కావ్యములో జూపి కవులకు వంశకర్తయైన వాల్మీకి శాంతిని విడనాడని వేదాంతియు నయ్యె. వాల్మీకి హృదయ మెఱిగిన వారికి, వాల్మీకము చదువ నేర్చినవారికి ఇతర కవుల ప్రసక్తితో ఇతర కవుల కవనముతో పనిలేదట. అది యెఱుగనివారికి ఇతరము లన్నియు మున్నను లేనట్లే లెక్క. సామ్రాజ్యము కావలెనా, వాల్మీకి కావలెనా అన్న ప్రశ్నలో గుణమును బట్టి విలువను బట్టి వాల్మీకియే విలువనట. ఆ పరంజ్యోతి, స్త్రీయ చరిత్రము వర్ణింపవలెనని తలచి వాల్మీకిని వైకుంఠమునుండి దింపెనేమో! లేనిచో అట్టి సిద్ధహస్తుడు కవులలో ఇంతవరకు పుట్టలేదేమి!



# వేములవాడ శ్రీ రాజరాజేశ్వరస్వామి

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

వివరింపన్ సకలంబు దుఃఖమగుచు న్విప్పారు లోకంబులోఁ
దివురున్ వ్యర్థముగాఁగ జీవి సుఖముం దేఁగల్గునే సంసృతి
ప్రవణుండై చెడుగాక లోకమొదఁదలోఁ శాలించు చిద్దీపమున్
శివమూర్తిం గనలేక నిన్ను జడుఁడై శ్రీ రాజరాజేశ్వరా!

వెనుకన్ భూతము మృత్యురూపమగుచు న్వెంటాడఁగా భావియున్
వెనుద్రోయన్ క్షణవర్తమానమగుచున్ ప్రేలాడు కాలంబులో
జనుమం దాను సనుక్షణంబు బ్రతుకున్ సాగింప యత్నించెడున్
కనసై కత్తెరవెట్టునం చెఱుఁగఁడే శ్రీ రాజరాజేశ్వరా!

అంతామిథ్య యటంచు వేదమతియేలా చెప్ప లేశంబుకై
సంతోషించును రేపు గల్గునని యా సౌఖ్యంబు ప్రాపించి ని
ష్క్రాంతంబై చనుఁజూచుచుండఁ గరఁగున్ గాలంబులో సర్వమున్
జింతింపండిది సుంతయైన జడుఁడై శ్రీ రాజరాజేశ్వరా!

కాంతో పుత్రులో యర్థమో గళముపై కంతైన సంసార దు
శ్చింతల్ బెట్టుట గట్టిమాననమునం జీకట్లు నింపంగ ని
శ్చింత న్నిద్దురపోవుగాని వేఁకఁగుం జింతింపఁ డావంతయుం
జింతారత్న మవంచు నిన్నెఱుఁగఁడున్ శ్రీ రాజరాజేశ్వరా!

మథియింపన్ బహుకామ భావనములున్ మర్దింప రోగమ్ములున్
బెదరింపన్ జర మిత్తి నోటికడిగా బ్రమరగన్ జ్వాలద్వహ్నిలోఁ
బ్రదహింపంబడు దేహమందు మమకారంబెంత కల్పించితో
చిదరంతైనను జారిపోని యటులన్ శ్రీ రాజరాజేశ్వరా!

విసువేపుట్టద జీవితమ్మున నకీ! ఏనమ్మగో నైన నే
మిసుఖమ్మున్నది మేసినట్లీకని చేయుటకగనత్యుత్తమా
పశునే మే లనిపించెదున్ పశుపతీ! పాలించు గౌరీపతీ!
అశివస్థాపన మైథునార్తుఁడు ఘనుండై రాజరాజేశ్వరా!

ప్రవహించుం గవగూడి దేనికదియై ప్రాజ్ఞత్వ మజ్ఞత్వ మా
ప్రవివేకంబది దైవగత్యవిహతిన్ భాషింప విన్వొంటనే
యవివేకంబదె పోయెఁ బోయె నని దుఃఖాలాపముం జేయు నే
మి విచిత్రంబగు సృష్టి సేసితివి స్వామీ రాజరాజేశ్వరా!

అదియట్లేయగు నన్ననట్లయగుఁ దానద్దానివారింపఁగన్
విధియుంజాలఁడ యట్టివో జనుఁడు యత్నించుంగదా మూఢుఁడై
యది యజ్ఞానము గూటిపట్టు మొదలై యల్లెన్ జనుస్సంతుతుల్
మృదుచూడా శశివద్దరస్మితముఖా! శ్రీ రాజరాజేశ్వరా!

ఇదియేదో యటవీప్రయాణమున నిండీ మార్గమే మార్గమున్
పదమేమున్నది యేదొపట్టుకొని పోవంబోవ నే పల్లెయో
పదడో వచ్చుననంగ గమ్యమగుచుం బాలించు చందాన నీ
వెదురై రావలె నాదుకోవలెను దండ్రీ! రాజరాజజేశ్వరా!

ఈ జన్మంబుల నెత్తియెత్తి విసుపై యేకారిలిన్ ధూర్జటీ!
రాజద్రాజకళాకిరీట! రమణీరమ్యార్ధ దేహా! శివా!
ధీజాడ్యంబు దొలంచి నాయెడఁద నీ తేజంబు నిండింపవే!
యీ జన్మంబుల గోడడంపవె! పురారీ! రాజరాజేశ్వరా!

సిగలో జాబిలి లేదు లేదు తలపై సింగారి గంగమ్మయున్
నగమంగంబున గౌరు లేదు మెడలో సర్పేంద్రుడున్ లేడహో
తిగకంటన్ బెనుమంటయొండె ప్రభువై దీపించు చూడాశశీ!
అగజానాయక! సర్పహార! ధృతగంగా! రాజరాజేశ్వరా!



# దాసరుల పరిభాష: "పల్నాడు"

శ్రీ శ్రీ వాత్సవ

ఆంధ్రదేశంలో చిరకాలంనుండి స్థిరనివాసం ఏర్పరుచుకొన్న పరదేశీ సైనికులు కొందరున్నారు. వీరు కాకతీయుల నాటినుండి, విజయనగర రాజుల కాలమునుండి మనదేశమునకు దండెత్తి వచ్చిన మూకలలో చేరినవారై చివరకు ఇచ్చటనే నిలిచిపోయి, ఆంధ్ర దేశస్థులుగా మారిపోయినవారున్నారు. శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్ర వ్రాయుటకుముందే పల్నాటి యుద్ధము జరిగినదికదా! అప్పటికే ఈ దాసరులు పల్నాటి సైన్యములోచేరి ఏదో యొక పక్షమున యుద్ధముచేసియుందురు. నాయకురాలు, బ్రహ్మనాయుడు పెత్తనము నెరపిన రోజులలో 'చాపకూడు' పరిపాటి అయినది. చెన్నకేశ్వరస్వామి ఆలయంలో కుల మత భేదములు పాటించని ఆచారములు ప్రవర్తిల్లినవి. వైష్ణవ భక్తులయిన కొందరు తమిళ దేశమునుండి, మహారాష్ట్రమునుండి, కన్నడ ప్రాంతములనుండి వచ్చి, యుద్ధముచేసినట్లు గ్రహించవచ్చును. యుద్ధకౌశలము, రణనీతి అంతగా తెలియనివారు, సైన్యమునకు సహాయ్యముగానుండు దళములలో వంట చేయువారుగా, చిన్నపనులు చేయువారుగా పల్నాటిదండులో వీరు చేరినట్లు అప్పటి చరిత్ర పరిశోధించినచో గ్రహించవచ్చును. వీరందరు దాసరులే. వైష్ణవ భక్తులే. ముందు 'సారగాళ్ళ'గాచేరి, తరువాత భజనకీర్తనలుపాడు దాసరులుగా దేశ మంతటా పర్యటనము చేసియున్నారు. అంతేకాక,వీరు వివిధవృత్తులతో జీవిస్తూ ఒక్కచోట స్థిరనివాసం అని లేకుండా వూరూర తిరిగి పొట్టపోసికొన్నారు. పైగా కొందరు పాటలుపాడేవారు. మరికొందరు ఆటలు ఆడేవారు. కొందరు జట్టులుగా కూడి నాటకాలు వేసేవారు. వీరిలో కొందరు వీరశైవము మతముగా స్వీకరించి, జంగము దేవరలుగా ఊరూర తిరిగి, శివనామ సంకీర్తనలు చేసేవారు. శివభక్తి ప్రచారముచేయువారు జంగములు. వారి జంగములు పాట వీరశైవము ఉప్పొంగచేసే వీరగాథగానో, శివలీలగానో ఉండేది. వైష్ణవ సంకీర్తనలు చేసేవారు దాసరులుగా పేరుపొంది, భజనలు చేసేవారు. పాటలు పాడేవారు. కొమ్ము దాసరులుగా కొమ్ములెక్కి ఊరూర సంచారంచేసి, ఉంఛవృత్తిచేత జీవించేవారు. కొందరు కలిసి ఒకజట్టుగా ఏర్పడినపుడు వీధినాటకములు వేసేవారు. వానిలో హెచ్చు భాగవతములోని గాథలే యగుటచేత, ఇదివేసేవారికి వీధి భాగవతులని పేరు వచ్చినది. ఇట్టి భాగవతులలో మాలదాసరులు, మాల భాగవతులు, యానాది భాగవతులు, గొల్లభాగవతులు ఉండేవారు. గొల్లలలో యెఱ్ఱిగొల్లలు, కన్నడ, మరాటీదేశాలనుండి వచ్చిన గోపాలకులు. వీరు మందలుగా ఆవులను తోలి, తెచ్చి సైన్యమునకు వెనుక బలంగా ఉండేవారు. కొందరు గూఢచారులుగా యుద్ధవర్తమానములను అందజేసేవారు. ఆ కారణంచేతనే వారిలో ఒక పరిభాష ఏర్పరచుకొని, ఆ సంకేతములతో తమ అభిప్రాయాలు గోప్యంగా వెల్లడి చేసేవారు. అది—ఆ జట్టులో వారికి తప్ప, ఇతరులకి తెలిసేది కాదు. ఈ పరిభాష, "పల్నాడు" అనే పేరుతో తెనుగుదేశంలో ప్రచారంలోకి వచ్చినది. పల్నాటిసీమలో పుట్టిన కారణంచేత యీ పరిభాషకు "పల్నాడు" అని పేరు వచ్చినదేమో! ఇది ఏడెనిమిది వందలయేండ్లనుండి తెనుగు దేశంలో పలుమూలల వ్యాపించి యున్నది. ఇది మాటలాడేవారు దేశద్రిమ్మరులయిన గొల్లలు దాసరులు. ఎఱ్ఱిగొల్లలు, కొమ్ము దాసరులు, విప్ర వినోదులు, వీరముష్టివాళ్ళు, ఇటువంటివా రెందరో వాడుకునేవారు. ముఖ్యంగా వీధిభాగవతాలువేసే ఎఱ్ఱిగొల్లలు తమభాగవతాలు ప్రదర్శించే సమయంలో ముందు వెనుక వాడేవారు. అందుచేతనే నాటకాలకు చెందిన పరిభాషా పదాలు ఈ "పల్నాడు"లో కలిసిఉన్నాయి. ముందు సైన్య రక్షణదళాలలోనూ, గూఢచారులలోను, తరువాత పశువర్ధకదళాలలోను చేరిన యీ యెఱ్ఱిగొల్లలు—క్రమ క్రమంగా భాగవతులుగా మారి, భాగవత మేళా ప్రదర్శనమే తమ జీవన వృత్తిగా మార్చుకొన్నారు. ఇటీవల అర్ధశతాబ్దినుండి ఆ వీథిభాగవతాలకు కూడ తగిన ఆదరణలేక—ఈ యెఱ్ఱిగొల్లలు వ్యవసాయమువంటి వృత్తిచేపట్టి, ఏదో మరొక జీవనోపాధి చూచుకొన్నారు. కాని, నేటికిని కొందరు చక్కని నాటకాలు కట్టి పల్లెటూళ్లలో ప్రచారం చేస్తున్నారు. అదొక సరదా! అదొక కాలక్షేపం.

నేటికిని యీ యెఱ్ఱిగొల్లలు పశ్చిమ గోదావరి జిల్లా, తణుకుతాలూకా దాసుళ్ళ కుముదవల్లి గ్రామములో వీరున్నారు. ఈ గ్రామంలోనే దాసరులున్నారు. వీరే యెఱ్ఱిగొల్లలు. పూర్వం ఈ గ్రామమంతా దాసుళ్లే ఉండేవారట. అందుకే "దాసళ్ల కుముదవల్లి" అని పేరు ఈ గ్రామానికి వచ్చింది అంటారు. ఇంకా చుట్టుప్రక్కల గ్రామాలయిన గణపవరంలోను, పెంటపాడులోను, మండపాక, వీర వాసరం, ఆకివీడు, తిరుపతిపురం మొదలయిన ఊళ్లలో చెల్లా చెదరుగా ఉన్నారు. వీరిలో కొందరు నేటికీ నాటకాలు ప్రదర్శిస్తున్నారు. వాటికి నాటకామేళాలనిపేరు. వారు ప్రదర్శనయిచ్చేవానిలో భామాకలాపం, చెంచు నాటకం; గొల్లకలాపం మొదలైనవి యెన్నోయున్నవి. వీ రందరూ జట్లుగా చేరి, ఒక్కొక్కజట్టుదారుడు ఒక్కొక్క ఊరుకాని, కొన్ని ఊళ్ల మండలముకాని తనకి ప్రత్యేకించుకొని ఆ ప్రాంతములలో ప్రదర్శన లిచ్చేవాడు. అలాగ ప్రదర్శనలిచ్చేటప్పుడు ఒకరిమీద ఒకరికి పోటీలేదు. వీరు పాడగలరు, ఆడగలరు. మంచి వేషాలు కట్టగలరు. దానికి కావలసిన దుస్తులు పరికరాలు సేకరించి ఒక నాయకుడు ఈ యెఱ్ఱి గొల్లలకు తగిన తరిఫీదునిచ్చి సంసిద్ధులను చేసేవాడు. ఆ జట్టు నటులు ఒక మేళంగా ఏర్పడి ఊరూర ప్రదర్శన లిచ్చేవారు. ముందు ఏ గ్రామానికి బయలుదేరివెళ్తున్నారో, అచ్చటి పెద్దల గుట్టు రహస్యాలు తెలికొనేవారు. నాటకంలో సందర్భమున్నా, లేకపోయినా సమయ సముచితంగా స్థానిక విషయాలను చొప్పించేవారు. దానితో అచ్చటి సభాసదులకి ఎంతో ఆనందంగా ఉండేది. ఈ లాంటి నాటకాలు వేయుటలో క్రోసూరి ముత్యం అనే జట్టు నాయకుడు చాల కీర్తి నార్జించాడు. ఆతడు రాజవేషాలు ధరించి మంచిఠీవితో, దర్పంతో ఒప్పిండేవాడు అంటారు. ప్రహ్లాదలో హిరణ్యకశ్యపుడు వేసినా, సారంగధరలో రాజరాజు వేసినా ఆతడే వెయ్యాలి అని ఉభయ గోదావరిజిల్లాలలో ఆతనిపేరు ఊరూర మ్రోగిపోయింది. నేటికీ తిరుపతిపురంలో ఉయ్యూరు వెంకన్న ఆధ్వర్యంక్రింద గొల్ల భాగవతులు నాటకాలు ప్రదర్శిస్తున్నారు. అయితే వీరందరూ వృద్ధు లయిపోయారు. ఈ కాలంవారికి నాటకాలయెడల తగిన ఆదరాభిమానాలు లేక వారు మానివేశారు. మండపాక సైడిమ్రరు గ్రామాలలో లక్ష్మీపతి, అరదాలు అనేవారు ఇప్పటికీ కొన్ని పౌరాణిక గాథలు తీసికొని, అక్కడక్కడ నాటకాలుగా ప్రదర్శిస్తున్నారు. పండుగ

ంకి పద్యాంకి, కీర్తాంకి, తిరువాళ్లకు ఈ నాటకాలు అరు బయట వేసిన పందిరిలో ప్రదర్శిస్తున్నారు. పెద్ద తెరలూ అవీ ఉండవు. వేషాలు మామూలే. పాటకు వంతపాట, హార్మోనియమ్ శ్రుతి. రాగములు దరువులు పూర్వ పద్ధతిలో ఉంటాయి. పాత్ర ప్రవేశించినా, నిష్క్రమించినా దరువులు నృత్యములు. మధ్య మధ్య హాస్యానికి సుంకర కొండయ్యవంటివాళ్ళవచ్చి కాలక్షేపం చేస్తూ ఉంటారు. కొన్నికొన్ని సందర్భాలలో హాస్యం సభ్యతమితి మురికి హాస్యంలాగ పరిణమించడం కూడకద్దు. అయితే—మొత్తంమీద యీ యక్షభాగవతులు రాత్రి తెల్లవారులూ నాటకంఆడి, పండిత పామరులను మెప్పించగలరు. ఈ నాటకాలు ప్రదర్శిస్తున్నప్పుడు, ప్రదర్శనానంతరం చందాలు దండుకునేటప్పుడు ఇతరులకు తెలియకుండాఉండే నిమిత్తం తమలోతాము ఒక విధమైన సాంకేతిక భాష వాడుకొంటారు. ఆ పరిభాషనే "పల్నాడు భాష"గా పలుతావుల వ్యవహరిస్తున్నారు.

వీరందరు రామానుజ మతస్థులే. కొందరు దాసరి పాటలు పాడుకొంటూ, భిక్షాటనం చేసికొంటారు. కొందరు—పిట్టలను కొట్టడంలో ప్రవీణులు. మరి కొందరు గాలంవేసి చేపలను పట్టుకొని జీవిస్తారు. వీరందరికీ కుల పెద్ద ఉంటాడు. సమాజ విషయాలలోకాని, ఆర్థిక విషయాలలోకాని అతడు చెప్పిన తీర్పే న్యాయము. పెళ్ళికూతురును తెచ్చుకునేటప్పుడు కన్యాశుల్కం చెల్లించడం వీరిలో సంప్రదాయం. అయిదు వరహాలు ఇస్తే పెళ్ళికూతురును తెచ్చుకోవచ్చును. వీరిలో భర్తపోయిన తరువాత భార్య వైధవ్యం అనుభవించ నక్కరలేదు. తిరిగి వివాహం చేసికొంటే, కులములో తప్పులేదు. కాని కుల పెద్ద దానికి అనుమతి యివ్వాలి. కొంత రుసుము చెల్లిస్తే ఆ యనుమతి లభిస్తుంది. మారు మనువులున్నవి. ఏదైనా తప్పుచేస్తే కులపెద్ద ఒక శిక్ష విధిస్తాడు. దాని ప్రకారం కొంత సొమ్ము అపరాధముగా చెల్లించవలసి యుంటుంది. వివాహ పద్ధతి వైదిక మర్యాద ననుసరించి బ్రాహ్మణ పురోహితులే చేయిస్తారు. కాని అంత్యకర్మలు, అశుచిక్రియలు మాత్రం సాతాద వైష్ణవులు(సాతానులు) చేయిస్తారు. వీరికి—కొన్ని గ్రామాలలో స్థిర నివాసంకంటె, దేశాటనంవలన ఊరూర తిరిగి రావడమే ఎక్కువ పరిపాటి. కొందరు తోలుబొమ్మలాట వేస్తారు. మరికొందరు కీలుబొమ్మలాట వేస్తారు. ఇంకొందరు రంగస్థలంమీద వేషాలుకట్టి—రకరకాల భాగవత మేళా ప్రదర్శనలిస్తూ ఉంటారు. వీరందరూవాడే పరిభాష, పల్నాడులో, కొన్ని పదములు ఇపుడు పరిశీలన చేద్దాం.

ఈ భాష ఎఱ్ఱ గొల్లలు, మందులవాళ్ళు, గంగిరెద్దుల వాండ్లు—కొమ్ము దాసరులు మొదలయినవారు వాడుతూ ఉంటారు. కొన్ని పదములు గమనిస్తే సంస్కృత శబ్దాలే వీరు వాడుకొన్నట్లు గ్రహింపవచ్చును. మరికొన్ని శబ్దముల ఉత్పత్తి చిత్రంగా ఉంటుంది. ఈ పదజాలములో విశేష్యములు, విశేషణములు తప్పకాని, క్రియాపదములు హెచ్చు లేవు. క్రియాపదములు కారకములు తెలుగువే ప్రయోగిస్తూ ఉంటారు. వాక్య విన్యాసములో తెనుగు భాషకు తప్పిన ప్రయోగాలుండవు. చూడండి మచ్చుకి కొన్ని పదాలు, వాటికిగల తెనుగు అర్థములున్నూ—

గొన్ని:—రూపాయ.
అర్ధగొన్ని:—అర్ధ రూపాయ.
పిటికం:—పావలా.
పిలప పిటికం:—బేడ.
వాగన్న కంచికాలు:—అణాలు.
తొడల కంచికాలు:—అర్ధణాలు.
కంచికం:—వాసెమ్ము, పైకము.
కాజాలు:—చేపలు.
కరేమద్దు:—మాంసం.
కొక్కడం:—కోడి.
మబ్బన్నగాడు:—కొంగ.
కావురుగాడు:—కాకి.
పుల్ల గరటాలు:—చింతకాయలు.
గరటాలు:—కాయలు.
పచ్చం:—పొగచుట్ట.
విప్పెట్టె:—అగ్గిపెట్టె.
వాగడం:—పోరు. మాట.
మురిసం:—తల.
వైనాలు:—కళ్ళు.
నానకం:—ముక్కు.
పాద కష్టాలు:—చెప్పులు.
హస్తాలు:—చేతులు.
హస్తం గొన్ని:—అయిదు రూపాయలు.
కెంద:—బట్ట. వస్త్రములు.
వాగన్న కెంద:—చిరిగిపోయిన బట్ట.
బడిపాలు:—దూడలు.
జీవటాలు:—ధాన్యం.
అమర్తపళ్ళు:—బియ్యం.
తిరిచుట్లు:—పిండివంటలు.
పానం:—నీళ్ళు.
కవట:—కల్లు, మద్యం.
గండెం:—సారాయి.
కైపుతుం:—త్రాగుడు.
పుచ్చం:—స్త్రీ మర్మావయవం.
కొంకణం:—పురుష మర్మావయవం.
మిరువుగరటం:—కారం.
ఉప ముద్దు:—ఉప్పు.
బొల్లు దొడువుం:—మజ్జిగ.
తైరు:—నూనె, నెయ్యి.
మంతాడు:—మగవాడు.
కొంత:—స్త్రీ.
చారకోటి:—ఆడుది.
మలప చారకోటి:—విధవరాలు.
వాగన్న చారకోటి:—వ్యభిచారిణి.
భీరు:—గొప్పది; మంచిది; యోగ్యమైనది.
భీరు చారకోటి:—గొప్పింటి స్త్రీ.
పింకుడు:—పిల్లవాడు.
పింకి:—పిల్ల.
చిలపింకుడు:—చిన్న పిల్లవాడు.
పరికించడం:—చూచుట.
పరికించు:—చూడు.
కంజపా:—వెళ్ళిపో.
జావిరా:—తప్పుకుపో.

తావుకురా:—తీసికొనిరా.
తావు:—ఇయ్యి.
కరం:—ఇల్లు.
కరం మీరు గానే ఉంది:—ఇల్లు గొప్పగానే ఉంది.
బిప్పం తావటం లేదు:—బిప్పం వేయడంలేదు.
బెత్తం:—పొలము. చెట్టు.
ఇరివుం:—కత్తి.
గాతం:—పాట.
అంది పెటడం:—పాడడం.
గాతం మీరుగా బంది పెలు:—పాట బాగా పాడాడు.
వచ్చు:—మాటలాడకు. నోరుముయ్.
వచ్చు వచ్చురా వాగన్న వద్దు:—మాటలాడు: [illegible]నికేమి తెలవదా !
వాగన్న:—వెర్రి వాగన్న. పనికి మాలినవాడు.
కరపిలు:—కాయలు.
మేసం:—మేక.
వరసం:—కత్తి.
గురపిలు:—చల్ల.
పేసిం:—వల ( చేపలను పట్టేది )
దైపులాడటం:—దెబ్బలాట లాడుట.
గుయ్యం గంజడం:—విరుగగొట్టుట.
కైతీలు:—కుక్కలు.,
గుంజటం:—రమించుట.
పీలాలు:—పాలు.
కటకం:—మంచం.
బడిపాయిళ్ళు:—పశువులు కాసేవాళ్ళు.
కీవగాళ్ళు:—మాలలు.
కొందలోళ్ళు:—చాకలివాళ్ళు.
కడ్లోళ్ళు:—ఈడిగవాండ్రు. కల్లుగీత గీసేవాళ్ళు.
పిట్లగాళ్ళు:—రాజులు.
బొల్లి తాటగాళ్ళు:—బ్రాహ్మణులు.
బొడికాలోళ్ళు:—కుమ్మరులు.
బోదికం:—కుండ.
పిరిపాలోళ్ళు:—కుంగలివాళ్ళు.
ఎరికోళ్ళు:—కాపులు.
గాతగాళ్ళు:—ఎట్టి గొల్లలు భాగవతులు.
గాతగాడు:—పాట పాడేవాడు.
కుంచోళ్ళు:—అలగాజనం; పాటకజనం.
గొంట్లగాళ్ళు:—కోమట్లు; షావుకార్లు.
పిదులోళ్ళు:—సేనాపతులు:—వెలమగాండ్రు.
ముతకారుడు:—ముసలివాడు.

ఇలాగ యెన్నో పదములు చూపవచ్చును. రాను రాను నశించిపోతూ వున్న యీ భాషగూర్చి ఎవరైనా పరిశోధనచేసి, దీనిని సేకరించి భద్రపరుస్తే ఈ వృత్తివలన జీవించేవారి ఆచార వ్యవహారములు వంగతి సందర్భములు తెలిసి కొనవచ్చును. ఈ పదజాలములో వాగన్నవంటి పదములు వెర్రివాళ్లను గూర్చి 'వెర్రి వాగన్న' అని పేర్కొనుట తెలుగు దేశములో ఉన్నది. దానిని విశేష్యము గాను, నామవాచకముగానేగాక విశేషణముగా సర్వ నామముగా వాడుట గమనించవచ్చు. అలాగే "కాడు", "గాడు" అనునవి పురుష వాచకముగా ప్రయోగించి, జాతిని, కులమును సూచించు కొనవిభక్తిక ప్రత్యయముగా వాడినట్లు చూడవచ్చును. మనదేశ—నాటక చరిత్రలో భాగవత మేళా ప్రదర్శనలో ఈ యెట్టి గొల్లలు నిర్వహించిన పాత్ర నిరుపమానమైనది. వారు మన భాషకు మన సాహిత్యానికి, మన నాటక కళకు, రంగస్థలాలకు సమర్పించిన కానుక అనల్పమైనది. తెలుగు రంగస్థలసమీక్ష చేయదలచినవారు ఈ యెట్టి గొల్లలు, దాసరులు చేసిన సేవ గుర్తించుటయేకాక—వారు సమకూర్చుకొన్న భాషా విషయములో కూడ పరిశోధన చేయవలసి యున్నది. ఇది—మన సాహిత్య అకాడమీవంటి సంస్థలుకాని, విశ్వ విద్యాలయ పరిశోధనా సంస్థలుకాని, ప్రభుత్వ విద్యాశాఖవారు కాని చేపట్టి చేయిస్తే, మాటు మణిగిన నాటి పుట్టురత్నముల నెన్నిటినో పైకి తీయవచ్చును.

ఈ వ్యాసము రచించుటలో—పదములు పరిభాష సేకరించి, ఎట్టిగొల్లల ఆచార వ్యవహారముల గూర్చి నాకు తోడ్పడినవారు పశ్చిమ గోదావరిజిల్లా కోడవల్లి గ్రామవాస్తవ్యులు దాసం గోపాలకృష్ణగారు. వారి సహకారం లేకపోతే ఈ వ్యాసరచన సంభవమయ్యేదికాదు. వారికి నా కృతజ్ఞత.



# వాలి హృదయము

శ్రీ వావిలాల సోమయాజులు

[బాణోపహతుడైన వాలి తెలఁబారి కట్టెదుర సమ్మోహనరూపమున నున్న శ్రీరామచంద్రునితో.]

ఎన్నోమారు లెదిర్చి, మోడి, గిరులం దేమూలనో దాఁగి, వాఁ
డున్నాఁ డన్నదె మాసిపోవఁ, బ్రతుకెట్లో యీడ్చు సుగ్రీవుఁడు
ద్యన్నవ్యార్భటి బొబ్బవెట్టి నను నాహ్వానింప, నిం దెద్దియో
యున్నట్లున్న దటంచు నెంచియును నే యుద్ధంబు నీవచ్చితిన్.

సరిదే నా యనుజన్ముఁ డెన్నఁడును భాస్వత్సత్త్వ సంపత్తి నా
కరయన్, వానిని గీటడంచు టొకయాలైయందు నవ్వేళ, సో
దర సౌహార్దముచే వధించుటకుఁ జిత్తం బొప్పకోకున్న, నే
వఱకున్ దేలనిపోరు సల్పి, తరుమన్, వాఁడిట్లు జీవించెడిన్.

తరుమూలమ్మున దాఁగి చోరునిగతిన్, ద్రాఘిష్ఠ చాపాన భీ
కర నారాచముఁ దొడ్గి, మద్విపులవక్షశ్శైలముం జీల్చు దాఁ
కరయ న్నీజతనమ్ము, శాత్రవుఁడ నెట్లైనాఁడ నయ్యా!, భవ
త్పరమ స్తోత్ర విచిత్ర రూపమును మున్ దర్శింపనే యెన్నఁడున్!

కట్టిన వల్కలమ్ములకు గౌరవమున్ గలిగింపఁగోరి చే
పట్టితె వీరకార్ముకము; వంచనమైఁ బగవాఁడఁ గాని నన్
నెట్టన నిట్టు కూల్చి యవని న్మహనీయ పృషత్క విద్యకుం
బట్టముఁ గట్టఁగోఁ దలఁచి భండనపండిత! యిట్లొనర్చితే!

ఇట్టు లధర్మ చేష్టను వధించి ననున్ జిఱునవ్వు లొల్కుచుం
దిట్టతనాన మించి గడిఁదేఱిన వాఁడవు వోలె నిల్చు నీ
దెట్టి విశిష్ట సత్కులమొ! ఎయ్యది దేశమొ! ధర్మమేమొ! నీ
యట్టిఁడు లుబ్ధకుండో, మహాత్ముఁడో కావలయున్ బ్రవీరుఁడా!

ఎదురుగ నిల్చి గెల్చుటకు నెవ్వఁడు పూనిన వాని శక్తిసం
పద నొకయర్ధభాగ ముడఁబాసి తమిన్ ననుఁ జేరు, నప్పు డీ
య్యది యగు నాదు జీవితరహస్యము-దీని నెఱింగి యుంటచేఁ
గదనముఁ గోరవా? నిజముగాఁ గనుపట్టెడి నిట్టి యూహయే!

అవు నా జీవితమర్మ మీా తెలియఁగు దయ్యా! కాక వంచింప నీ
కవునా! తపాత్రము మూర్తిఁదాల్చినటు లున్నా వీవు, జ్యాఘోషమున్
వివిధాశాస్త్రవిభేదకస్వనమహావిస్ఫూర్తి విన్పించినాఁ
డవు; నీ వెక్కటిశౌర్యసారుఁడవు, గాథప్రక్రియ నన్నెమ్మెదన్.

తలఁపునకు వచ్చుచున్న యది దాసులు తొల్త నెఱింగి చెప్పినా
రట రవితేజుఁడౌ నొకఁడు రాజ్యరమ న్విడనాడి తమ్మునున్
జెలియును వెంటరా విపినసీమలలో మునివేషధారియై
మెలఁగుచునుండెనంచు నలమేటివి నీ వగుదా మహాశయా!

అవల వింటి నాతఁ డగు నా రఘువంశజుఁ డంచు రక్తియై
యీా వనభూమి 'పంచవటి' నింతియు నాతఁడు నున్నవేళ నా
రావణుఁ డేఁగుఁదెంచి నిజరాక్షసమాయలఁ జూపి ధీరుఁడై
యా వనితామణిం గొని శతాంగముపైఁ బయనించెనం చొగిన్.

అతఁడ వీవె? ఆ దశరథావని నాథునియాత్మజుండవా?
ఆ తపస్వియకీర్తి కగునయ్య యనాథుయ? మాదినుండి య
త్యాతతభక్తి యున్నయది యాయవనీపతి యన్న నాకు; నీ
వాతని పుత్రకుండవ మహత్తరమూర్తి, రఘూద్వహుండవా!!

కాదన వీవు రాఘవునిగా గ్రహియింతును నిన్ను; కాని మీా
రాదట ధర్మరక్షయె మహార్థముగా గయికొన్న దొడ్డ భూ
మీాదయితుల్ గదా! ఇలకు మేటివె? నేఁ డిటు మాయచేత రా
జా! నయఁదప్పి నన్నుఁ దెగటార్చుటలోఁ గల సూక్ష్మమెద్దియో!

'మధువన'వీథులన్ ప్లవగమానవతీజనతామనోజదు
ర్వ్యథలను దీర్చుటల్ మధుసురారససేవనకేళిలోలతా
కథనములు న్మదీయ గుణగౌరవభంగము సేయ నీచపు
న్నిధనము నిచ్చినావె, యవి నీ తుఁడు వీఁడని నమ్మి నీమెదన్?

ధర్మము నుద్ధరింప వసుధన్ రఘువంశమునందుఁ గేశవుం
డర్మిలిఁ బుట్టునంచును మహాత్ములు మానులు పల్క వింటి నో
నిర్మలచిత్త!; యా ప్రభుఁడ వీవగుదేమొ!! నరేంద్ర నీతికిన్
ధర్మముగాని కృత్యము లొనర్పను నే మదమత్సరోన్నతిన్.

యమఘుంటా నినదోపమం బయిన సింహాధ్వానముం జేసి యా
హిమవంతుం గని ధిక్కరించి కదనం బెవ్వాఁడు కాంక్షించె నాఁ

దమితలోకప్రభుఁడు, యాతుధానుఁడును; నే నా దుందుభిన్ జంపి దో
ర్వన్మురంబందునఁ, గాలఁ ద్రిప్పి, యుర్వి నా ఖ్యాపించితిన్ మేటినై.

దనలం గల్పితి పన్నగర్వమున సంధీభూతుఁడై రావణుం
డసి సాహాయ్యము మెచ్చి, వచ్చి యొకనాఁ "డాయోధనక్రీడ నా
తోడఁగన్ రక్షుఁడవే" యటన్న "చెడ దోహా!" యంచు సూచించి వి
శ్రాన్తమా మల్లవిశేషబంధమున ఛాకంగొట్టి నిర్జించితిన్.

అభిషిక్తమము నొందినాఁడ దివిజాధ్యక్షప్రభవ్; ధీర్ఘ బా
హా విక్రాంతబలాతిరేకమున సర్వారాతిదోర్గర్వమున్
ద్రావన్ శాత్రవు లైరి మిత్రులు—సదా రాజ్యప్రజాపాలన
ప్రావీణ్యంబునఁ గీర్తికెక్కితిని; చంపం జెల్లునే నన్నిటుల్.

ధర్మత్యాగమునర్ప నెన్నఁడును; సత్యప్రీతిఁ బాలింతు నేఁ
గర్మిష్ఠుండను; సర్వసంధ్యలను శ్రీకంఠాంఘ్రికంజాత స
న్మర్మాభిజ్ఞుఁడనై ద్విరేఫగతి నమ్మచ్ఛిష్టము ద్రేర్తు నో
ధర్మార్థప్రభవిష్ణు! విష్ణు!! ఎటు లే దండ్యుండ నైనాఁడనో!

ఆదిత్యప్రభవమ్ము, భవ్య మది నా కత్యంత తాత్పర్య మ
య్యా! దివ్యద్భవదీయవంశ మన స్వర్గానర్ఘముల్ దీర్పఁగా
నా దేవేంద్రుఁడె మిమ్ముఁ గోరు కథలన్ జిన్నప్పుడే వింటి- ని
ర్వేదం బెన్నఁడు మీకుఁ గూర్చుగతి వర్తింపన్ దురుద్యోగి నై.

అంగదువల్ల వింటిని బలాఢ్యుఁడు, క్షత్రియవీరమూర్తి, స
ర్వాంగమనోహరుం, డొకఁ డహస్కరపుత్రుని మైత్రిఁ గోరి ను
త్సంగమునందు వహ్నిఁ గొని సంగతికిన్ శపథ మ్మొనర్చి యు
త్తుంగసుఖోపభోగములతోఁ దెలువొంది రటంచు నెన్న నే.

ఆమాయావిని రూపుమాపుగతి మాకద్రిస్వమౌనంగరీ
[illegible] నేఁ గడఁగి ఘోరప్రక్రియన్ బోగుసే
తన్ మా సుగ్రీవుఁడు ద్రోహియై నిజకుఁడై రాజ్యంబుఁ గైకొన్న వాఁ
డమాయావియె నీకు మైత్రి కల్గినాఁడా! సత్యధర్మప్రియా!:

అన్నయె చచ్చె నాదమునఁ డవావశోళిని గల్చె బాహువం
దన్నతి నన్న యూహ వొడమన్ గపిరాజ్యమునందు నంగదు
న్మన్నన నిల్పి నాదచితముం దలిరిల్లఁ [illegible] పెద్దయౌచుఁ దా
మున్న మనోజ్ఞ కీర్తియును మాత్రపుధర్మము నబ్బియుండు నే.

త్యంతము నుండు నన్నుఁ బరిమార్చినలీల నటంచుఁ దోఁచు; నీ
వింతగు మార్గముం గొనఁగఁ బ్రీతికి హేతువు తెల్పవే ప్రభూ!

అతతవిక్రమోజ్జ్వలుఁడ వయ్యును హైన్యము నీకు నిచ్చి వి
ఖ్యాతిని నాకుఁ గూర్చు తెఱఁ గారసి, యిట్టు లపూర్వ లీల జీ
వాతువు నాహరించి ప్రభువా! నను ధన్యునిఁ జేసినాఁడ వీ
వో తపనీయధామ! ఇది యుజ్జ్వలమైన యనుగ్రహమ్మె యౌ!

వ్యగ్రంబైన మనంబుతో వదనమం దార్తిచ్ఛటల్ గ్రమ్మ నో
సుగ్రీవా! యిటు లుంటి వేమి? మొదలో సుంతైనఁ జింతింప కే
నగ్రభ్రాతను జంపుకొంటి నని, నా కయ్యెన్ శుభం బిందుచే
నుగ్రారుల్ గలవాఁడ నెప్డా యని నా కున్నట్టిదే మృత్యువున్.

అదటఁ బూర్వపుణ్యమున నబ్బె రమావిభుమైత్రి నీకు-ని
న్నాదనఁ గల్గువార లిలఁ గల్గరు; రక్తిని రామకార్యమ
ర్యాదను దీర్చి నిల్చి కపిరాజ్యయశోలతికాంకురమ్ములన్
బాదుకొనంగ నద్దెనలఁ బాలన సేయుము నీవె సోదరా!

అంగదుఁ డన్న నీ హృదయమందున హార్ద్రితయున్న దెన్నఁడున్
భంగము రాదు; వాఁడు ననువర్తన నిన్గొలువంగలాఁడు; స
త్సంగము వాని కిచ్చి యను తాపముఁ దీర్పుము-తండ్రినైన నా
కుంగల మైత్రిచే నిటులఁ గోరెదఁ గాని యెఱుంగు దెల్లయున్.

ఒక గర్భమ్మునఁ బుట్టి ఋతువిరజుం దుగ్ధాథవాత్సల్యమున్
బ్రకటింపన్ దమి నొక్కచోఁ బెరిగి, సర్వం బొక్కచో నేర్చి మా
కక విశ్వాసముతోఁ గవ ల్వలెను మన్నామయ్యా! రాజ్యంబుకై
యకటా! వైరము వచ్చె, తీరినది యన్నా! కౌఁగలింపంగదే!

వందియమొల్లఁ దీరినది, సర్వమయుండవు నీవు రామ! నా
వందన మిద్దిగైకొని భవచ్ఛరకర్షణకైతవాన నా
నందముఁ గూర్ప నొక్కపరి నా తనువున్ స్పృశియింపుమయ్యా! ఆ
క్రందిత మీ కపిప్రతతి; కానఁగలే నిఁకఁ గన్నుమోడ్చెదన్.

---

# ప్రమాద రక్షణకు ప్రశస్తమైనది భీమా

ఎప్పుడే ప్రమాదం వచ్చేది, ఏ క్షణం ఎలావుండేది
తెలియని ఈ రోజులలో

★ అగ్ని ★ మోటారుకారు ★ కార్మిక నష్టపరిహారం
నౌకా ★ ఫైడలిటీ గ్యారంటీ మొదలైన భీమాలకు

మాతో సంప్రదించండి:

## యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్ జెనరల్ ఇన్సురెన్సు కంపెనీ లిమిటెడ్

"బొంబే లైఫ్ బిల్డింగ్సు"

**9, బ్రాడ్వే - మద్రాసు-1**

**Telephones: 21378 & 21379** ★ **Telegrams: "UNIGEN"**

బ్రాంచీలు:

విజయవాడ - బెంగుళూరు - బొంబాయి - కలకత్తా - న్యూఢిల్లీ - పాట్నా - కొలంబో - సింగపూర్.

# కవిత్వ తత్త్వము

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

కవి, తత్త్వవేత్త, ప్రవక్త : వీరి ధర్మములను ప్రతి జిజ్ఞాసువు గ్రహింపవలెను.

కవి ప్రకృతిని పరిశీలించును. అందలి సౌందర్యమును చూచి ఆనందించును. మనమును పీడించు దృశ్యములనుగాంచి, దుఃఖపడును. సుఖ దుఃఖ బంధురమైన జగతి ఒక పర్యాయ మాతనిని నవ్వించును. వేరొక పర్యాయము ఏడ్పించును. కవి ఎప్పుడును తన గుండెను వజ్రపుశిలను జేసికొనలేడు. అది సదా కుసుమ సదృశ్యమై యుండును. భావమున కది పుట్టినిల్లు. రసమునకు నిధానము. ఎట్టి నిమిత్తమైనను—అది దొడ్డది కావచ్చును. చిన్నది కావచ్చును. కవి మనస్సును కదల్చివేయును. సంయమ గుణమును ప్రదర్శించుటకై అతడు ముందునకురుకడు. వక్రమ మార్గమున తనకు స్వతస్సిద్ధమైన ఉద్వేగమును నడుపుటకు ఉబలాటపడును, ఈ యాశయసిద్ధికి వలసినంత ఆత్మ సంయమమును అతడు వినియోగించును. కాని సంయమీంద్రులం దున్నత పీఠము నలంకరింపవలెనను లక్ష్యమాతని దృష్టియం దుండదు. ఉండుచో కవి ప్రపంచమునుండి దూరస్థుడై తత్త్వవేత్త పీఠమునో, ప్రవక్త పీఠమునో అలంకరించును. తాను చూచినది, తాను వినినది, తాను ప్రత్యక్ష పరిశీలనము కలన నెఱిగినది స్వకీయ భావనమువలన తెలిసికొనినది నైసర్గిక ప్రతిభతో, నవ నవోన్మేషశాలినియైన ప్రజ్ఞతో, రస బంధర శైలితో, ఔచిత్య సమన్విత—రచనలతో, వ్యంగ్య భూయిష్ఠ పదలితో తెలుపుట కవి కర్తవ్యము. తీవ్రానుభూతి తన గుండెను చీల్చినప్పుడు హృదయమందలి తన రసోద్రేకమును పఠిత హృదయమందును బుట్టించి, వాని గుండెను కూడ చీల్చివేయును. ఇట్టి శక్తిని కావ్య ప్రపంచమున ప్రదర్శించిన కవులు సాహిత్య సామ్రాజ్యములో సార్వభౌములను ప్రశస్తిని పడయుదురు. వాల్మీకి, వ్యాస, కాళిదాసాదుల కృతులను పరిశీలింపుడు. సీత శకుంతలాది రమణీమణుల జీవితములను వారెట్లు చిత్రించిరో పరిశీలింపుడు. నిక్కంపు జగతిలో వీరెట్టి యిక్కట్టులు అనుభవించిరో ఎరుంగము. వీరి ప్రత్యక్ష జీవితమును ఈ కవులు చూచియే యుండరు. వీరి పాత్ర చిత్రణమున భావన ఎక్కువపని చేసినది. భావన క్రమను పరీక్ష చేయువారెవరు? దాని రెక్కలు విఱుచు వారెవరు? దానికిగల స్వాతంత్ర్యము ఔచిత్య పరిధి నతిక్రమింపకున్నంతవరకు, నిరంకుశమైనది. కావున రస జలధి ఉత్తాల తరంగసంకులమై, పఠిత హృదయమందును, భువనలోను విజృంభించును. సీత వనవీథులందు ఏకాకినియై, విండుమూలాశై అంగలార్చినది. శకుంతల పతిచే గుర్తింపబడక సాంద్ర కాంతారమందు వన్య పశువులందు మసలినది. సీతా శకుంతలలు భయంకర వనములందు ప్రసవించిరి. వారి భర్తలు లోకారాధ్యులు. కాని ప్రాకులాడగా, మునులయండ వారికి దొరికినది. మేనక విడిన పసిబిడ్డను పక్షులు పెంచినవి. ఈ పనులు కావ్య ప్రపంచమున సుసాధ్యములైనవి. ప్రత్యక్ష ప్రపంచమున ఇట్టి దృశ్యములు గోచరించెనుటకు ఎందును రుజావు అగపడదు. శ్రుతిమించిన రసోద్రేకము అందమైన అబద్ధమునే వలచి కావ్య ప్రపంచమున మహత్తరపాత్ర సృష్టియందు స్వీకరింపబడుచున్నది.

ఆంగ్ల వాఙ్మయమున షేక్స్పియరాదులీ కర్తవ్యమును నిర్వహించిరి. అతని విషాదాంత నాటకములందీ కర్తవ్యము విశదముగా అగపడుచున్నది. షేక్స్పియరు తన కృతులకు వలసిన ఇతివృత్తములను ఒరుల గ్రంథములనుండి గైకొనెను. అతడు గైకొనిన మాతృకలు అంతగా రస భరితములని తెలుపలేము. దుమ్మును చేపట్టి షేక్స్పియరు బంగారు చేసినాడు. అందలి కథలను చదివిన షేక్స్పియరు హృదయ సముద్భవ రససింధువున దేలియాడి తన కృతులను రసప్లావితము లొనరించినారు. 'ఒథెల్లో' నాటకమును పరిశీలింపుడు. షేక్స్పియరు గ్రహించిన మాతృకలో ఒథెల్లో డెస్డిమోనాను చంపినట్లులేదు. కాని షేక్స్పియరు భర్తచే భార్యను చంపించినాడు. తరువాత తాను చంపుకొనినాడు. షేక్స్పియరు భావనమున, సృష్టియైన ఘట్టములు. అసత్యమని విషయము తేలిన యెడల కథాశక్తి చచ్చును. కావ్యము రస రహితమే యగును. ప్రత్యక్ష రంగమున దృశ్య కావ్యము ప్రదర్శింపబడినపుడు సత్య సంఘటనమే దృగ్గోచరమగుచున్నదని ప్రేక్షకులు గ్రహించి, పాత్రలవలె తామును ఏడ్తురు. తామును నవ్వుదురు. నట్టి నాటకమనిన, దొంగయేడు పనిన, రసానుభూతినందువారెవరు? కార్డీలియా లియరుల దుర్దశను పరిశీలింపుడు. ఇది తీవ్రమైన ఆవేగమును సృష్టింపదా?

ప్రతికూల శక్తుల సంఘర్షణము లేనిదే కావ్యసృష్టియేలేదు. రామాయణమందొకవైపున సీతారాములు, హనుమంతుడు, లక్ష్మణ భరతులు గలరు. ఎదుటివైపున రావణ కుంభకర్ణాదులు, శూర్పణఖ ప్రభృతులున్నారు. దైవీ శక్తి, ఆసుర శక్తుల పరస్పర యుద్ధము రామాయణ కావ్యమున కవసరమైనది. భారతమున కురు పాండవుల యుద్ధమున వ్యతిరేక శక్తుల విజృంభణములేదా? షేక్స్పియరు శిష్టుల పాత్రలను సృజించి, దుష్టులతో వారి సంఘర్షణ మెట్లు చెలరేగించెనో ఎరుగమా? ఐయాగో, ఎడ్మండ్, మూడవ రిచార్డు, గానరిల్, రీగాన్ లేడీ మేగ్‌బెత్—దుష్టులసృష్టి అతనికి మిగుల అక్కరాయెను. మెఫెస్టఫిల్స్ రాబరుల సృష్టి గెటేషిల్లరులకు అవశ్యకమైనది. దుష్టులు శిష్టులను పీడింపజాలిరి.

భారత కవులీ చెట్టుకు పూనుకొనరు. నాటకమును వీరు విషాదాంతముచేయలేరు. వీరి చేతిలోని ఇతివృత్తము, కొండొకచో గుండెలను దడదడ లాడించినను, రుధిర ప్రవాహమున కడముట్టదు. విషాదఘట్టమును మాపు జేయుటకై అతిలోక శక్తులు, దివ్య శక్తులు ముందంజ వేయును. పరమశివుడు ప్రత్యక్షమై హరిశ్చంద్ర జీవితఘట్టమును సుఖాంతము చేయలేదా? ఒక్కొక్కప్పుడు కత్తిదెబ్బ పూలదండగా మారలేదా? ఇది ప్రాచీన భారతీయకావ్యప్రథ. దీని ననుసరించి కావ్యవీధులు ముల్లోకములందు విస్తరించినవి. దివినుండి భువికి దిగవచ్చినవారును, భువినుండి దివిమీదికి పోయినవారును మనకు పరిచితులే! మేనక దిగి రాకున్న యెడల, శకుంతల ఎట్లు జనించును? శాకుంతల మెట్లు సృష్టి అయ్యెడిది? కాళిదాసు కృతిలోని ఊర్వశి ఎవ్వతె స్త్రీ? అప్పుడప్పుడింద్రుడు స్వర్గమునుండి నిలమీదికి దిగిరావేడా? ఇంద్ర సభలోకదా వశిష్ఠ విశ్వామిత్రులకు వాదము సాగినది! సమవర్తి పితవాహుడగుట, మనసును పవనవాటికయగుట మన కావ్యవీధులందు సుసాధ్యములు. భయంకరమైన అగ్ని జ్వాలలు మంత్ర పురశ్చరణమువలనగాని, జానకీ సంస్పర్శ వలనగాని చల్లారలేదా? మన పతివ్రతల [illegible]

పంచభూతములు ప్రచ్ఛన్న వేషములతో మసలినవి. కొండగోవడి వృక్షత్తలను గోలుపోయినవి. తాత్కాలికముగ వేఱు సత్త్వ మందినవి.

ఆధునిక కవులు ఈ రీతి విద్ధూరములను తమ కృతులందు చేర్పలేరు. నేటి దృక్పథమువేఱు. నేటి విశ్వాసము వేఱు. వెనుకటి విశ్వాసము పద్యజీవనపు ఇతివృత్తలందు ప్రవేశింపలేదు. ఆ విశ్వాసముతో నేటి కవులు కావ్యములను రచింపనుద్దేశించిరేని, వెనుకటి కథలనే ఆశ్రయింపవలెను. కావున నేటి కవులు రామాయణాది గ్రంథములను మరల వ్రాయుచున్నారు.

"నవ జీవన సమస్య లెన్నెన్నో యుండగా వెనుక చూపేల?" అని ఆధునికులు ప్రశ్నింతురు? నవ జీవనమును చిత్రించుట పాడియే! చిత్రించుట ఆవశ్యకము కూడ. మన మెఱిగిన ఘట్టములందు, మనకు ప్రత్యక్షమైన పరిస్థితులందు వాస్తవికతకే ఎక్కువ చోటు కలదు. కావున ఆధునిక సాహితిలో వాస్తవికతకు, అతి వాస్తవికతకు విశేష స్థానము కలదు. శరచ్చంద్రాది నవలా రచయితలు వాస్తవిక జీవితమునే చిత్రించిరికదా!

మతములు, మనసార్వతములు పరిఢవిల్లు నంతకాలము—ఇవి సృష్టి తుదముట్టువరకు ఉండునవే!—నిశిత యోచనను అధికరించు భావనము మనుష్యాంతరంగమున విజృంభించు సన్నివేశములు జీవితమున పొడచూపునంత కాలము పౌరాణిక పాత్రలును, ఇతివృత్తములును కవుల కలములను ఆశ్రయింపక తప్పదు.

వాస్తవికత కేవలము ప్రత్యక్ష జీవితమునకే సంబంధించినదికాదు. అంతరంగిక జీవనమునకుకూడ సంబంధించినది. మనుష్య మానసగ్రథనమునకు ప్రతికవి అవగతుడై యుండవలెను. చింతాశక్తి, భావనాశక్తి, సంకల్పశక్తి మనసుకు స్వతస్సిద్ధములు. ఇంద్రియములకు మనస్సునకు అవినాభావ సంబంధముగలదు. మనసునుమించిన శక్తి, బుద్ధిశక్తి. బుద్ధియోగము నభ్యసించనివాడు ఒక్కొక్కప్పుడు బుద్ధిరహితునికంటె అధముడై, దారుణానుభూతులకు గురియగును. బుద్ధినిమించిన శక్తి బోధ లేక ఆత్మ. కఠోపనిషత్తులో వర్ణింపబడినట్లు, శరీరము రథమని, రథమునకు గట్టబడిన హయము లింద్రియములని, వీనికి గట్టబడిన పగ్గము మనస్సనియు, దానిని చేబూనిన సారథిబుద్ధియనిగుర్తించితిమేని జీవనరథ మీ సారథివలన నడుపబడుచో, అది సక్రమముగ నడచును. ప్రబతుకులో నొడు దుడుకు లుండవు. అవు డితివృత్తములులేక కావ్య ప్రపంచము మరుభూమి యగును. అంతరంగిక శక్తులందు, సమన్వయము లేనపుడు సముచిత సక్రమాభివృద్ధి లేనపుడు, విప్లవములు, విషాదములు ఘటించుచుండుట తప్పదు. తన కృతులందు షేక్స్పియరు మహాకవి ఈ విషయమును చక్కగా దృష్టాంతీకరించెను. ఐయాగోకు మేధాశక్తి కలదు. అతడు హృదయములేని పిశాచము. డెస్డిమోనా ఒథెల్లో లియరులుహృదయశక్తిగలవారు.చింతాశక్తి అంతగా వీరికిలేదు. కావున వారి జీవనము విషాదాంతమైనది. హేమ్లెట్‌కు విశేష మేధాశక్తి కలదు. కాని సంకల్పశక్తిలేదు. మెక్‌బెత్ లేడీమేక్‌బెత్‌లకు హృదయములేదు. కావున దుష్క్రియకు గడంగిరి. అతిథియైన స్కాట్లండు యేలిక డంకను నిదురించుచుండగా, హత్య జేసిరి. కాని ఈ దుష్టుల చేతికి కవి విజయపతాకమునందింపలేదు. వారును తమ చేత లొగ్గిన యుచ్చులందు తమ కుత్తుకలు జొప్పించిరి.—అట్లు చొప్పింపక తప్పినదికాదు. "King Lear" నాటకములోని ఎడ్మండ్ "Julius Caesar" నాటకములోని, కేసియస్ "Political Iago", దుర్గతియందు గూలబడలేదా?

నిర్దుష్టాంతరంగిక జీవితమాత్రముల ననుసరించి బాహ్యజీవనము నడచిన యెడల అది మిత్రుపల్లములందు బోర్లగిల పడదు.

మానవుడు స్వతస్సిద్ధముగా దేవుడే! తన్ను దాను గుర్తింపనితరి ఇతడు పశువువలెనో, దానవునివలెనో ప్రవర్తించును. కావున వీరు దుష్క్రియలు చేతురు. వీరిలోని అసురశక్తి చెలరేగును. అట్లయిన వీరి యందలి దైవీశక్తి నశించిపోయినదని తలపరాదు. "Cloister and Hearth" అను నవలలో భయంకరముగ విజృంభించిన వ్యక్తి కథలోనిఒకానొక ఘట్టములో కారుణ్య శరధి కాలేదా? రవీంద్రుడు సృజించిన "కాబులీవాలా" కథలోని అంతరార్థమేమి? అతడు చోరుడు. కారాగృహములో కొంతకాలముండి బయలుబడినాడు. ఒక బాలికను వీక్షించినాడు. ఆమెతో ఆటలాడినాడు. సప్తరాగ సందీప్తమైన వియత్తలము నవలోకించి—ఆశ్చర్యాన్వితుడైనాడు. గగన సౌందర్యమును ప్రశంసించినాడు. తన యంతరంగమందలి సౌందర్యమును వ్యక్తీకరించినాడు. తన హృదయము నుండి ఈశ్వర సామ్రాజ్యము బహిష్కరింపబడలేదని తన ప్రవర్తనవలన ద్రువపరచినాడు.

మనుష్య మానసమునకు ప్రతీకారము సహజమైనది కాదని, ప్రసన్నత నైసర్గికమైనదని తమ పాత్రసృష్టిలో మహాకవులనిరూపించిరి. పశ్చాత్తాప మెరుగని పాపిలేడు. పశ్చాత్తాపము సత్యజ్యోతిని చూపజాలును. అంతరంగమందలి అమృతసరస్సును వ్యక్తమొనరింపగలదు. అనుకంపను, అనురాగమును వ్యక్తమొనరింపజాలును. అనుతాపమందు జీవాత్మపరమాత్మల సన్నిహిత సన్నివేశము దృగ్గోచరమగును కదా!

ఉద్వేగభావముల నిధానము హృదయము. దైవశక్తి అలంకరించిన పూజాపీఠము కూడ హృదయమే. కవితా పూరము గంగోత్తరివలె అందే యుదయించును. ఈ పూరము రెండుగట్లనడుమ ప్రవహింపవలెను. కావ్యమునందు విరోధము ఉద్రేకము ననుసరించును. కావున ధునీపూరము కోయిల కుత్తుకనుండి వెలారు గానఝరివలె మాధుర్యసహితమై యొప్పును. ఆంగ్ల రాజ్యాంగములోని విరోధ విధానమువలె కవిత్వశైలిని వెలయును. ప్రేమయనుడు, భక్తియనుడు హృదయమం దుద్భవించును. కవిత్వము, గానము, నృత్యము ఇవి తమ సంయుక్త శక్తివలన (పురుటింటిలో డింభకుడైన శ్రీరాముని చేబట్టిన ముగురమ్మలవలె) భావోద్వేగమును తమయందు జేర్చుకొనును. ఈ దివ్య సృష్టి నవలోకించి ముల్లోకములు పులకితగాత్రములతో మత్రూఢ లగును. దిక్కామినులు హసన్ముఖులగును. చండీదాసు, విద్యాపాథ, కాశీనాథ, కృత్తివాస, జయదేవ, నర్సీ మెహతా, అభంగ గాయక శ్రేష్ఠులు,

మీరాబాయి, ఆళ్వారులు, పోతరాజు, త్యాగరాజు, రామదాసు, సూరదాసు ప్రభృతు లిట్టి కవులు. వీరి కవిత్వము పూర్వోక్తరీతిని త్రిగుణాత్మకమైనది. ప్రపంచ మహా కవులు కృతులు ఇట్టి యుదాత్త లక్షణములు కలవి. రససిద్ధినందిన మహాకవు లిట్టివారు. యోగులకు సంయమశక్తి కలదు కదా. ఇది వీరి తన్మయత్వమునకు సహాయి. రెండింటి సంయుక్త ప్రభావము మధురగాన మూర్ఛనమువలె, మంజుల నృత్య భంగిమముమాడ్కి వ్యక్తమగును. ఈ సృష్టికి దీటైనది నటరాజ నృత్యమే! బృందావన విహారి నృత్యమే! కమలభవుని నర్తనమే! చైతన్య ప్రభువు నృత్యమే!!

మన భక్తులను పోలు వ్యక్తు లితర దేశములందు ఎందరున్నారు? కొరేమో! అయినను మహిమాధ్యులు అందును గలరు. డాంటే మహాకవి అనురాగము బియా ట్రిస్ దిక్కుగా దివ్యవిహగమువలె పరలోకమును స్పృశింపలేదా? పుణ్య జీవియైన మిల్టన్ కవిత్వము గంభీర వైదుష్య భరితమై, ఉత్తాల తరంగ సంకులమైన ఉదధివలె ఉప్పొంగి, వియత్తలమును మహిత భావ ప్లావిత మొనరింపలేదా? హెూమరు భక్తశ్రేణిలోనివాడుకాడు. అతని రచనలో వీరరసము, ఆదేదత్రోప్ కమును రేకెత్తించు కల్పనము, ఆవేగ చలిత పద తరంగవర్తనము "ఓహో!" అనిపించవా? షేక్స్పియరు నాటకములందు ఇందును, అందును సానెట్సులోను ఈ రీతి శక్తి వ్యక్తమగును. షెల్లీ, కీట్సు, వర్డ్స్వర్త్, రవీంద్రులు సృజించిన శకుంతములను పరిశీలించి, వాని ప్రత్యేక ప్రభావమునుగురించి వేయి పుటలను వ్రాయజాలని వారెవరు? షెల్లీ పక్షి (స్కైలార్క్) మహోత్సాహముతో మొక్కలి నందుకొనుటకో యన గగనమున నెగయును. కీట్సు విహంగము, సౌందర్యసృష్టి— సృష్టికి దృష్టాంతము. వర్డ్స్వర్తు సృజించిన పికరము తాత్త్విక చింత గలది. మేఘవీధులందు అల్లనల్లన ప్రాకుచు, భువిమీద తరు శాఖలలోని కులాయమందలి తన నిసుంగుల నవలోకించుచుండును. ఐహికాముష్మికాశయముల సమన్వయము నాతని శకుంతము సూచించును. క్రైస్తవుని దృష్టి, ఊర్ధ్వముగ దిరుగును. భారతీయుల దృష్టి అంతరంగములోనికి మరలును. అంతర్యామికి, సర్వాంత ర్యామికి అతని హృదయము సుపరిచితమైనది. రవీంద్రుని విహంగము సందీ భావములు వ్యక్తమగును. వ్యక్తి శక్తినుండి సంప్రదాయశక్తి చెదరిపోదని వ్యక్తి గత కవిత ప్రకటించదా?

వంగ వైష్ణవ కవులందలి భక్తిపూరమును మనసార గ్రోలిన అదృష్ట వంతుడు రవీంద్రుడు. "సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా" అను సూత్రమును పురశ్చరణ మొనరించి, తన కవితకు రవీంద్రుడు పరమ ప్రేమ రూప మొసగి నాడు. నారద భక్తిసూత్రములను షెల్లీ కవి పఠించెనని తెలుపలేము. కాని కవి హృదయము విశ్వవిస్తృతమైనదికదా! కవి హృదయమునుండి, భక్తుని హృదయమునుండి వ్యక్తమైన సూక్తులు సూత్రములగునుగదా! వియత్తలము దిగ్వలయముల ధాత్రిని చుంబించినపుడును, రవికిరణములు కుసుమ సీమంతినిని ముద్దాడినపుడును, కౌముది సంపూర్ణ కల్ప చెల్వము పక్కున నవ్వించినపుడు అను రాగ ముప్పొంగదా! "ప్రేమ తత్త్వము" అను తన పద్యమున షెల్లీ కవి విశ్వ మంతయు ప్రేమ బంధురమని వర్ణింపలేదా?

"అమృత స్వరూపాచ". భక్తిరసము అమృతమగుటవలన భక్తులైన కవుల హృదయములు సుధాపూరితములైనవి. కావున సూక్తిసుధానిధులు మనకు నువరి చితులైరి.

"యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవతి. అమృతో భవతి తృప్తో భవతి." రస సిద్ధి, ప్రేమసిద్ధి, అమృతసిద్ధినందిన మహా భక్తులైన మహా కవులు లలిత భావ స్ఫుర వాగ్వల్లీ డోలికలం దుర్రూగలూగిరి.

"యత్ప్రాప్య నకించిత్ వాంఛతి నశోచతి
న ద్వేష్టి న రమతే నోత్సాహీ భవతి"

ప్రాకృత వాంఛలను కాలదన్ని అమృత సరస్సున నీదులాడు కలహంసలైన కవులు తమ తన్మయత్వమందే తనియుచుందురు కదా!

"యజ్జ్ఞాత్వా మత్తో భవతి స్తబ్ధో
భవ త్యాత్మారామో భవతి"

భక్తి యోగ, జ్ఞాన యోగ సంయుక్త ప్రజ్ఞనందిన మహా కవులు వాల్మీకి వ్యాసాది కవులు, పురందరదాసు, త్యాగరాజు, నారాయణతీర్థ, శ్యామాశాస్త్రి, దీక్షి తార్ మున్నగు గాయక శిఖామణులు మకరందమును గ్రోలిన మత్తద్విరేఫముల

తారె మన్మతున్తరై, రసజ్ఞుల చిత్తములను తమ కవితానంక్తులం దూగించు టెఱుగరూ?

సుందరమై, ఉదాత్తమైన భావము అందచందాల యల్లికలో కవిత సావ సుందరియై, కావ్య రంగమున గోచరించును. అభావ, భావము కవితకు ఆయువు వంటివి. అర్థ గౌరవముగల పదములం దివి వ్యక్తమగును. రసౌచిత్య వ్యంగములు కావ్య వాఙ్మయమునకు స్వతస్సిద్ధములై యుండును. ఇందలి భావము జ్యోతిర్మయమై వెలయును. కావ్యసృష్టి కెట్టి ప్రతిభ యవసరమో, ఆ సృష్టి యందలి మహత్త్వమును గుర్తించుటకును అట్టి ప్రతిభ యవసరము. రుచు లందును, వ్యత్యాస ముండరాదు. ఇవి వేరైనయెడల విమర్శకుడు కావ్య విభూతిని, కవితా సంపదను వక్ర దృష్టితో వీక్షించును. వర్డ్స్‌వర్తు మెకాలే లిరువురును ఆంగ్ల సాహితీ సామ్రాజ్యమున ప్రముఖ వ్యక్తులే! కాని వారి దృక్పథములందు కొంత వ్యత్యాసము గలదు. వర్డ్స్‌వర్తు కృతులను పరిశీలించి, అతనిని గురించి మెకాలే తన డైరిలో ఇట్లు వ్రాసికొనెను. “వర్డ్సవర్త విరక్తి పుట్టించు వ్యక్తి. వంచకుడు, ఎలుక”. వర్డ్స్‌వర్తుకవి రచనలో అధికాక్షరములందు అల్పార్థముగల విషయము కొంత యుండుట నిక్కమేకాని అల్పాక్షరములందు అధికార్థముగల పంక్తులను గూడ విశేషముగా నాతడు రచించెను. కావున మెకాలే దుర్విమర్శ కాతడు గురి కారాదు. ఎల్లరకు తెలిసిన భాషయందు శైలి యుండవలెనని అనేకులందురు. ఈ “యెల్లరు” కావ్య రస మారాధించి కావ్య మహిమను గ్రహింపజాలు జిజ్ఞాసువులై యుండవలెను. ఒక్కొక్క రసము ఒక్కొక్క రీతి శైలిని వలచును. ఇది లలితమై, సరళమై యుండవచ్చును. పాఠకుని హృదయము దీని మెచ్చజాలునదై యుండవలెను. షేక్స్పియరు కృతిని బెన్‌జాన్ ప్రభృతులు మెచ్చినను, గ్రీన్ మున్నగు సమకాలికులు మెచ్చలేదు. ఇటీవలి టాల్‌స్టాయ్ షేక్స్పియరు మహా కవిని ప్రశంసింపలేక పోయెను.

కవి తాత్త్వికుడు కావచ్చును. భావ వ్యక్తీకరణములో ఇరువురకును వ్యత్యాసము కలదు. అంతరార్థమును తన వ్యాఖ్యానమందు స్పష్ట మొనరించువాడు తత్త్వవేత్త. కవి వ్యాఖ్యానములోనికి, దిగరాదు. ఉపన్యాస ధోరణి కవిత్వమునకు గిట్టదు.

ప్రవక్త “జీవిత మిట్లుండవలెను. ప్రవర్తన మిట్లుండవలె”నని తెలుపును. ఈ వైఖరి ఈ ధోరణి కవి కుండరాదు. తాత్వికవిభూతి, ప్రవక్త గుణాతిశయము కవి సృష్టిలో రసానుకూలముగ వ్యక్తమగుట పాడి. కవి యంతరంగమున బ్రహ్మాండ మంతయు నిండియుండగా, జగదీశుడే అందు తన పీఠమును నెలకొలుపుకొని యుండగా తాత్వికునకును, ప్రవక్తకును అందు చోటులేదని తెలుపు వారెవరు? తన యద్భుత సృష్టివలన తాను పరితృప్తినంది, తన కవితా తపస్సులో కవిత్వ తత్త్వ ప్రదర్శనమున ముముక్షువై అమరజీవియై కవి మోక్ష లక్ష్మీ సాక్షాత్కారము నందగలడు.



# పదిఏండ్ల ఆంధ్ర రాజకీయాలు

### శ్రీ పి. వి. నరసింహారావు

క్రిందటి పది సంవత్సరాలలో ఆంధ్రజాతి చరిత్రలో చీకటి వెన్నెల, మంచి చెడు, ఔన్నత్యము అధఃపతనము-అన్నీ వున్నాయి. ఏబది సంవత్సరాలుగా కలలు కని కని ఆంధ్రరాష్ట్రాన్ని సాధించిన ఉజ్జ్వల సంఘటన ఈ పది ఏండ్లలోనూ జరిగింది. ఇందుకు ఒక నిష్కామయోగి త్యాగము అవసరమైనా, దాని వెంట అధికార దాహంగూడా ప్రజ్వలించింది. ఒక వైపున వాచా గాంధీ సిద్ధాంతాల పురశ్చరణం సాగుతున్నట్లే, ఆ సిద్ధాంతాలను ప్రతారించటంగూడా వుంది. ఐకమత్యం వుంటేగాని అభ్యున్నతిలేదని ఆడంబరాలను ఆలపించడంతోపాటు, జాతిని అధస్థితికి తీసుకుపోయే అనైక్యతను కులతత్వాల ద్వారా, పదవీ వ్యామోహం ద్వారా, ప్రాంతీయ దురభిమానం ద్వారా దారివేయడం వుంది. ఆంధ్రరాష్ట్రం రాగా విశాలాంధ్రకోసం కలలుకంటూ, ఆంధ్ర, రాయలసీమ, సర్కారు ప్రాంతాలని రాష్ట్రాన్ని మనసా విభజించి, సిద్ధించిన విశాలాంధ్రలో, అర్థములేని వ్యర్థమైన స్పర్థలను ప్రోదిచేయడం వుంది. దూరదృష్టి కల్గి వ్యవహరిస్తున్నట్లు నటిస్తూ, ఆచరణలో హ్రస్వదృష్టిని ప్రదర్శించడం, ఆపద్ధర్మంగా ఎప్పుడో చేసుకున్న ఒడంబడికలను పాలించని పక్షంలో రాష్ట్ర నిర్మాణ కార్యక్రమాన్నే నిర్వీర్యం చేయడానికి పూనిక వహించడం, విశాలాంధ్రావతరణకు అట్టి ఒప్పందాన్ని ఒకదాన్ని చేసుకొని, దాన్ని మట్టిపాలు చేయడం, ఇది అంతా స్వార్థం కోసం చేస్తూ, రాష్ట్రంకోసం, రాష్ట్ర ప్రజలకోసం చేస్తున్నామని అపలపించడం వుంది. రాష్ట్రం అభ్యుదయాన్ని గమనించక, విశాలాంధ్ర ఏర్పడనున్న సమయంలో వైయక్తిక లాభ కాంక్షతో, కర్నూలులో ప్రజా ధనాన్ని రాజధాని నిర్మాణంపేర దుర్వినియోగంచేసి రాష్ట్రం అంతటా రాజకీయంగా రవరవలు పెంచడంవుంది. పార్టీ ప్రతిష్ఠనుగూర్చి, పార్టీ గొప్పతనాన్నిగూర్చి ప్రసంగాలుచేస్తూ, ఆ పార్టీ తనకు ఉపయోగపడనప్పుడు దానికినీళ్లు తోడటం ఒక వైపునా, పార్టీ పేరుతో స్వార్థాన్ని, ముఠా విజయాన్ని పండించుకుంటూ వుండడం ఇంకోవైపునా, వ్యక్తికంటే సంస్థ గొప్పదనడం ఒకవైపునా, వ్యక్తికోసం సంస్థను ఉపయోగించుకోవడం ఇంకో వైపునా, హరిజనుడు ముఖ్యమంత్రి అయినందుకు నకిలీ సంతోషం ఒక వైపునా, ఆ హరిజనుణ్ణి కూలద్రోసే సవర్ణ దురహంకారం ఇంకోవైపునా, కమ్యూనిస్టువిజృంభణను అరికట్టటంలక్ష్యం అనడం ఒకవైపునా, స్వార్థలాభం కోసంవేసే ఎత్తులతో రాష్ట్రంలో ఉకలుకలు పెంచి, కమ్యూనిస్టు విజయానికి ప్రోదిచేయడం ఇంకోవైపునా, ఆశ్రిత పక్షపాతము, బంధుప్రీతి, కులాభిమానములు తగదను ధర్మోపదేశములు ఒకవైపునా, బంధువులను, ఆశ్రితులను, స్వకులస్థులను అందుబాటులోవున్న ప్రతిపదవికి పైకి ఎత్తడం మరొకవైపునా, నీతిఒకవైపునా, అవినీతి మరొకవైపునా ఈ పది సంవత్సరాలలో విశృంఖలంగా రాష్ట్రంలో ఏలుబడి సాగించాయి. విచిత్రం ఏమంటే, ఇది అంతా సంస్థ పేరున వ్యక్తులు నడిపిన నాటకం; ఇది చరిత్ర, చరిత్రయొక్క ఆభాస.

చరిత్రలో సంస్థలు ఎప్పుడూ గొప్పవిగానేవుంటాయి. కాని, ఆ సంస్థలను చేపట్టి నిర్వహించే వారు, ఎంత గొప్పగా వ్యవహరిస్తున్నారన్నదే, ఆసంస్థల కీర్తిప్రతిష్ఠలకు, నాయకత్వంవిశిష్టతకు గీటురాయి అవుతుంది. అందువల్లనే వ్యక్తుల మంచిచెడ్డలనుబట్టి, సంస్థలు పెరగడం, తరగడం సంభవిస్తూ వుంటుంది. కనకనే వ్యక్తిగతమైన వ్యవహారాలు రాజకీయాలకు కీలకమౌతున్నాయి. 1952 నుంచి 62 వరకు, పదేళ్ల ఆంధ్ర రాజకీయాలను పర్యాలోచన చేయడంలో కూడా, రాజకీయనాయకులుగా రంగంలో నిలిచినవారు ఆ యా సందర్భాలలో ఎలా వ్యవహరించారనేది పరిశీలనాంశం కావలసివుంది.

అది అదృష్టమనండి. దురదృష్టమనండి. ఆంధ్రలోని నాయకులకు ఆరంభంనుంచి వ్యక్తిగతమైన భేషజాలే హెచ్చుగా వుంటూ వచ్చాయి. ఏ విషయంలోను వారు రాజీ పడడమనేది ఎరగరు. అపజయాలకు జంకరు. చిత్తశుద్ధికి లోపం రానివ్వరు. ఏదో ఒకవిధంగా ప్రజలను తమ మార్గాన కొనిపోవడానికి ప్రయత్నిస్తారు. అవసరమైతే మాతృసంస్థలను కూడా ధిక్కరిస్తారు. శ్రీప్రకాశం, శ్రీరంగా రాజకీయాల చరిత్ర ఇందుకు నిదర్శనం.

ఆంధ్రులు ఎదుర్కొన్న ప్రతిప్రధాన సమస్యలోను, నాయకత్రయంగా చెల్లిన ప్రకాశం—పట్టాభి—రంగాగార్లు తామువిశ్వసించిన మార్గాలనే ముక్కుకు సూటిగా అనుసరించారు. మద్రాసురాష్ట్ర ముఖ్యమంత్రి పదవినుంచి, అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షపదవివరకు, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణంనుంచి విశాలాంధ్రావతరణవరకు, జమీందారుల రద్దునుంచి సహకారవ్యవసాయాభివృద్ధివరకు, రాజధాని నిర్ణయంనుంచి రాష్ట్ర మంత్రివర్గ నిర్మాణంవరకు ఆయా సమస్యలపై, ఆ యా సమయాలలో ఈ నాయకత్వం ఉమ్మడిగా కలిసి, మెలిసి వ్యవహరించిన నిదర్శనం ఎక్కడా కనిపించదు. అలా అని ప్రజలు వీరిని అనుసరించలేదని చెప్పడానికి వీలుపడదు. ప్రజాపార్టీ, ప్రజా సోషలిస్టు పార్టీ, లోకపార్టీల ద్వారా శ్రీ ప్రకాశం, శ్రీ రంగాగార్లు తమకుగల విభిన్నత్వాలను చూపుకున్నారు. జాతి జీవితంలో చెలగాటలాడారు.

శ్రీ పట్టాభిగారు అలాకాదు. ఆయన మేధావంతుడు. రాజకీయ చతురత తెలిసినవాడు. ప్రజానాయకులుగా తనకు అండగా నిలవగలవారిని తయారు చేసుకున్నారు. వారి ద్వారా స్థానికంగా బలం పెంచుకొని, అఖిల భారత నాయకత్వాన్ని స్థిరపరచుకున్నారు. ఒకవైపున బ్యాంకులు, భీమా సంస్థలు, చరఖా సంఘాలతోపాటు, మరొకవైపున జిల్లాల స్థాయిలో యువక నాయకులను పెంచారు. ఆవిధంగా సంస్థలను, నాయకులను పెంచిన కీర్తి ఆయనకు దక్కింది. వ్యక్తిగతంగా ఆయనలో బలహీనతలు చూపేవారు కూడా ఈ విషయాలను హృదయపూర్వకంగా అంగీకరిస్తారు.

ఇక శ్రీ ప్రకాశంగారు ఇలాకాదు. ఆవేశపరుడు. సంకల్పబలం కలవారు. ప్రజలను, పార్టీలను తనకు లొజ్ఞగా చేసుకున్నవారు. చివరకు అఖిల భారత కాంగ్రెసు నాయకత్వాన్ని కూడా ధిక్కరించారు. అందువల్లనే ఆయన పొందిన

నాయకత్వం, ఆయన పెట్టిన సంస్థలు మిగలలేదు. తానే ఒక సంస్థగా ఆయన వ్యవహరించడంతో ఆయన అనుచరులు, ఆయన పెట్టిన పార్టీలు ఆయనతోనే అంతమయిపోయాయి. ఆయన మహాశక్తికి జోహార్లు చెప్పేవారు కూడా, లోలోపల ఈ సంగతే చెప్పుకుంటారు.

మిగిలిన శ్రీ ఎన్. జి. రంగా మమ్మూర్తులా శ్రీ ప్రకాశంగారి లక్షణాలు కలవారే. కాకపోతే ఒకరు ప్రజా నాయకులు. మరొకరు రైతు నాయకులు. శ్రీ ప్రకాశంగారిని, ఆయన అనుచరులు ధిక్కరించలేరు. కాని శ్రీ రంగాను ధిక్కరించగలరు. ఉభయులూ పార్టీలు పెట్టారు. ప్రతి కక్షలను కొట్టారు. కక్ష తీర్చుకోగలిగారేకాని, స్వపక్షాలను మిగుల్చుకోలేకపోయారు.

నాయకత్వం నిలబెట్టుకోవాలంటే నమ్మినబంట్లుగా పనిచేసేవారు కొందరు వుండాలి. అలా కేవలం బంట్లుగావున్నా చాలదు. అలాంటివారంతా తమ నాయకునికోసం ప్రాణమివ్వడానికి సిద్ధపడాలి. నేటి రాజకీయరణరంగాలలో ప్రాణమివ్వవలసిన అవసరం వుండదు కాని, వున్న పదవులను వదులుకొనడానికి మాత్రం తయారుగా వుండాలి. అలాంటి నమ్మకస్తులు అందరి నాయకులకు దొరకరు. ఒకవేళ దొరికినా, వారిని సక్రమపద్ధతులలో వినియోగించుకొనడం అందరి నాయకులకు చేతకాదు.

శ్రీ ప్రకాశంగారికి నమ్మినబంట్లు కొందరు వున్నారు. ఆయనకోసం వారు అనేక త్యాగాలు చేశారు. తమనాయకుడు ప్రజానాయకుడు అనిపించుకున్నారు. శ్రీ ప్రకాశంగారు కూడా వారిని తనకు కావలసిన మేరకు వినియోగించుకున్నారు. అంతే. అందుకనే ఆయన తర్వాత ఆయనక్రింద పెరిగిన వారికి నాయకత్వం దక్కలేదు. ఆంధ్ర రాజకీయాలలో ఆయన ఘట్టం ఆయనతోనే ముగిసింది.

ఇక శ్రీ రంగాగారు మాత్రం శ్రీ ప్రకాశంవలెనే రాష్ట్రంలో పెత్తనమూ కోరారు. డాక్టరు పట్టాభిగారివలె అఖిలభారత నాయకత్వాన్నీ వరించారు. శ్రీ రంగాలో ఈ ద్వంద్వప్రవృత్తి వున్నందువల్లనే ఆయన అనుచరులు ఎప్పటికప్పుడు స్థిరత్వాన్ని కోల్పోతూ వచ్చారు. నమ్మినబంట్లు సంఖ్యతగ్గిపోతూ వచ్చింది. శ్రీ రంగా అంటే రాజకీయాలలో రంగులరాయుడనే అపకీర్తి తెచ్చుకున్నారు. అటు రాష్ట్రనాయకత్వమూ లభించలేదు. ఇటు అఖిలభారత నాయకత్వమూ దూరమైపోయింది. చివరకు రెండింటికీ చెడిన రేవడి చందమైంది శ్రీ రంగా రాజకీయం.

డాక్టరు పట్టాభిగారు మాత్రం స్థిరంగా నిలిచారు. రాష్ట్రస్థాయిలో తీరని కోరికలువున్నా, తన తర్వాత రాష్ట్రంలో పెత్తనం తన వారుగావున్నవారికి వచ్చేటట్టు చేశారు. అఖిల భారత నాయకులుగానే పండిపోయారు. అరముగ్గిన పండువలె రాలిపోయారు.

ఆంధ్రి దేశానికి ఏనాడూ ఏక నాయకత్వంలేదు. ప్రతి సందర్భంలోను ప్రత్యర్థి వుండడం, ఆ ప్రత్యర్థి కూడా పరిగణించదగినవాడుగా వుండడం, మన రాజకీయ చైతన్యాని కొక నిదర్శనం. అందువల్లనే ఆంధ్రనాయకుల మధ్య రాజకీయ జూదాలు అంతూ పంతూ లేకుండా సాగుతూ వున్నాయి. నాయకత్వంకోసం ఎత్తులకు పై యెత్తులు నిరంతరం నడుస్తూ వున్నాయి. సమయం చిక్కినప్పుడు ఏదో ఒక వ్యూహం పన్నడం, ఎంతో కొంత కథ నడపడం, ఆ తర్వాత అందరూ కలిసి పోయినట్టు, ఏమీ జరగనట్టు నటించడం మన నాయకులకు పరిపాటి. ఎందుకోసం ఇంతగా అల్లరి పడుతున్నారో ఆలోచించుకుంటే, చివరకు సహేతుకమైన కారణం కనిపించదు. స్వప్రయోజనాలు, స్వాతిశయాలు, పదవీ ప్రలోభాలు మాత్రం పుష్కలంగా వెల్లడౌతాయి. రాజకీయంగా ఆనాడు, ఈనాడు కూడా మనకు ఎప్పటికప్పుడు ఈ పోటీలు వున్నందునే ఏకనాయకత్వంకాక, బహు నాయకత్వం సాగుతూ వచ్చింది.

ఆ తరంలో ప్రకాశం, పట్టాభి, సాంబమూర్తిగార్ల నాయకత్వమును కుంటే, ఈనాడు గోపాలరెడ్డి, వెంకటరావు, చంద్రమౌళిగార్ల రాజకీయ నాటకాలు సాగాయి. ఇలాటి త్రిమూర్తుల సంప్రదాయం మనది. పరిస్థితులను బట్టి, వీరికి అండగా మరికొందరు చేరుతూ వచ్చారు. అలా చేరేవారుకూడా ఇద్దరు ముగ్గురుగా వుంటారు. దీనితో రాష్ట్రానికి పంచ పాండవుల నాయకత్వం తయారైంది.

అందువల్లనే ఈ తరంలో ఆరంభదశలో ఆంధ్ర నాయకులు అయిదుగురు—గోపాలరెడ్డి, వెంకటరావు, చంద్రమౌళి, సంజీవరెడ్డి, సత్యనారాయణరాజు—వీరందరూ కలిసి ప్రజా నాయకుడుగావున్న ప్రకాశాన్ని ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో గద్దెదింపారు. ఆ తర్వాత ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసును హస్తగతం చేసుకొనడానికి రైతునాయకుడనిపించుకున్న శ్రీ రంగాను పతనం చేశారు. పంచ పాండవులవలె రాష్ట్ర రాజకీయాలు నడిపారు. అయితే వీరిలో వీరికి అంతరంగికమైన విభేదాలు వున్నమాట నిజం. కాని, ఒక జట్టుగా వ్యవహరిస్తూ వచ్చారు. చివరి నిముషంలో ఒకరి కొకరు అండగా నిలుస్తూ వచ్చారు. వీరందరూ శ్రీ పట్టాభిగారి శిష్యులు. వీరందరిమధ్య మాత్రధారి శ్రీ కళావెంకటరావు.

ఈ అయిదుగురిని విడదీయాలనే ప్రయత్నాలు చాలా సందర్భాలలో విఫలమైనాయి. కాని, 1952 ఎన్నికలలో ప్రకాశం—రంగాలు కలిసి, చిత్తుగా వీరిని ఓడించారు. తూర్పు కోస్తాకు కొట్టిన ఎన్నికల తుపానులో తలగల నాయకులందరూ పడిపోయారు. సర్కారు జిల్లాలలో కమ్యూనిస్టులు తలెత్తారు. రాష్ట్ర రాజకీయాలలో పెద్ద గండిపడింది. నాయకుల జాతక చక్రాలు తలక్రిందులైనాయి.

ఆనాడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘానికి అధ్యక్షులు శ్రీ సంజీవరెడ్డి. కార్యదర్శి శ్రీ అల్లూరి. వారి అధ్వర్యంలోనే 1952 ఎన్నికలలో కాంగ్రెసు దెబ్బతినిపోయింది. గోపాలరెడ్డి, కళా, చంద్రమౌళి వగైరాలు ప్రజా ప్రతినిధులు కాలేకపోయారు. కేవలం 43 మంది మాత్రమే ఉమ్మడి మద్రాసు శాసన సభకు ఆంధ్ర సభ్యులు వచ్చారు. వారినుంచే శ్రీయుతులు శంకరరెడ్డి, సంజీవయ్య, పట్టాభి రామారావు ప్రభృతులు మంత్రులైనారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి రాజాజీ ముఖ్యమంత్రిగా నిలిచారు.

అప్పటికి శ్రీ సంజీవరెడ్డి యువకుడు. ఈ తరం యువక నాయకులకు తలమానికం వంటివాడు. సంకల్పబలం, అందుకు తగిన చతురత వున్నవ్యక్తి. ఆంధ్ర రాజకీయ రంగంలో అంతకు మూడు నాలుగు సంవత్సరాలనుంచి ఆయన చూపిన సాహసం సాటిలేనిది—రాజకీయంగాచూస్తే మద్రాసులో మంత్రి పదవికి రాజీనామాచేసి, ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షపదవిని చేపట్టడంకంటె, అందుకు కావలసిన హంగులన్నింటినీచేసిన కళాప్రభృతులను కాదని నెహ్రూ—టాండన్ వివాదంలో, శ్రీ నెహ్రూ నాయకత్వాన్ని సమర్థించడంలో, కార్యదర్శి శ్రీ అల్లూరితో కలిసి వేసిన ఎత్తు అమోఘంగా పనిచేసింది. ఆయనను అఖిల భారత రాజకీయ రంగంలోకి తీసుకు వెళ్ళింది. కాంగ్రెసు కార్యవర్గ సభ్యత్వమిప్పించింది.

కాని, ఆ తరువాత ఆయన ఆ ప్రతిష్ఠను ఉపయోగించుకున్న తీరు ఆయన అంతస్తును చూపించింది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సమస్యలో ఆయన అనుసరించిన విధానం కేవలం రాయలసీమ నాయకుని హోదాలోనే ఆయన వుండిపోయాడని పెద్దలకు కూడా ధ్రువపరచింది. ఆంధ్ర రాష్ట్ర తొలి మంత్రివర్గ నిర్మాణానికి అటు లోక పార్టీని దెబ్బతీస్తూ, ఇటు ప్రకాశంగారికి దగ్గరగా చేరుతూ అనుసరించిన పద్ధతులు కూడా ఆయన కీర్తిని పెంచలేదు. కాగా మనిషిలోవున్న సత్తాను బయటపెట్టాయి. నివురు కప్పిన నిప్పు అనిపించాయి.

అప్పుడు ఒక వైపున శ్రీ పొట్టి శ్రీరాములుగారి పూర్ణాహుతి ఫలితంగా ఆంధ్రరాష్ట్రం రూపొందనున్నది. మరొకవైపున ఆంధ్ర ప్రాంతంనుంచి ఎన్నికైవచ్చిన కాంగ్రెసుప్రతినిధులబలం తక్కువగా వున్నది. శ్రీ రంగా అధ్వర్యాన లోకపార్టీ, శ్రీ ప్రకాశం అధ్వర్యాన ప్రజాపార్టీ కాంగ్రెసు బలాన్ని పంచుకొని వున్నాయి. కమ్యూనిస్టులు ఒక పార్టీగా కాంగ్రెసుతో సరితూగుతూ నిలిచారు. ఈ పరిస్థితులలో ఆంధ్ర కాంగ్రెసు శాసనసభాపక్షం నాయకుని ఎన్నిక అవసరమైంది. అందుకోసం శ్రీ సంజీవరెడ్డివర్గం, అప్పటి మంత్రి శ్రీ నాయకంటిశంకరరెడ్డివర్గం జోరుగా ప్రచారం చేసుకున్నారు. బలం సరిసమాన మనుకున్నారు. శ్రీ శంకరరెడ్డిగారిపేరును మంత్రి శ్రీ పట్టాభి రామారావు ప్రతిపాదించే ఏర్పాటు గూడా రాజాజీ చేశారున్నారు. శ్రీ సంజీవయ్య మాత్రం గట్టిగా శ్రీ సంజీవరెడ్డి తరఫున నిలిచారు. పోటీకి అన్ని ఏర్పాట్లు పూర్తి అయిన తర్వాత శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు గోదావరిజిల్లా సభ్యులలో తిరుగుబాటు వచ్చింది. అది విన్న శ్రీ శంకరరెడ్డి వెంటనే




పెద్దదారంలోగాని లేదా సన్నదారంలోగాని లేదా రంగురంగులలో పారంపర్యంగా వస్తున్న వస్త్రాలలోగాని చేనేతవస్త్రాలకు సాటిరాగలట్టివి లేనేలేవు. పగల స్త్రమానం ధరించడానికిగాని లేదా సాయంత్రంపూట విలాసార్థం వెళ్లేటప్పుడు ధరించడానికిగాని చేనేత వస్త్రాలను ధరించడమే ఇప్పుడు ఫ్యాషన్. అవి ఎక్కువ మన్నికకలవి మాత్రమేగాక ఖరీదు తక్కువకూడా! ఒకసారి దయచేసి, దేశంలోని అనేక ప్రాంతాలకు చెందిన రకరకాల చేనేత వస్త్రాలను చూడండి.

## హాండ్‌లూమ్ హౌస్

**9, రతన్‌బజార్, మద్రాసు–3.**

*హెడ్ ఆఫీసు : ఆల్ ఇండియా హాండ్ లూమ్ ఫాబ్రిక్స్ మార్కెటింగ్ కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్, జన్మభూమి ఛేంబర్స్, బొంబాయి-1.*

కాస్మాపాలిటన్ క్లబ్బులోవున్న శ్రీ గోపాలరెడ్డిగారిని కలుసుకొని, పోటీ విరమించుకొనే సలహాపొంది, అస్త్రసన్యాసంచేసి, అయిదు నిముషాలు ఆలస్యంగా పార్టీ సమావేశానికి వచ్చారు. అప్పుడు శ్రీ కళావారు బహుపరాక్ అన్నారు. శ్రీ ప్రకాశం చిరునవ్వు నవ్వారు. శ్రీ సంజీవరెడ్డి ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ అధ్యక్ష పదవితోపాటు రాష్ట్ర శాసనసభా కాంగ్రెసుపక్ష నాయకత్వాన్ని కూడా స్వీకరించారు. రాష్ట్ర భవిష్యత్ నాయకుడుగా స్థిరపడిపోయారు. గత పది సంవత్సరాలుగా రాష్ట్ర రాజకీయాలను ఏకధాటిని నడిపిస్తున్నారు.

ఏర్పడుతున్నది ఆంధ్రరాష్ట్రం. కాని తాము ఆంధ్రులమనే జాతీయ భావం అప్పటిరంగంలో నిలబడివున్న నాయకులలో ఏ ఒక్కరికీలేదు. సర్కారు, రాయలసీమ, శ్రీకాకుళం అనే ప్రాంతీయ భావమే ఆ సమయంలో పెల్లుబికింది. చివరకు రాజధాని నిర్ణయంలో శ్రీ ప్రకాశంగారు శోచనీయమైన పాత్రను నిర్వహించారు. ముఖ్యమంత్రి పదవికి, రాజధాని నిర్ణయానికి లంకెపెట్టిన కారణాన ఆంధ్రకేసరి కేవలం రాయలసీమ కేసరిగా మారినట్లు లోకం గ్రహించింది. తమ ఏకైక నాయకుడని గర్వంగా చెప్పుకొని మురిసిపోయే సర్కారుజిల్లాలవారిని శ్రీ ప్రకాశంగారు ఒక మొట్టికాయవేశారు. ఆంధ్రకేసరి తప్పటడుగు ఆంధ్రజాతిని తప్పు మార్గాన పట్టించింది. ఆ నాటి ఆంధ్ర రాజకీయాలను కురు పాండవయుద్ధంలో పోల్చుకుంటే, ధృతరాష్ట్రుని పాత్ర శ్రీ ప్రకాశంపంతులు గారిది. దుర్యోధనుడు శ్రీ సంజీవరెడ్డి. మిగిలిన కౌరవబలం ప్రజాస్వామ్య పక్షాలన్న నామధారణ చేసిన అన్ని పార్టీలు. పాండవులు ఎవ్వరంటే, ప్రజలు. ఆంధ్రజాతి పాండవ సంతతి కనుక ఈ పోలిక సరైనదే కాగలదు.

రాయలసీమలో, తెలంగాణా సరిహద్దుల్లోవున్న కర్నూలు పట్టణాన్ని తాత్కాలిక రాజధానిగా ఆంధ్ర శాసన సభ్యులు నిర్ణయించారు. శ్రీ బాగ్ ఒడంబడికలోని మొదటి షరతు ప్రకారం రాయలసీమకు రాజధానియిచ్చినట్లు అయింది. అయితే ఇలా రాజధాని ఇచ్చినందున రాయలసీమ—సర్కారు విభేదాలు తరిగినవా, పెరిగినవా అని పరిశీలిస్తే, పెరిగినవనే చెప్పాలి. అంతేకాదు. ఇంతవరకు సర్కారు రాయలసీమ విభేదాలు వున్నవి. ఇప్పుడు సర్కారు—విశాఖ తగాదాలు కూడా ప్రారంభమైనాయి. శ్రీబాగ్ ఒడంబడికను విజయవాడ గుంటూరు నాయకులు చేశారని, తమ విశాఖపట్నం ఆంధ్ర రాజధాని కాకుండా పోవడానికి సర్కారు జిల్లాలవారు కారణమని శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథం, శ్రీ గౌతు లచ్చన్న ప్రభృతులు నిందించారు. తాము నీతికి నిలబడి రాయలసీమకు రాజధాని ఇస్తున్నామంటూ, రాయలసీమ నాయకత్వంతో నేస్తం కట్టారు. మంత్రి పదవులు పొందారు.

తెలుగు నాయకులలో మేధావంతుడని చెప్పుకోదగిన వ్యక్తి శ్రీ తెన్నేటి విశ్వనాథం. ఆయన ఆంధ్రుడుగా జన్మించడం ఆయన దురదృష్టమనుకొనేవారు కూడా కొందరు వున్నారు. ఆంధ్రుడుగా జన్మించడంకాక, ఆంధ్ర కేసరి అడుగుజాడలలో నడవడం ఆయన దురదృష్టమనే వారు కూడా లేకపోలేదు. ఒక నాయకునికి పరమ భక్తుడుగా వుండడంలో తప్పులేదు. కాని, ఆ పరమ భక్తిలో కూడా తన ఆదర్శమూర్తిని కొంతవరకే తనలో భాగం చేసుకోవాలి. తన అవసరం కూడా ఆయనకు వుంటుందనే గుర్తు కలగజేయాలి. అలా చేయనందునే శ్రీ విశ్వనాథంగారు కేవలం ప్రకాశంగారికి డిఫెన్సు లాయరుగా తయారైనారు. ఆత్మ విరుద్ధంగా కర్నూలు ఆంధ్ర రాజధానికావాలనే తీర్మానాన్ని ఆసెంబ్లీలో ప్రతిపాదించారు. ఆంధ్రరాష్ట్రానికి తొలి ఆర్థికమంత్రి అనిపించుకున్నారు.

“కానని వాని నూతగొని కాననివాడు విశిష్టవస్తువుల్ కానని భంగి” కృషికార్ లోకపార్టీవారు ఆంధ్రరాజధాని నిర్ణయసమస్యలో అడుసు త్రొక్కారు. లోకంలోని అన్ని పార్టీలకు నాయకుడనదగిన శ్రీ రంగా దీనికి నాయకుడు. అఖిల భారత సంచారం ద్వారా సిద్ధించిన అఖిల భారత నాయకత్వానికి తోడు అప్పుడప్పుడు రాజకీయ అజ్ఞాతవాసంచేసి, పార్టీల సిద్ధాంతాలు వల్లించి, కొత్త నినాదం, కొత్త అభిప్రాయ పరంపరలతో రంగంమీదికి వచ్చి బహుపాత్రాభినయం చేయడం వీరికి వెన్నతో పెట్టిన విద్య. రాజకీయ దశావతారాల అనంతరం [illegible] మంత్రివర్గంతో అంతరాని సహకారం. కాని రాజధాని నిర్ణయ రభసలో లోకపార్టీ తమలోకానికిచెందినది కాదన్న వాతావరణం, సర్కారు జిల్లాలలో ఏర్పడడంతో, వీరి ఆలోచనలో మార్పు ప్రారంభమైంది. విశాలాంధ్రమూలేదు. హైదరాబాదూ రాదు పొమ్మన్నారు. కాని ఈపార్టీకి ఉపనాయకుడుగావున్న శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిగారు సార్థక నామధేయులు. రాంగేయుల రామదండును చీల్చారు. రాజధాని సమస్యమీదనే లోకపార్టీ మంత్రిగావున్న శ్రీ లచ్చన్నకు పతనం తెచ్చారు. రాజధాని వ్యవహారంలో నడిచిన నడతకు తగిన మూల్యాన్ని ఆ పార్టీ నాయకులు అలా చెల్లించారు.

ప్రకాశం మంత్రివర్గానికి లోకపార్టీ సహకారం లోపించినా రెండుమంచి అయిదు ఓట్ల మెజారిటీతో అది బడ్జెట్టు పద్దులను ఆమోదింపజేసింది. రాజధాని సమస్యను మినహాయిస్తే అసెంబ్లీలో బలాబలాలు 70—76 గా వున్నాయి. రాజకీయ దృష్ట్యా పరిస్థితులు శోచనీయ స్థితికి వచ్చాయి. నాయకులమధ్య సరసాలు తగ్గి, విరసాలు పెరిగాయి. ఎప్పటి కెయ్యది ప్రస్తుతమో అప్పటికి ఆమాటచెప్పి కాలం వెళ్లబుచ్చే స్థితివచ్చింది. తెగతెంపులకు సమయం కోసం ఎదురుచూస్తూ వుండగానే మద్యనిషేధ సమస్యమీద శాసనసభలో మంత్రివర్గం వోడిపోయింది. అందుకు ప్రధాన భాగస్వాములు మాజీ కల్లుగీతవారి నాయకుడుగా శ్రీ గౌతు లచ్చన్న. మంత్రిపదవి రాలేదన్న కోపంతోవున్న మాజీ మంత్రి శ్రీ నాయకంటి శంకరెడ్డి. మొత్తంమీద అందరూ కలిసి ఆంధ్రరాష్ట్రానికి గవర్నరుపాలన తెచ్చారు.

కారణాలు ఏమైనప్పటికి 1952 ఎన్నికల ఫలితంగా ఆంధ్రరాష్ట్రానికి కమ్యూనిస్టు ప్రమాదమనేది ఒక పెనుభూతంగా రంగంమీదికి వచ్చింది. అదొక రాజకీయ ప్రతిపక్షంగా నిలిచిపోయింది. 1955 వరకు రాజకీయ నాయకుల అనైక్యత అనేది మరొక సమస్యగా తలెత్తింది. ఈ పరిస్థితులలో ఆంధ్రరాష్ట్రంలో ఎన్నికలు వచ్చాయి. 1952 లో ఓడిపోయిన అగ్రనాయకులందరూ తిరిగి రంగంలో ప్రవేశించే అవకాశం లభించింది. సంజీవరెడ్డి, గోపాలరెడ్డి, కళా, చంద్రమౌళి, అల్లూరి నాయకత్వం తిరిగి ప్రజల మధ్యకు వచ్చింది. వీరిలో మొదటి నలుగురిని గురించి ఒక ప్రతీతివుంది. “కలిసి వ్యవహరించినంతవరకు వీరు శిష్ట చతుష్టయం. కాని విడిపోతే మాత్రం దుష్ట చతుష్టయం.” 1955 ఎన్నికల అనంతరం వీరు విడిపోయారేకాని, కలిసి వ్యవహరించలేదు.

ఈ నలుగురు నాయకులలోను శ్రీ గోపాలరెడ్డికి ఆదినుంచి విడిగా గ్రూపు అనేది ప్రత్యేకంగాలేదు. అనుచరులు కూడా చాలా తక్కువే. కాని, అభిమానులు మాత్రం చాలామంది వున్నారు. అందువల్లనే మిగిలిన ముగ్గురు మధ్య వచ్చిన వివాదాలలో “రాజీగా” వుండడానికి పనికి వచ్చేవాడు. ఆ కారణాన్నే శ్రీ సంజీవరెడ్డి తర్వాత ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడైనాడు. లోకపార్టీని, ప్రజాపార్టీని కలిపి యునైటెడ్‌ఫ్రంటును సాధించాడు. ఇందులోనే శ్రీ గోపాలరెడ్డి తన భవిష్యత్తుకు కావలసిన పునాదులు వేసుకున్నాడు.

ఆంధ్రరాష్ట్రానికి కమ్యూనిస్టు ప్రమాదాన్ని తప్పించాలనేది 1955 ఎన్నికలలో ప్రత్యేక వివాదమైంది. రాష్ట్రంలో రాజకీయ ప్రజాస్వామ్యాన్ని భద్రపరచుకొనడానికి ఒక ఉద్యమం ఉప్పెనలాగ బయలుదేరింది. దానికి బ్రహ్మాండమైన ప్రజా విజయం కలిగింది. ఈ ఎన్నికలలో ప్రజలచేత కాంగ్రెసుకు ఓటు వేయించిన శక్తి “కొన్ని సమస్యల”ది కాని, “కొందరు నాయకులది” మాత్రంకాదు. అందులోను, ప్రజాస్వామ్యాన్ని రక్షించుకొనడానికి, జాతీయమైన ఒకపార్టీని పెంచుకొనడానికి మధ్యతరగతులు ఆవేశంతో కృషిచేశాయి. కనకనే కాంగ్రెసు ఘన విజయాన్ని పొందింది. తిరిగి రాష్ట్ర నాయకులందరూ రంగంమీదికి వచ్చారు. మామూలు ఆటలు సాగించారు.

రాష్ట్ర శాసనసభలో కాంగ్రెసు, లోక్, ప్రజా పార్టీలతో కూడిన ఐక్య కాంగ్రెసుపక్షం ఏర్పడింది. దీని నాయకత్వానికి శ్రీ సంజీవరెడ్డి—శ్రీ గోపాలరెడ్డిగార్లమధ్య పోటీ వచ్చింది. బలా బలాలు సమీకరించుకున్నారు. కాని, చివరి నిముషంలో కాంగ్రెసు అధిష్ఠానవర్గం సలహాను శ్రీ సంజీవరెడ్డి అంగీకరించి, శ్రీ గోపాలరెడ్డిగారు నాయకత్వం వహించడానికి అవకాశమిచ్చారు. ఆ నాడు శ్రీ ప్రకాశంగారికి, ఈ నాడు శ్రీ గోపాలరెడ్డికి పార్టీ నాయకత్వపు అవకాశమిచ్చారనే కీర్తి తెచ్చుకున్నారు. కాంగ్రెసు అధిష్ఠానవర్గం అభిమానాన్ని, ఆశీ

ర్వచనాన్ని పొందారు. సమయస్ఫూర్తిగల నాయకుడనే ప్రతిష్ఠ ప్రజలలో తెచ్చుకున్నారు. ఉప ముఖ్యమంత్రిగా, పార్టీ వ్యవహారాలలోను, మంత్రుల నియామకాలలోను కరుకుతనం చూపారు. తెరచాటున నిజమైన నాయకుడుగా వ్యవహరించారు. నానాటికి బలపడుతూ వచ్చారు.

ఇక శ్రీ గోపాలరెడ్డిగారు పార్టీ నాయకుడుగావున్న పన్నెండు నెలలలోను బలహీనుడనిపించుకున్నారేకాని, బలంకలవాడనిపించుకోలేదు. తనకు అండగావున్న మాజీ—లోక్‌పార్టీవారికి శ్రీ సంజీవరెడ్డిగారికి మధ్య వచ్చిన వివాదాలతో విసిగిపోయారు. ఈ వ్యవహారాలలో పానకంలో పుడకలాగా తేలారు శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి. శ్రీ సంజీవరెడ్డి ఎంతగా ప్రయత్నించినా, ఆయనను శ్రీ గోపాలరెడ్డి మంత్రివర్గంలో చేర్పలేకపోయారు. ఆ అవకాశం చివరకు లభించింది శ్రీ కందుల ఓబులరెడ్డికి. అక్కడితో మంత్రివర్గ నిర్మాణ వివాదాలు అంతమైనాయి.

కాని, ప్రదేశ్ కాంగ్రెసు వ్యవహారాలు మరొక రకంగా మారాయి. అప్పటికి మూడేళ్ల కిందట శ్రీ సంజీవరెడ్డి నాలుగుఓట్ల మెజారిటీతో శ్రీ రంగాను ఓడించి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడైనారు. ఆ తర్వాత శ్రీ గోపాలరెడ్డి ఆ పదవిని స్వీకరించి ఎన్నికలు నిర్వహించి జయంపొందారు. ఆ తర్వాత ఆ పదవిని శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు తొమ్మిదిఓట్ల మెజారిటీతో తిరిగి శ్రీ రంగాను నోడించి గెలిచారు. ఈ పోటీలో శ్రీయుతులు గోపాలరెడ్డి, చంద్రమౌళి ప్రభృతులు మంత్రులుగావుండి శ్రీ రంగాను బలపరచినా, ప్రయోజనం లేకపోయింది. ఆ విధంగా శ్రీ గోపాలరెడ్డి నాయకత్వం తొలి అవజయాన్ని పొందింది. రాష్ట్రానికి గల యువక నాయకులు రెండుగా చీలిపోయారు. శ్రీ అల్లూరి, శ్రీ సంజీవరెడ్డి నాయకత్వం ఒక వైపున, శ్రీ గోపాలరెడ్డి శ్రీ చంద్రమౌళి ప్రభృతులు మరొకవైపున నిలిచారు.

ఈ దశలో కాల ప్రవాహం కదలింది. భాషా రాష్ట్రాల నిర్మాణం నిజమైంది. హైదరాబాదు సంస్థానం భాషా ప్రయుక్తంగా విభజన జరిగింది. ఆంధ్రుల చిరకాలవాంఛ విశాలాంధ్ర నిర్మాణం తథ్యమైంది. ఈ పరిణామాలలో శ్రీ అల్లూరి నాయకత్వాన ఆంధ్ర కాంగ్రెసు ఆంధ్ర ప్రజా వాంఛకు అగ్రగామిగా నిలిచింది. తెలంగాణావాదుల వాదాలను ఎదుర్కొన్నది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సమయంలోకంటె, ప్రముఖమైన, ప్రశంసనీయమైన పాత్రను విశాలాంధ్రావతరణ సమయంలో ఆంధ్ర కాంగ్రెసు నిర్వహించింది. ఆ కీర్తి ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ అల్లూరికి, ఉప ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డికి దక్కింది. ఆ కృషి సహజపరిణామంగా ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు శాసన సభా పక్ష నాయకుడుగా శ్రీ సంజీవరెడ్డి ఎన్నికైనారు. విశాలాంధ్రకు తొలి ముఖ్యమంత్రి అనిపించుకున్నారు.

అటు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు, ఇటు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా శ్రీ నీలం సంజీవరెడ్డి నాయకత్వాన విజయం పొందిన ఆంధ్రప్రదేశ్ రాజకీయ శక్తులు హైదరాబాదు కోటలో పాగా వేశాయి. రాష్ట్రరాజకీయాలలో రకరకాల పాచికలు వేశాయి.

శ్రీ సంజీవరెడ్డి, శ్రీ అల్లూరి విభిన్నమైన ప్రవృత్తులు కలవారు. వీరి తత్వాలు విభిన్నమైనవి. ప్రతిపక్షలను దగ్గరకు రానివ్వకుండా నిరశించి—పాలించాలనే గ్రామపెత్తందారుతత్వం శ్రీ సంజీవరెడ్డిది. దగ్గరకు చేర్చి, పదవులలోవుంచి, అవసరమైన ప్రయోజనాలు సాధించాలనే లక్షణం శ్రీ అల్లూరిది. అయినా ఆనాడు వీ రిద్దరికీ జట్టు కలిసింది. ఒకరి లోపాలు మరొకరిద్వారా పరిదిద్దబడుతూ, రాష్ట్ర రాజకీయాలు కొంతకాలం సాఫీగా నడిచాయి.

సంజీవరెడ్డి బలహీనతలు అల్లూరికి తెలుసు. అల్లూరి లోగుట్టు సంజీవరెడ్డికి పరిచితం. ఏ వ్యవహారాన్ని అయినా అల్లూరి అయిసా—పైసగా అయిదు నిముషాల్లో తేల్చి వేస్తాడు. ఏ వ్యవహారాన్ని అయినా సంజీవరెడ్డి తెగనివ్వడు. దాట్లు వేస్తాడు. నాన పెడతాడు. వీ రిద్దరి పోకడల్లోను ఈ వ్యత్యాసం వున్నందునే అయిదేళ్ల ఆంధ్ర రాజకీయాలు వీరిమధ్య దోబూచులాడాయి.

నిజానికి వీరిని ఎదుర్కొనవలసినవాడు, వీరి ఆట కట్టించడానికి ప్రయత్నించవలసినవాడు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి. ఆయనకు రాజకీయంగా అవసరమైన అర్థబలం, స్థానబలం, అంగబలం వున్నాయి. కాని వాటిని సరిగా వినియోగించగలిగిన దక్షత, రాజకీయానికి అవసరమైన కరుకుతనం, పార్టీని కట్టడానికి కావలసిన తెగువ ఆయనలో లోపించాయి. మనిషి ఎంత మెత్తనో, మనసు కూడా అంతకంటె మెత్తన. పదిమంది కలిసి పెద్దరికమిస్తే స్వీకరించడానికి మాత్రం సిద్ధపడతారు. అలా సిద్ధించిన పెద్దరికాన్ని స్థిరపరుచుకోవాలని, చరితార్థం చేసుకోవాలని కూడా ప్రయత్నించని పెద్దమనిషితరహా ఈ నెల్లూరు బిడ్డది.

అందువల్లనే ఆంధ్రప్రదేశ్‌లో సంజీవరెడ్డి మంత్రివర్గ నిర్మాణం, సంజీవరెడ్డి రాజకీయాలు నల్లేరుమీద బండిగా సాగిపోయాయి. ఐక్య కాంగ్రెసులోని ప్రజాపార్టీ ప్రతిపత్తిని గుర్తించ నిరాకరించారు. లోక పార్టీమీద విభజించి—పాలించే నీతిని తీవ్రంచేశారు. చివరకు శ్రీ కళా వెంకటరావులాంటి "గురువును" మంత్రివర్గంలో చేర్చుకున్నా, ఆయన కొక అవరోధంగా తూర్పు గోదావరి జిల్లాలో శ్రీ పట్టాభి రామారావును పెంచుతూ వచ్చారు. శ్రీ చంద్రమౌళిని దూరంగా కొట్టినా, లోక్‌పార్టీ నాయకులకు నిలయమైన గుంటూరు జిల్లాను ఆకట్టడానికి శ్రీ గౌతు లచ్చన్నకు ప్రత్యామ్నాయంగా శ్రీ అనగాని భగవంతరావును రంగంమీదకు తెచ్చారు. రాయలసీమలో శ్రీ ఓబులరెడ్డి ప్రభృతులకు ఎదురుగా శ్రీ తిమ్మారెడ్డిని పెంచారు. చివరకు శ్రీ గోపాలరెడ్డి కూడా, ఒక్క సహచరుడైనా లేకుండా, కేవలం నెల్లూరుజిల్లా ప్రతినిధి హోదాలో ఆలస్యంగా సంజీవరెడ్డి మంత్రివర్గంలో చేరడంతో, ఆంధ్ర ప్రాంతంలో రాజకీయపు పాచికలు చరమ దశను అందుకున్నాయి.

ఇక తెలంగాణాలో పరిణామాలు కూడా ఇదే గాడిని నడిచాయి. ఇక్కడ తెలంగాణావాదులని, విశాలాంధ్రవాదులని రెండు వర్గాలవారు వున్నారు. తెలంగాణా వాదులకు పితామహుడు శ్రీ కొండా వెంకట రంగారెడ్డి. తెలంగాణాలో చరిత్రకల మనిషేకాని, చరిత్రను నిర్మించగల వ్యక్తిత్వం తక్కువ. తాలూకా కోర్టు ప్లీడరు తత్వంగల నాయకుడు, అనుచరులను కాదనలేడు. వారిచేత ఒప్పించనూలేడు. అందువల్లనే ఆయననుంచి స్వతంత్రులుగా తయారైనారు శ్రీయుతులు జె. వి. నరసింగరావు, డాక్టరు మర్రి చెన్నారెడ్డి. విశాలాంధ్ర వాదులలో ప్రముఖుడు శ్రీ వల్లూరి బసవరాజు. ఈయన కేవలం రాజధాని రాజకీయవేత్త. శ్రీ రంగారెడ్డికి తెలంగాణాగ్రామాలలోవున్న జనబలం ఈయనకు లేదు. కాని తెలంగాణా అంటే హైదరాబాదు, సికిందరాబాదు నగరాలే నన్న దశను ఆ ప్రాంతం అనుభవిస్తున్నందున రాచరికం చేయగలిగాడు ఈ రాజు.

ఇలాంటి రాజకీయవేత్తలకు నిలయంగావున్న తెలంగాణాలో నీలం—అల్లూరిద్వయం చక్కని పద్మవ్యూహం పన్నారు. విశాలాంధ్రవాదులను చేతిలో వుంచుకొని తెలంగాణావాదులను చీలగొట్టారు. విశాలాంధ్రావతరణ సమయంలో తెలంగాణాతో చేసుకున్న పెద్దమనుష్యుల ఒడంబడిక ప్రకారం ఉపముఖ్యమంత్రి పదవి తెలంగాణావారికి ఇవ్వాలి. కాని ఇది ఎవ్వరికి దక్కుతుందనే విషయంలో తెలంగాణా నాయకుల మధ్యవున్న ఆశలను, అనుమానాలను చక్కగా వినియోగించుకున్నారు. ఉప ముఖ్యమంత్రి పదవి అనేది నిరుపయోగకరమైన ఆరవ వ్రేలువంటిది కనక ఆ పదవి వలదని వారిచేతనే అనిపించారు. ఆంధ్ర—తెలంగాణాల భావ సమైక్యతకు ఇది తొలి సోపానంగా చిత్రించారు.

పెద్దమనుష్యుల ఒడంబడిక ప్రకారం మంత్రివర్గంలో మూడు—రెండు నిష్పత్తిలో ఆంధ్ర—తెలంగాణాలవారు పదవులు పంచుకోవాలి. కాని తెలంగాణాలో వున్న మూడువర్గాలను దగ్గరకు తీసుకొని అయిదు మంత్రి పదవులు మాత్రమే ఇచ్చారు. ఆరవ పదవిని పొందవలసిన శ్రీ మాశల రామచంద్రారెడ్డికి ప్రదేశ్ కాంగ్రెసులో పదవిని ఇచ్చారు.

తెలంగాణా అభివృద్ధికి విడిగా అభివృద్ధి సంస్థ అవసరమని తెలంగాణా వారు కోరగా, విడి సంస్థ అనేది అవరోధమేకాని, అసలు పని జరగనివ్వదని రాయలసీమ ప్రతినిధిగా ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో తాను పొందిన అనుభవాన్ని ఉదాహరించారు శ్రీ సంజీవరెడ్డి. తెలంగాణా మంత్రులందరూ తమ ప్రాంతం అభివృద్ధికి శ్రద్ధ చూపుతూవుంటే తాను కాదన నన్నారు. కాని ఆచరణలో వారు చూపిన ప్రత్యేక శ్రద్ధ లేదనిపించారు.

ఈ విధంగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణసందర్భంలో శ్రీ బాగ్ ఒడంబడికను పట్టుదలగా అమలు జరిపించుకున్న రాయలసీమ నాయకుడైన శ్రీ సంజీవరెడ్డి, తెలంగాణాతో జరిగిన పెద్ద మనుష్యుల ఒడంబడిక అమలు అనవసరమని

తెలంగాణావాదులు అనేటట్లు చేశారు. రాయలసీమ ప్రతినిధిగా తెలంగాణావారిని కలుపుకుంటూ ఆంధ్రప్రదేశ్ భావ సమైక్యతను సాధించారన్న కీర్తిని పొందారు.

ఈ పరిణామాలన్నింటిలోను నీలం—అల్లూరి నాయకద్వయం ఏకం గానే వ్యవహరించింది. వీరి వ్యూహాలు, నిర్ణయాలు ఎదురు లేకుండా సాగిపోయాయి. కాంగ్రెసు పార్టీలోనా ప్రతిఘటనలేదు. ప్రజాపార్టీ, లోకపార్టీ వగైరాలు కాంగ్రెసునుంచి వైదొలగాయి. మంత్రివర్గంలో సంజీవరెడ్డి—గోపాలరెడ్డి—కళా "త్రయం" కలయిక సంజీవరెడ్డి నాయకత్వానికి బిగువు తెచ్చింది. ముఖ్య మంత్రిగా శ్రీ సంజీవరెడ్డి దక్షులన్న ప్రసిద్ధి పొందుతూ వచ్చారు.

ఇలా కథా నాయకుడు శ్రీ సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా బలపడుతూ వుండగా, ఉప కథానాయకుడు శ్రీ అల్లూరి సంస్థ స్థాయిలో ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా స్థిరపడిపోయారు. కాని, ప్రాగ్జ్యోతిషపుర కాంగ్రెసులో అధ్యక్షుడు శ్రీ ధేబర్ తన ప్రధాన కార్యదర్శులలో ఒకరుగా శ్రీ అల్లూరిని నియమించుకొనడంతో ఆంధ్ర రాజకీయాలలో కొత్త ఘట్టం ప్రారంభమైంది. ఇక్కడ నుంచే నీలం—అల్లూరి తగాదాలు ప్రముఖంగా తలెత్తాయి.

అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శి పదవి స్వీకారంతో శ్రీ అల్లూరి కొత్త సమస్యను శ్రీ సంజీవరెడ్డికి తెచ్చిపెట్టారు. ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా ఎవ్వరిని వుంచుకోవాలన్నదే ఆ సమస్య. మరొక సమస్య శ్రీ గోపాలరెడ్డి కేంద్రంలో మంత్రి పదవికిని స్వీకరించడం. అలా ఆయన అఖిల భారత రంగంలోకి తప్పుకొనడంతో మంత్రివర్గంలో ఏర్పడిన ఖాళీని భర్తీ చేయవలసి వుండడం. ఇలా రాష్ట్రస్థాయిని ఆడవలసిన చదరంగంలో అటు కాంగ్రెసు సంస్థలోను, ఇటు మంత్రివర్గంలోను రెండు పావులు లోపించాయి.

ఈ పావులను భర్తీ చేయుటంలో శ్రీ సంజీవరెడ్డి అనుసరించిన విధానాలతో రాష్ట్ర రాజకీయాలలో కొత్త నాయకులు తలెత్తారు. దీనిలో తొలి అంశం ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవి. ఉప ముఖ్యమంత్రి పదవిని రద్దు చేశారు కనక అది తెలంగాణాకు చెందాలనే వాదన వచ్చింది. కాని అందుకు అభ్యర్థి ఎవ్వరనే దానిలో అప్పటికి మంత్రులుగావున్న తెలంగాణా ప్రముఖ నాయకులు ఏకీభవించలేదు. ఏ పదవి ద్వారా తమలో ఎవ్వరు పైకి పోగలరోనన్న ఈర్ష్యాభావాలు వారి రాజకీయాలకు కీలకంగా వున్నాయి. శ్రీ బాగ్ ఒడంబడిక ప్రకారం చూస్తే ముఖ్యమంత్రి రాయలసీమవారు కనక ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవి సర్కారు జిల్లాలకు రావాలి. అల్లూరి కూడా సర్కారు జిల్లాలవాడే. కాని తెరచాటున జరిగిన సమాలోచనలలో శ్రీ పిడతల రంగారెడ్డి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగాను, శ్రీ మాకల రామచంద్రారెడ్డి ప్రధాన కార్యదర్శిగాను వచ్చారు. అంటే ముఖ్య మంత్రి పదవి, ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవి రాయలసీమవారు స్వీకరించారు. అవసరాన్నిబట్టి సర్కారు జిల్లాల ప్రతినిధులు కూడా అవాడు తలలువంచారు.

ఇక మంత్రివర్గంలో శ్రీ గోపాలరెడ్డి స్థానం ఖాళీగా మిగిలింది. అది చివరవరకూ భర్తీ కాలేదు. దీనికి అభ్యర్థిగా నిలిచినవారు శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి. కాని శ్రీ సంజీవరెడ్డి హయాంలో వారికి మంత్రి పదవి లభించలేదు. ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవీ రాలేదు. ఆ విధంగా నెల్లూరుతోసహ సర్కారు జిల్లాలలో ఒక రకమైన రాజకీయ అసంతృప్తి లోలోపల ప్రజ్వరిల్లుతూ వచ్చింది. అంతలోనే శ్రీ కళా వెంకటరావుగారు అస్తమించారు. ఆ సమయానికే తెలంగాణా ప్రముఖ నాయకుడు డాక్టరు చెన్నారెడ్డి, శ్రీ సంజీవరెడ్డి పాలనను విమర్శించారని ప్రదేశ్ కాంగ్రెసు క్రమశిక్షణ చర్య తీసుకుంది. ఎన్నికలలో అవినీతి చర్యలు కొనసాగించారనే కారణాన శ్రీ వల్లూరి బసవరాజు మంత్రివర్గంనుంచి నిష్క్రమించారు.

ఈ పరిణామాలవల్ల శ్రీ సంజీవరెడ్డి ఏకాకిగా నిలిచారు. శ్రీయుతులు గోపాలరెడ్డి, కళాలతో కట్టుకున్న పునాది పడలింది. అల్లూరితో నేస్తం పూర్వపు స్థాయిలోలేదు. మంత్రివర్గంలో ఏర్పడిన మూడు ఖాళీలను (గోపాలరెడ్డి, కళా, వి. బి. రాజులవి) భర్తీ చేయకుండా, వాటిమీద చూపు పెట్టుకొనివున్నవారందరినీ దూరంగా ఆశలతో వుంచుతూ, వాగ్బంధం చేశారు. శ్రీ సంజీవరెడ్డికి తిరుగు లేదనిపించుకున్నారు. చివరకు తోటి మంత్రుల శాఖలను మారుస్తున్నట్లు టెలిఫోనులలో పిలిచి చెప్పే స్థితికి వచ్చారు.

ఈ దశలోనే శ్రీ సంజీవరెడ్డి తన అంతరంగికులుగా ఒకరిద్దరిని చేర్చుకున్నారు. అందులో ముఖ్యులు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి. రెండవవారు శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి. మూడవవారుగా ఆ యా సందర్భాలనుబట్టి, శ్రీ పట్టాభి రామారావు, శ్రీ జె. వి. నరసింగరావు, శ్రీ కె. వి. రంగారెడ్డి ప్రభృతులు. వీరందరి ద్వారా రాష్ట్రపాలన ఏకధాటిగా కొనసాగించారు శ్రీ సంజీవరెడ్డి.

కాంగ్రెసు సంస్థ స్థాయిలో జిల్లా కాంగ్రెసు సంఘాలకు ఎన్నికలు జరిపించారు. వానికి కూడా వీరు కోరుకున్నవారే చాలవరకు జిల్లా నాయకులుగా ఎన్నికైనారు. ఇలా కాంగ్రెసు సంస్థ నిర్మాణంలో శ్రీ పిడతల రంగారెడ్డి, శ్రీ నూకల రామచంద్రారెడ్డి ప్రముఖపాత్ర వహించి, కొత్త నాయకులుగా రూపొందారు. వీరి ద్వారా ప్రదేశ్ కాంగ్రెసు అనేది ముఖ్యమంత్రి ఆదేశాల ప్రకారం వ్యవహరించే అనుబంధ సంస్థగా తయారైపోయింది. అక్కడ అఖిల భారత కాంగ్రెసులో కార్యదర్శిగా శ్రీ అల్లూరి వుండడంవల్ల అటు సంస్థ ద్వారాకాని, ఇటు పార్టీ ద్వారాకాని వ్యతిరేక శక్తులు తలెత్తడానికి వీలులేకుండా పోయింది. అందరూ గుంభనగా వుండిపోయారు. సమయంకోసం వేచి చూస్తున్నారు.

ఇలా అంతర్గతంగావున్న శక్తులు ఒక కొనకు రావడానికి కాంగ్రెసు సంస్థలో వచ్చిన ఎన్నికలు ఒక అవకాశాన్ని కలిగించాయి. అప్పటికి అఖిల భారత [illegible]

వ్యవధి వున్నది కనక, ఆలోగా తాను ఎదుర్కొనవలసిన క్లిష్ట పరిస్థితులు ఎలాటివో ఆయన గుర్తించారు. చివరకు పార్టీలో విశ్వాస రాహిత్య తీర్మానంవచ్చినా రావచ్చు. కనక ఈ రెండేళ్ళ ఢిల్లీలోవుంటే మంచిదని భావించారు. అయితే ఆ తర్వాత సంగతి సందర్భాలను గురించి కూడా వూహించారు. కనకనే రాష్ట్ర రాజకీయాలను తన చేతులలోనే వుంచుకొన దలచారు. అందుకు తగిన వ్యూహాన్ని పన్నారు.

రాష్ట్రంలో తనకు ప్రత్యర్థిగా నిలవగలిగిన వ్యక్తి శ్రీ అల్లూరి. పైగా ఆయన అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శి. కనక ఆయన ఆట కట్టించే ఏర్పాట్లు ముందుగా యోచించారు. అందులో మొదటి ఏర్పాటు సోషలిస్టుగా వుంటున్న శ్రీ పి. వి. జి. రాజును కాంగ్రెసులో చేర్చుకొనడం. విజయనగరం రాజును, జిన్నూరు రాజుకు (అల్లూరి) పోటీగా పెంచదలచారు. కాని రాజకీయ చపలత్వం కల విజయనగరరాజా ఆశించినట్టుగా ఆదిలో వ్యవహరించలేదు. కాని, చివరకు అనుకున్న ప్రకారం తన అవసరం తీర్చారు. రెండవ ఏర్పాటు. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా వెడుతున్నప్పటికీ, పట్టుదలగా జిల్లా పరిషత్తులకు అధ్యక్షుల ఎన్నికలు జరిపించారు. తాను కోరుకున్నవారిని జిల్లా నాయకులుగా నిలిపారు. ఇలా అఖిల భారత కాంగ్రెసు అధ్యక్ష పదవిని స్వీకరిస్తూనే, రాష్ట్రం, జిల్లా స్థాయీలలో కొత్త శక్తులను పెంపొందజేశారు శ్రీ సంజీవరెడ్డి. చివరకు ఆ శక్తులే, [illegible]

వరకు ఆంధ్రప్రదేశ్ శాసన సభలో కాళహస్తి ప్రతినిధిగానే వున్నారు. పెద్ద పదవిలోవున్నా, ఆయన చూపిన చిన్నబుద్ధి ఇది.

అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా వెడుతున్న శ్రీ సంజీవరెడ్డికి రాష్ట్ర కాంగ్రెసుపార్టీలోని స్థితిగతులు, దానిలోని ప్రముఖుల లోపాలు, బలహీనతలు పూర్తిగా తెలుసు. కనకనే ముఖ్యమంత్రిగావుండి, వారిని ఎంతగా కట్టుదిట్టాలలో వుంచారో కాంగ్రెసు అధ్యక్షులుగా వున్నప్పుడు కూడా, సంస్థ శ్రేయస్సుకోసం, అంతకంటె ఎక్కువ కట్టుదిట్టాలలో వారిని వుంచవలసింది. కాని, ఆయన ఆ పని చేయలేదు. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్ష పదవిని ఆంధ్ర రాజకీయాలను కల్లోలపరచడానికి వినియోగించారు. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సమయంలో ఆంధ్ర కాంగ్రెసును ఏవిధంగా రాయలసీమ అవసరాలకు వినియోగించారో, అఖిల భారత కాంగ్రెసును కూడా తన రాష్ట్ర నాయకత్వవాంఛకు ఉపయోగించారు. అనువుగా 1962 ఎన్నికల అనంతరం పరిణామాలు ఈ విషయాన్ని ధృవపరచాయి.

శ్రీ సంజీవరెడ్డి అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా వెళ్ళిన తర్వాత శ్రీ సంజీవయ్య మంత్రివర్గ నిర్మాణంలో తగాదా కనిపించలేదు. నలుగురూ అనుకున్నవారే మంత్రులుగా వచ్చారు. అజ్ఞాతవాసంలోవున్న శ్రీ పళ్లంరాజు శ్రీ చంద్రమౌళి, శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి ప్రభృతులు, కొత్తగా కాంగ్రెసులో చేరిన శ్రీ పి. వి. జి. రాజు కూడా మంత్రికా గలిగారు. మొత్తంమీద సంజీవయ్య హయాంలో రాజకీయాల నడక సవ్యంగానే ప్రారంభమైన దనుకున్నారు. శ్రీ సంజీవరెడ్డి ద్వారా వచ్చిన అసంతృప్తి తొలగిపోయిందని భావించారు.

తెలంగాణాకు ఉపముఖ్యమంత్రి పదవిని పునరుద్ధరించి శ్రీ కె. వి. రంగారెడ్డికి దానిని ఇచ్చారు. ఇందులో తెలంగాణాను సంతృప్తి పరచామనే వ్యూహం వుండవచ్చు. కాని నాలుగేళ్లనాడు విస్మరించిన పదవిని పునరుద్ధరించడంలో దూరదృష్టి లేదనిపించింది. అంతకంటె పెద్దమనుష్యుల ఒడంబడిక ప్రకారం తెలంగాణాకు అరవ మంత్రి పదవిని ఆనాడే శ్రీ జె. వి. నరసింగరావువంటివారికి ఇచ్చివుంటే ఆ తర్వాత ప్రమాదాలను సంజీవయ్య మంత్రివర్గం ఎదుర్కొనవలసి వచ్చేదికాదు.

ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా శ్రీ పిడతల రంగారెడ్డిస్థానే శ్రీ మాశం నరోత్తమరెడ్డిని ఏకగ్రీవంగా ఎన్నిక చేసుకొనడంతో రాజకీయాలలో కొత్త రవరవలు బయలుదేరాయి. తెలంగాణాకు ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవి అంటూ శ్రీ అల్లూరి చేసిన వాదన సర్కారు జిల్లాలలో అసంతృప్తి తెచ్చింది. ఆ నాడు రాయలసీమ నాయకులను పెంచి, అన్యాయం చేశారు. ఈ నాడు తెలంగాణాను పెంచి, తమ స్వప్రయోజనాలు చూచుకుంటూ, సర్కార్లలో మిగిలి వున్న నాయకులకు అవకాశాలు తగ్గిస్తున్నారనే విమర్శలకు శ్రీ అల్లూరి గురి అయ్యారు. పోతే తెలంగాణాలో కూడా తమ ప్రతినిధి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడయ్యాడనే సంతృప్తి, సంతోషం కనిపించలేదు. శ్రీ మాశం రామచంద్రారెడ్డి మంత్రి అయిన తర్వాత, ఆయన సోదరుడు శ్రీ నరోత్తమరెడ్డినే ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షునిగా చేయాలా అన్న ప్రశ్న వినవచ్చింది. ఇలా ప్రశ్నించిన వారిలో శ్రీ వి. బి. రాజు, శ్రీ కె. వి. రంగారెడ్డి, శ్రీ జె. వి. నరసింగరావువంటి తెలంగాణా ప్రముఖ నాయకులు అందరూ వున్నారు. సంజీవరెడ్డి హయాంలో మాశం వారికి ప్రాధాన్యమివ్వలేదు. సంజీవయ్య హయాలంలో వారికి ప్రాధాన్య మివ్వడంతో, తెలంగాణా రాజకీయాల్లో సంజీవరెడ్డి చేసిన తప్పులను, మరొక రూపంలో అల్లూరి కూడా చేస్తున్నాడనే నింద వచ్చింది. అది సర్కారు జిల్లాలలో కేంద్రీకృతమైంది.

అదీకాక సంజీవయ్య మంత్రివర్గంలో తూర్పుగోదావరి (ఇద్దరు మంత్రులు) గుంటూరు (ఇద్దరు మంత్రులు), కర్నూలు (ఇద్దరు మంత్రులు) రాజకీయ ప్రాబల్యం, ప్రాతినిధ్యం కొత్త పరిణామాలు తెచ్చింది. సంజీవయ్య మంత్రివర్గాన్ని వ్యతిరేకించే శక్తులు కూడా ఈ జిల్లాలనుంచి, ఈ జిల్లాలమీద ఆధారపడుతూ విస్మరించిన కృష్ణా, చిత్తూరు జిల్లాలనుంచి పెరిగాయి. కాని వెంటనే పొంగలేదు. ఇహ పదవులు రాక కక్షను పెంచుకున్నవారు, పదవుల

పొంది అసంతృప్తి చెందినవారు, సమయంకోసం పొంచివున్నారు. ఇలాంటివారు ఏదో ఒక ప్రాంతంలోను, జిల్లాలలోనుకాదు. రాష్ట్రం నలుమూలలా వ్యాపించి వున్నారు.

ఈ పరిస్థితులలోనే ప్రదేశ్ కాంగ్రెసు ఎన్నికల సంఘ నిర్మాణ సమస్య వచ్చింది. దీనికి ఏకగ్రీవంగా ఎన్నికలు జరుపుకోవాలనే ప్రయత్నంలో శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి మినహాయింపు, ఆయన తిరుగుబాటు, మంత్రివర్గంనుంచి నిష్క్రమణ, పొంచివున్న వర్గాలకు ఒక నాయకత్వాన్ని ఇచ్చాయి. తగాదా పడడానికి తగిన సావకాశాన్ని చూపాయి. నిజానికి ఇది సంస్థ స్థాయిలో జరగవలసిన వ్యవహారం. కాని, తాను చేసిన రాజీని ఎ. సి. కాదన్నాడనే వైఖరిని ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్య అవలంబించడంతో ఈ తగాదా మంత్రివర్గ స్థాయిని అందుకున్నది. తిరిగి రాజకీయ బలప్రదర్శనాలు ప్రారంభమైనాయి.

శ్రీ ఎ. సి. శక్తివంతుడు. స్థానబలం కలిగిన వ్యక్తి. ఆలోచనకంటె, ఆవేశం హెచ్చు. స్వశక్తిమీద ఆధారపడి వ్యవహరించే తత్త్వం. కనక అందరూ తనవంటి వారే అనుకుంటారు కాని తన్ను పావుగా ఇతరులు వినియోగించు కుంటున్నా రనేది గుర్తించరు. అదీకాక నెల్లూరు జిల్లానుంచి శ్రీ గోపాలరెడ్డి నాయకత్వం రాష్ట్రానికి సమకూరినంతవరకు రాష్ట్ర రాజకీయాలలో ఎ. సి. కీలకం కాలేకపోయారు. అయినా ఇతరుల కార్య సాధనకు పదునుగల కత్తిగా రూపొందారు.

ఈ ఘట్టంలోనే అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా శ్రీ సంజీవరెడ్డి రాష్ట్ర రాజకీయాలమీద పిడికిలి బిగించారు. ముఖ్యమంత్రిని ధిక్కరించిన ఎ. సి. ని శాఖలులేని మంత్రిగా చేసినా, ఆయన పదవిలో వుండేటట్టు చేశారు. శ్రీ ఎ. సి. అప్పీలును స్వీకరించి, వ్యవహారాన్ని పార్లమెంటరీ, సంప్రదాయాలకు వ్యతిరేకం, కాంగ్రెసు ప్రతిష్ఠకు విరుద్ధం అయినా, స్వరాష్ట్రంలో కాంగ్రెసు రాజకీయాలను రచ్చకెక్కనిచ్చారు. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుని హోదాలోవున్న శ్రీ సంజీవరెడ్డి ఇలా తనకు అవసరమైన రాజకీయసుడిగుండాన్ని రాష్ట్రంలో సృష్టించడానికి అంగీకరించింది కాంగ్రెసు అధిష్టానవర్గం.

శ్రీ ఎ. సి. కి మంత్రిపదవిపోయింది. సంజీవయ్య మంత్రివర్గంలో తిరిగి పదవి లభ్యంకాని పరిస్థితులు ఆయనను చుట్టు ముట్టాయి. పార్టీలో వుండి, పాలక వర్గానికి వ్యతిరేక శక్తిగా నిలవకతప్పని పరిస్థితులను సృష్టించుకున్నారు శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి. అక్కడితో ఆ పరిణామాన్ని ఆపలేదు. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులు కాంగ్రెసు ఎలక్షను కమిటీ ఎన్నికను నిబంధనావళి ప్రకారం జరగలేదన్న సాకుతో రద్దు చేయించారు. కొత్తగా ఎలక్షను కమిటీ ఎన్నికను జరిపించమని పైనుంచి ఆదేశాలు పంపారు. రాష్ట్రం నలు మూలలా పొంచివున్న శక్తుల కేంద్రీకరణకు ఇది సదవకాశాన్ని ఇచ్చింది. ఎ. సి. ఉదంతంతో పెరిగిన ఉద్రేకాలు చల్లారేవరకు ఈ ఎన్నికను వాయిదావేసివుంటే, పరిణామాలు మరొక రకంగా వుండేవి. కాని, అవి మరొక రకంగా కావడం అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులకు అయిష్టం.

ఈ లోగానే రాజధాని రాజకీయాలు కొత్తరూపాన్ని ధరించాయి. హైదరాబాదు—సికిందరాబాదు నగరాల విలీనంతో మునిసిపల్ ఎన్నికలు జరపవలసి వచ్చింది. దీనికి మంత్రి శ్రీ పి. వి. జి. రాజా అధ్యక్షతన సివిక్‌బోర్డు ఏర్పడింది. మునిసిపల్ ఎన్నికలకు అభ్యర్థుల నిర్ణయంలో తెలంగాణా ప్రముఖులు శ్రీ వి. బి. రాజు, శ్రీ జె. వి. నరసింగరావులు, ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడుగావున్న శ్రీ నరోత్తమరెడ్డి తగాదా పడ్డారు. సివిక్ బోర్డు సూచించిన పేర్లు కొన్ని ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు మార్పు చేయడంతో పి. వి. జి. రాజా—నరోత్తమరెడ్డి వివాదం హెచ్చింది. ఈవిధంగా తెలంగాణాలో జె. వి.—వి. బి.—పి. వి. జీ లు ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ నరోత్తమరెడ్డికి వ్యతిరేకంగా చేతులు కలిపే నాటికి ఎలక్షను కమిటీ రద్దు వ్యవహారాన్ని వివాదాంశంగా అందజేశారు అఖిల భారత కాంగ్రెసు అధిష్ఠానవర్గంవారు.

శ్రీ ఎ. సి. ద్వారా వచ్చిన వివాదంకంటె తెలంగాణాలో ఏర్పడిన అసంతృప్తి రాజకీయ వాతావరణాన్ని కలుషితం చేసింది. తెలంగాణావారే తెలంగాణా ప్రతినిధిగావున్న ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ నరోత్తమరెడ్డిమీద ధ్వజమెత్తారు. సర్కార్లు రాయలసీమలలో అంతవరకు పొంచివున్న వ్యతిరేక శక్తులన్నీ ఒక దఫా విజృంభించాయి. తెలంగాణామీద అతిగా మొగ్గిన అల్లూరి వ్యూహాలు విఫలమైనాయి. కాంగ్రెసు సంస్థా స్థాయిలో ఆయన బలహీనుడని ఎలక్షన్ కమిటీ ఎన్నికల పోటీ రుజువు చేసింది. ఆ విధంగా అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుల తక్షణ లక్ష్యం నెరవేరింది.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవికి శ్రీ నరోత్తమరెడ్డి రాజీనామా చేశారు. ఉభయుల మధ్య రాజీగా శ్రీ మల్లిపూడి పళ్లంరాజు అధ్యక్ష పదవిని స్వీకరించారు. ఆయన సర్కార్లలో జాతీయ వాదానికి ప్రతినిధి. కాకలుతీరిన వృద్ధ కాంగ్రెసు నాయకులు. ఆయనను ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవికి రప్పించడంలో శ్రీ సంజీవరెడ్డి విజయాన్ని సాధించారు. సంస్థలో రెండవ రాష్ట్ర కాంగ్రెసు సంఘం, రాష్ట్ర ఎన్నికల సంఘం తనకు అనువైనవిగా చేసుకోగలిగారు. సంస్థ స్థాయిలో అల్లూరి అపజయాన్ని ధ్రువపరచారు.

ఇక మంత్రివర్గ స్థాయిలో వ్యూహాలు ప్రారంభమైనాయి. ఎ. సి. ని బయటికి పంపిన ఖాళీ ఒకటి. శ్రీ పళ్లంరాజు రాజీనామా చేసిన ఖాళీ రెండవది. ఈ రెండు ఖాళీలు మంత్రివర్గంలో భర్తీ చేయడమనే సమస్య మిగిలింది. అందుకోసం రాజీ సమాలోచనలు సాగాయి. రాష్ట్ర స్థాయినివున్న నాయకులకు మంత్రి పదవులు స్వీకరించడం ఇష్టం. కాని అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షునికు అది ఇష్టంలేదు. కనక ఎవ్వరిని తీసుకోవాలి. ఎందరిని తీసుకోవాలనే దాని మీద సుదీర్ఘ సమాలోచనలు, అంతులేని వాదోపవాదాలు సాగాయి. చివరకు వృథా ప్రయాసేకాని, కుదిరిన పరిష్కారంలేదు. కాని ఈ సందర్భంలో కూడా శ్రీ అల్లూరి తనవ్యూహం మార్చుకొనక రాజకీయంగా నష్టపోయారు. 'బలవంతుడు నాకేమనే, ధోరణిలో వ్యవహరించారు. పార్టీలో తనకు తగ్గిన బలాన్ని చూసుకోలేదు. ప్రత్యర్థుల బలహీనతను, పదవులపట్లగల ప్రలోభాన్ని ఆసరాగా చేసుకొని, వారిని చీల్చాలని ప్రయత్నించారు. విఫలమైనారు. మొత్తానికి మంత్రివర్గ స్థాయిలో ప్రతిష్టంభన యథాతథంగా కొనసాగింది. అలా కాకుండా అప్పుడే ఇద్దరిని మంత్రివర్గంలోకి తీసుకుంటే, ఆ తరువాత పరిణామాలు మరొక రకంగా వుండేవి.

కాని కాలం కూడా కలిసి రాలేదు. 1962 ఎన్నికలు దగ్గర పడ్డాయి. అందరూ ఎన్నికలకు సిద్ధపడవలసివచ్చింది. అప్పుడే అందరి బలహీనతలు బయట పడ్డాయి. ఎన్నికల అనంతరం కొత్త ముఖ్యమంత్రి ఎవ్వరనే యోచనలు ప్రారంభమైనాయి. అందరి వ్యూహాలకు, అది కీలకంగా తయారైంది. ఎవ్వరికి వారు జాతకాలు చూపించుకున్నారు. ఎవ్వరి ఎత్తులు వారు వేశారు. అప్పటినుంచే రంగంమీదికి వచ్చారు ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్య.

శ్రీ సంజీవయ్య పేరుకు ముఖ్యమంత్రేకాని, అసలు ముఖ్యమంత్రి శ్రీ అల్లూరి అనే ప్రతీతి అంతవరకూవుంది. కాంగ్రెసుసంస్థ వ్యవహారాలలోకాని, మంత్రివర్గ నిర్మాణ సమస్యలలోకాని, అది నిజమనిపించింది. అల్లూరి వ్యూహాలు విఫలం కావడంతోపాటు శ్రీ సంజీవయ్య బలపడుతూ వచ్చారు. సరసుడూ, సజ్జనుడు అనిపించుకున్నారు. అల్లూరి చేతిలో కీలుబొమ్మ కాదన్న నమ్మకం కలిగించారు. సందర్భం, సమయంవస్తే స్వతంత్రించి, వ్యవహరించగలడని, తన సత్తా చూపగలడని ఆచరణలో నిరూపించుకున్నారు. దీనితో అల్లూరి—సంజీవయ్యల ఏకాభిప్రాయం లేదన్న వాతావరణం ఏర్పడింది. శ్రీ సంజీవయ్య స్వతంత్ర శక్తిగా నిలబడ్డారు.

శ్రీ సంజీవయ్య స్వతహాగా సరుకుగల మనిషి. కాని, జన్మించినది హరిజన కుటుంబంలో. యుక్త వయస్సు వచ్చేవరకు అనుభవించింది అష్ట కష్టాలను. అదృష్టం అంటూ లభ్యింది రాజాజీ పుణ్యమాఅని. వరసగా రాజాజీ, ప్రకాశం, గోపాలరెడ్డి, సంజీవరెడ్డి మంత్రివర్గాలలో పదేళ్ళ మంత్రిగావున్నా, ఆయన ఎంతగా నివురుకప్పిన నిప్పో ఎంతోమందికి తెలియదు. ఆయన ప్రతిభ పదిమందికీ తెలిసే అవకాశం లభించలేదు. జన్మతహావున్న బలహీనతవల్ల తనకు తానుగా ఆయన రాజకీయాలలో పైకి రావడానికి అవసరమైనట్టుగా ముందడుగు వేయలేకపోయారు.

ఆయనకు రాష్ట్ర కాంగ్రెసు నాయకుడనిపించుకొనే అవకాశం ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవిని శ్రీ పిడతల రంగారెడ్డినుంచి పొందే పరిస్థితు

లలో లభించింది. ఆయన దానిని వలదన్నారు. మంత్రి పదవిలో వుండడానికే ఇష్టపడ్డారు. ఇది ఆయన బలహీనతగా అప్పుడు భావించారు.

బహుశా ఆ అవకాశాన్ని వదలినందువే కాబోలు, అల్లూరి—నీలం మధ్య రాజీగా ముఖ్యమంత్రి కాగలిగారు. ఆ పదవి వచ్చినంత మాత్రాన ఆయన తన పద్ధతి మార్చుకోలేదు. రాజకీయాలకు తెరవెనకగానే వుంటూ వచ్చారు. స్వశక్తి తెలుసుకొనక, పరిస్థితుల ప్రభావం గుర్తించినవాడు కనక, అనుకూలురకు, వ్యతిరేకులకు సమానమైన అవకాశం ముఖ్యమంత్రిగా ఇచ్చారు. అందరికీ వినియోగపడ్డారు. అందరినీ ఆకర్షించారు. అది ఆయన చేతిలోవున్న పదవిద్వారా సుసాధ్యమైంది. కాని ఆ పదవి పదిలంగా వుండాలంటే, రాజకీయమైన శక్తి మరికొంత కావాలి. దానిని ఆయన సంపాదించుకొనడం ఆయనను పెద్దచేసినవారికే ఇష్టంలేకపోయింది. అవతలివారి చులకనతోపాటు, ఇవలివారి నిర్లక్ష్యం కూడా పెరిగింది. చివరకు వారూ—వీరూ కలిసి పద్మవ్యూహం పన్నుకుంటూ వచ్చారు.

1962 ఎన్నికలకు కాంగ్రెసు అభ్యర్థుల నిర్ణయంలో ఈ కొత్త పరిణామం బయటపడింది. రాష్ట్రస్థాయిని రాజీగా కాంగ్రెసు అభ్యర్థుల జాబితాను తయారు చేశారు. అందులో అల్లూరి—బ్రహ్మానందరెడ్డి—ప్రముఖపాత్ర వహించారు. ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా శ్రీ వల్లంరాజా మధ్యవర్తిత్వం నెరపారు. రాష్ట్ర ఎన్నికలసంఘంనుంచి కాంగ్రెసు అభ్యర్థుల జాబితా బయటకు రావడంతోనే శ్రీ సంజీవయ్యను త్రోసివేశారన్నారు. అంతేకాదు. అల్లూరి—సంజీవరెడ్డి తిరిగి కలిసిపోయారనే ప్రచారం సాగింది.

ఈ దశలోనే శ్రీ సంజీవయ్య విజృంభించారు. రాష్ట్ర ఎన్నికల సంఘం జాబితాకు సవరణ పెట్టారు. స్వశక్తిమీద ఆధారపడి, అఖిల భారత కాంగ్రెసు సంఘానికి అప్పీలు చేశారు. అక్కడితో అంతమైనాయి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్‌లోని అంతర్నాటకాలు. అక్కడినుంచి ప్రారంభమైనాయి కాంగ్రెసు అధిష్ఠానవర్గం ఆదేశాలు:

కాంగ్రెసు అధిష్ఠానవర్గంఅంటే, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు వ్యవహారాలకు సంబంధించినంతవరకు అధ్యక్షులు శ్రీ సంజీవరెడ్డి. అది ఆయన స్వంత రాష్ట్రం. కనక ఆయనమాట కాదనడం సంప్రదాయ విరుద్ధం. అందువల్ల దాని వ్యవహారాలు ఆయన అభీష్టం ప్రకారం జరగాలి. ఆయనలో విశాలదృష్టి లేదంటే, ఆయన ముఠాతత్వంతో వ్యవహరిస్తున్నాడంటే, అది ఆ రాష్ట్రం దురదృష్టం. అదీకాక, అక్కడివారితో పూర్వం ప్రకాశంగారివలెనే ఆయన మొదటినుంచి చెబుతున్నారు. తాను లేనప్పుడు తన రాష్ట్రంలో తగాదాలు తప్పవని. తాను కోరుకుంటున్నది కేంద్రంలో పదవులనుకాక, స్వరాష్ట్రంలో పెద్దరికాన్ని మాత్రమేనని. కేంద్రానికి చేరిన పెద్దలలో ఇలా అనేవారు ఎందరు వున్నారు? అదీ అధిష్ఠానవర్గంలోని వాతావరణం. అవీ అక్కడి రాజకీయాలు.

అంతేకాదు. అక్కడ రాజకీయాలు మరికొన్ని వున్నాయి. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్ష పదవిఅంటే చిన్నదికాదు. కాంగ్రెసు సంస్థకు దేశంలోవున్న చరిత్ర దృష్ట్యా అది చాలా ఉన్నతమైన పదవి. ఆ పదవిని నిర్వహించినవారు అఖిల భారత నాయకుల శ్రేణికి చెందుతారు. అలాగే చెల్లుతారు. కాని దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన పిమ్మట ఆ పదవికి ఆ సంప్రదాయం తప్పింది. ఆచార్య కృపలానీ, శ్రీ పురుషోత్తందాస్ టాండన్, శ్రీయుతులు ఎస్. ధేబర్, శ్రీమతి ఇందిరాగాంధీలు ఈ పదవిని నిర్వహించారు. అంతరంగికమైన కారణాలవల్ల ఆ పదవులనుంచి తప్పుకున్నారు. ఆ తర్వాత తర్వాత మరొక పదవిని స్వీకరించలేకపోయారు. అందుకు సంబంధించిన సమస్య వారివల్ల కాంగ్రెసు అధిష్ఠానవర్గానికి ఉత్పన్నంలేదు.

కాని శ్రీ సంజీవరెడ్డిగారి విషయంలో అలా జరగలేదు. ఆయన వారికొక సమస్యగా నిలిచారు. అయితే ఆయనను కాంగ్రెసు అధిష్ఠానవర్గంవారు తమ సమస్యగాకాక, ఆంధ్రప్రదేశ్ సమస్యగా భావించారు. ఆంధ్రుల ప్రతినిధిగా కేంద్రంలోనే వుంచుకొని గౌరవించలేకపోయారు. ముఖ్యమంత్రిగా వున్నవారిని అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా తీసుకువచ్చాము కనక ముఖ్యమంత్రిగానే

తిరిగి ఆంధ్రప్రదేశ్‌కు పంపాలనే నిర్ణయానికి వచ్చారు. అది అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షపదవిని నిర్వహించినవారిని గౌరవించడం అవునో కాదో వారికే తెలియాలి. ఆంధ్రులకు సంబంధించినంతవరకు అదెన్నటికీ గౌరవించడం మాత్రం కాబోదు.

శ్రీ సంజీవరెడ్డి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ముఖ్యమంత్రిగా తిరిగి రాకూడదని ఎవ్వరూ అనరు. కాని, అలా రాదలచినవారు అనుసరించవలసిన పద్ధతులు కొన్ని వున్నాయి. మనది ప్రజాస్వామిక వ్యవస్థ అని భావించినప్పుడు ఆ పద్ధతులను అనుసరించడం భావ్యం. కాని కాంగ్రెసు అధిష్ఠానవర్గం అవని కూడా చేయలేదు. పైగా కాంగ్రెసు చరిత్రలో కొత్త సంప్రదాయాన్ని సృష్టించింది. కాంగ్రెసు అధ్యక్షులు శాసన సభ్యుడుగా వుండడమే అపూర్వమనుకుంటే, కాంగ్రెసు అధ్యక్షుడు శాసన సభకు పోటీ చేయడానికి కూడా అంగీకరించి, ఆశ్చర్యం కలిగించారు. ఇలా చేయవలసిన అవసరం ఏమిటనిపించారు. అవును. ఇందులో ఎవరి అవసరాలు ఎలాంటివో ఆంధ్ర ప్రజలకు తెలియక పోలేదు.

అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా శ్రీ సంజీవరెడ్డి, మరి ఎనిమిది నెలలు వుండవలసిన అవసరం వున్నది. అవసరమైతే, మరొకదఫా ఆయననే అధ్యక్షులుగా ఎన్నుకొనడానికి అడ్డంకి లేదు. కాని, కాంగ్రెసు అధిష్ఠాన వర్గానికి అలాంటి యోచనలు కలగలేదు. ఆయనను తమ మధ్య వుంచుకొనే అవసరమూ కనిపించ లేదు.

శ్రీ సంజీవరెడ్డిని గురించి ఇంత మన్నితమైన అభిప్రాయాలు కాంగ్రెసు అధిష్ఠానవర్గానికి వున్నప్పుడు, పాట్నా కాంగ్రెసు మహాసభలోనే కాంగ్రెసు అధ్యక్షులుగా ఆయనకు వీడ్కోలు చెప్పవలసింది. మాజీ—కాంగ్రెసు అధ్యక్షుని హోదాలో శాసన సభకు పోటీ చేయనివ్వవలసింది. అందరు శాసన సభ్యులకు వలెనే, పార్టీ నాయకత్వానికి పోటీ చేసే అవకాశాన్ని ఇవ్వవలసింది. కాని కాంగ్రెసు అధిష్ఠానవర్గానికి అలా చేయవలసిన అవసరం కనిపించలేదు. పైగా అంతకు విరుద్ధమైనవిధంగా వ్యవహరించింది. "కాంగ్రెసు అధ్యక్షుడు పార్టీ నాయకత్వం స్వీకరించదలచినప్పుడూ, ఏకగ్రీవంగా ఎన్నుకోకపోవడం అసభ్యం" అనే వాదన చేసింది. అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుని హోదాలో శ్రీ సంజీవరెడ్డి ఆంధ్రప్రదేశ్ శాసనసభా కాంగ్రెసు పక్షం నాయకుడుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యే వాతావరణాన్ని సృష్టించింది.

ఇందులో రాజకీయమైన ఒక విశేషాన్ని కూడా కాంగ్రెసు అధిష్ఠానవర్గం గుర్తించలేదు. అవతల ఇంతవరకు ముఖ్యమంత్రిగావున్న శ్రీ సంజీవయ్య హరిజనుడు. గాంధీజీ ఆశించిన విధంగా హరిజనుని పట్టం కట్టారని ఆంధ్రప్రదేశ్‌కు కీర్తి తెచ్చినవాడు. సిద్ధాంతరీత్యా కాంగ్రెసు సంస్థ ప్రతిష్ఠను పెంచినవాడు. అలాంటి ప్రసిద్ధి తెచ్చిన రాజకీయ ప్రయోజనాన్ని కూడా ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసు అధిష్ఠానవర్గం త్రోసిరాజన్నది. "రెడ్డివచ్చె మొదలాడు" అన్న సామెత నిజం చేసింది. రాజకీయంగా అప్రతిష్ఠ తెచ్చుకుంది. ముఖ్యమంత్రిగా వచ్చిన తర్వాత శ్రీ సంజీవరెడ్డి తన మంత్రివర్గ నిర్మాణంలో చూపిన దృక్పథం ద్వారా ఈ ప్రతిష్ఠను ఇంకా పెంచారు.

మరి, ఆంధ్ర కాంగ్రెసు నాయకులకు ఈ సంగతులు తెలియవా, రాష్ట్రం సంగతి సందర్భాలు అధిష్ఠానవర్గానికి చెప్పలేకపోయారా అని అలోచిస్తే, ఇవన్నీ వారికి తెలిసినా, తెలియనట్లేనని భావించాలి. అంతా అయిపోయిందని అస్త్ర సన్యాసం చేయడం రాజకీయంకాదు. కనక ఆడవలసిన నాటకాలు అన్నీ ఆడడం, ఆడించడం ముఖ్యం. అప్పుడుకాని, రాజకీయం రసవత్తరంగా రక్తి కట్టదు. సందర్భానుసారంగా ముక్తి లభించదు.

ఇందులో మొదటి నాటకం ఆడింది అల్లూరి—సర్లం ద్వయం. వీరిద్దరి బలం సర్కారు జిల్లాలలో కేంద్రీకరించబడివుంది. వేర్వేరుగాచూస్తే అప్పటి పరిస్థితులలో ఇద్దరూ బలహీనులే. కాని కలిసివుంటే బలదర్పం కనిపిస్తుంది. అందుకే ఒకరికి ఒకరు ఆసరగా వుంటూ వచ్చారు. స్వయంకృతాపరాధాలు చేశారు. శ్రీ సంజీవయ్యను బలహీన పరచారు. తాము బలహీనులయ్యారు. చివరకు ఎవరికివారే యమునాతీరే అనిపించారు.

రెండవ నాటకం ఆడింది కాంగ్రెసు అధిష్ఠానవర్గం. సంజీవయ్య పాలన సాగిన రెండేళ్ళ, కాంగ్రెసు అధ్యక్షుని పాక్షిక ప్రవర్తనకు అధిష్ఠానవర్గం ఆమోద ముద్ర వేసింది. సామరస్య సాధనకు సరైన ప్రయత్నమే చేయలేదు. పైగా శ్రీ సంజీవరెడ్డి వస్తేనేకాని, మీ రాష్ట్ర వ్యవహారాలు సవ్యంగా నడవవనే తీర్పు చెప్పింది.

తీర్పు చెప్పవలసిన జడ్జి ముందుగానే ఒక నిర్ణయానికి వచ్చివున్నప్పుడు న్యాయమెలా జరుగుతుంది? అందువల్ల 1962 ఎన్నికలకు కాంగ్రెసు అభ్యర్థుల నిర్ణయంలో సుమారు 80 మందిని ఏకపక్షంగా స్థిరపరచింది. రాష్ట్రస్థాయిని సమైక్యతతో సిఫారసు చేసిన జాబితాను చిందర వందర చేసింది. కేవలం శ్రీ సంజీవరెడ్డిని ముఖ్యమంత్రి చేయాలన్న తలంపుతో అభ్యర్థులను ఖరారు చేసింది. రాజకీయమైన ఆశలతో వ్యవహరించిన రాష్ట్ర నాయకులందరికీ శృంగభంగం కలిగింది.

అయితే మనది ప్రజాస్వామిక వ్యవస్థ. అధిష్ఠానవర్గం అనేది "కమ్మవర్గం"గా వ్యవహరించడాన్ని ప్రతికవేర్పిన రాష్ట్ర నాయకులు సహించినా జరుగుతున్నవి సార్వత్రిక ఎన్నికలు కనుక, తాలూకా, జిల్లా స్థాయిలోని కాంగ్రెసు వాదులు అంగీకరించలేకపోయారు. దాదాపు నూరుమంది ఎదురు తిరిగి స్వతంత్రులుగా పోటీ చేశారు. క్రమశిక్షణ చర్యలకు గురిఅయినారు. తాముగా ఓడిపోయారు. తమ పార్టీని ఓడించుకున్నారు. ఆవిధంగా ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసు సంఘం మరొకదఫా అధిష్ఠానవర్గం ఆదేశాలకు, అసమర్థతకు బలిఅయిపోయింది. 1962 ఎన్నికల ఫలితంగా తిరిగి ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు పెనుభూతం ప్రత్యక్షమైనదనిపించారు. ఆంధ్రప్రదేశ్‌లో మూడవ ముఖ్యమంత్రిగా అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా శ్రీ నీలం సంజీవరెడ్డి అధికార స్వీకారం చేశారు. శ్రీ సంజీవయ్యను, శ్రీ అల్లూరిని అజ్ఞాతవాసంలోకి పంపారు.

1952 లో శ్రీ సంజీవరెడ్డి ఆంధ్ర కాంగ్రెసు సంఘం అధ్యక్షులుగా వున్నప్పుడు ఆంధ్ర జిల్లాలలో కాంగ్రెసు దెబ్బతిన్నది. అయితే అది రాయలసీమలోకంటె సర్కార్లలో హెచ్చుగా నష్టపోయింది. అది శ్రీ సంజీవరెడ్డి నాయకత్వం స్థిరపడడానికి అవకాశమిచ్చింది. 1962 లో శ్రీ సంజీవరెడ్డి అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులు అయినప్పటికీ ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసు అపజయం పొందింది. అయితే అది సర్కార్లలోకంటె, రాయలసీమలో హెచ్చుగా జరిగింది. అయినా శ్రీ సంజీవరెడ్డి తిరిగి రాష్ట్ర నాయకత్వం చేపట్టారు. 1952 అనంతరం శ్రీ సంజీవరెడ్డి శాసనసభ్యుడు కాకుండానే, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘాధ్యక్షుడుగా ఆంధ్ర కాంగ్రెసు శాసనసభా పక్షం నాయకుడుగా ఎన్నికైనారు. 1962 లో అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా, ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యుడుగా ఎన్నికై, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు శాసనసభా పక్ష నాయకత్వం స్వీకరించారు. ఆనాడు సర్కారు జిల్లాల నాయకుల అండ దండలతో రాష్ట్ర నాయకులైనారు. ఈనాడు కాంగ్రెసు అధిష్ఠానవర్గం ఆశీర్వచనాలతో ముఖ్యమంత్రి కాగలిగారు. కనుకనే అంటారు, అదృష్టవంతుణ్ని చెడగొట్టే వారెవ్వరని. గత పదేళ్ళ ఆంధ్ర రాజకీయాలలోను శ్రీ నీలం సంజీవరెడ్డికి పట్టిన అదృష్టం మరే రాష్ట్రంలోను, మరే నాయకునికి పట్టలేదు.



# నన్నయభట్టు

శ్రీ శాస్త్రి వెంకట నరసయ్య

నన్నయభట్టు తెల్గు కవి నాథుల కందఱ కాద్యుఁడై సునం
పన్నత సంస్కృతాంధ్రములఁ బండిన భారతమాంధ్రజాతికిన్
పెన్నిధిగా నొసంగి సుమపేశలమైన కవిత్వచంద్రికన్
గ్రొన్నెలవోలె వెల్గెడిని కోర్కులు పండగ సాహితీ దివిన్

వైదికధర్మమే జగతి పావనమైన దటంచుఁ దెల్ప న
మ్మోదము మానసంబునను ముప్పిరి నొందగ వ్రాసె నాతఁడా
సుందర సత్యమంగళ సుశోభిత 'భారతమాంధ్ర శారదా
వందన కల్పవృక్ష మగునా' యని సన్నుతిఁ జేయఁగా బుధుల్

సౌశీల్యంబును జక్కదిద్ది జనతా సౌభాగ్యమున్ గూర్పగా
రాశీభూత సమస్తభవ్య నియమారంభమ్ములన్ వెల్గుచున్
దేశీయంబగు సంస్కృతిన్ నరసతన్ దెల్పంగ శ్రీ భారతం
బాశాజ్యోతియుఁబోలె నొప్పు భువిలో నాంధ్రాళి భండారమై

పూవుతావియు మిళితమై పొదలునట్లు
చంద్ర చంద్రికలేకమై సాగునట్లు
తెనుగువారును నన్నయ్య దివ్యకావ్య
పఠన లన్యోన్య మిత్రతఁ బఱగుగాత.

పోతన తిక్కన కవితా
పూతుని శ్రీ నన్నయార్యు పూజింత్రుగదా!
ఆతతలాభము రచనల
చేతలచే నాంధ్రి కిచ్చు సిద్ధుల రగుటన్.

చుకూజ భారతంగీతం నన్నయార్య పికోత్తరా
ఆంధ్రజాత్యభివృద్ధ్యర్థం కళాశిల్పేన పూరితం.

నన్నయభట్టు అనెడు కోయిల సారస్వతమనెడు మామిడి చెట్టునందు కూర్చొని ఆంధ్రులను అభ్యుదయ మార్గమున నడిపించుటకు కళాశిల్పముతో నిండిన భారతమును గీతమును పాడెను.

---

# భారతదేశంలో దార్శనిక చింతన

ప్రొఫెసర్ కె. సచ్చిదానందమూర్తి

**ఒకే సంస్కృతికి చెందిన వివిధ దర్శనాలకు సామాన్యమైన ప్రతిభ ఒకటి ఉంటుంది.**

పాశ్చాత్య దేశాల్లో దర్శనశాస్త్రం అంటే ఏకరూపమైన భావం ఏమీలేదు. దర్శనశాస్త్రాన్నిగురించి గ్రీకులకున్న భావానికీ కాంట్‌కున్న భావానికీచాలా వ్యత్యాసంవుంది. అలాగే కాంట్ దార్శనిక చింతనకూ 'ఏయర్' వంటి దార్శనికుని చింతనకూ ఏమాత్రం సాదృశ్యంలేదు. అయితే, ఐరోపీయ సంస్కృతిలోని దర్శనశాస్త్రానికీ, హైందవ చైనీయ సంస్కృతులలోని దర్శనశాస్త్రాలకీ విలక్షణమైన స్థూల లక్షణాలుకొన్ని ఉన్నవి. ఉదాహరణకు, జర్మనీ, ఇటలీ, స్పెయిను దేశాల్లో ఊహించబడ్డ దార్శనికశాస్త్రానికీ బ్రిటన్, స్కాండినేవియన్ దేశాల్లో వికసించిన దర్శనశాస్త్రానికీ చాలావ్యత్యాసం ఉన్నదని మనం చెప్పవచ్చును. అయితే, నిశ్చయంగా దీనికి అపవాదాలున్నాయి. బ్రిటన్‌లో బ్రాడ్లే, వైట్‌హెడ్‌లు ఉద్భవించారు; కీర్కెగార్డు డెన్మార్కులో ఉద్భవించాడు. అయినా, ఒక సంప్రదాయానికి మరో సంప్రదాయానికీ వ్యత్యాసం చూపే టటువంటిది ఒకటివున్నదని భావించడంలో మరి తప్పేమీలేదు. ఈవ్యత్యాసం అనివార్యమైనది. ఎందుచేతనంటే దార్శనిక చింతన శూన్యంలోగాక ఒకానొక చారిత్రక సాంప్రదాయంలో జరుగుతుంది. ఒక దేశ భూగోళపరిస్థితులు, దానితో స్థిరపడిన జాతి సాంస్కృతిక సాంప్రదాయాలూ ఆదేశ చరిత్రపై ప్రభావాన్ని కలిగిఉంటవి. అలాగే ఒక దేశంలోని చింతనా రీతులలోనూ, ఆచరణ విధానాలలోనూ ఇతర దేశప్రభావాలు చిరకాలం ఉండే గాఢమైన మార్పులను కలగజేస్తవి. ఒక ఉదాహరణ చూపాలంటే, కాలెరిడ్జ్, కెయిర్డ్, గ్రీన్‌లలో ప్రవహించే జర్మనుప్రభావంసాయం లేకుండా బ్రాడ్లే, బోసాంకేల చింతనను అర్థం చేసుకోలేము.

కాబట్టి, ఒక సాంప్రదాయంలోని దర్శనశాస్త్రాన్ని స్వంతమైన విశిష్ట ప్రజ్ఞగల చారిత్రకమైన, అవిరతమైన, బహుశా ఒక ప్రత్యేకమైన గమ్యంగల భూతార్థంగా మనం గ్రహించవచ్చునని విషయాన్ని నేను సిద్ధ విషయంగా గ్రహిస్తున్నాను.

నేను చెప్పే చాలా విషయాలు అన్ని భారతీయ దర్శనాలకూ వర్తిస్తాయి. అయితే కొన్ని విషయాలు హైందవ సంప్రదాయంలోని దర్శనాలకు మాత్రమే వర్తిస్తాయి. "హైందవ సంప్రదాయం" అంటే నా అర్థం మొహంజోదారో, హరప్పాల ప్రజలూ, వైదిక ఆర్యులూ, వారి సంతతిలోనే తరువాత తరాలవారూ ప్రతిపాదించి, రూపొందించిన సభ్యత, నాగరికతలు. ఇతర సంస్కృతుల దర్శనాలకు భిన్నంగా భారతీయ దర్శనాలకు విశిష్టమైన లక్షణాలను ఇప్పుడు నేను వివరించ ప్రయత్నిస్తాను.

## అనంతత్వదృష్టి : ఆవర్త సిద్ధాంతము

భారతదేశాన్ని భావుకతతో అర్థం చేసుకున్న వ్యక్తికి ప్రథమంగా కనబడే విషయం అది ఒక విభిన్న శీతోష్ణస్థితులు కల్గిన విశాలమైన భూఖండం అని—సోవియట్ మధ్యఆసియాను ఒకమూల తాకుతూ, రెండో మూల సింహళం వరకు విస్తరించి, సముద్రత్రయ ముద్రితమై బహు విశాలంగా ఉంది. పర్వతప్రాంతాలలోనూ, లోయలలోనూ మనకు అతి సుందరమైన దృశ్యవైభవం కనబడుతుంది. అరణ్యాలలోనూ, ఎడారులలోనూ ప్రకృతిలో విలీనమైన మానవుని బాధాకరమైన ఏకాంతతా, వేరు పాటూ, మనకు గోచరిస్తవి. భూకంపాలూ, తుంఫానులూ, వినాశకరమైన వరదలూ వంటి భయంకరమైన ప్రకృతిశక్తులు భారతదేశంలో అతి సామాన్యం. అద్భుతశక్తిగల అటవీ మృగాలూ, విరుగుడులేని విషాన్నిగక్కే సర్పాలూ, ఈ దేశంలో మానవుని సహవాసులు. భారతదేశంలో దేనికీ పరిమితులు లేవని చెప్పవచ్చు. ఉష్ణమండల సూర్యుని కాంతి, వేడి, వడగాలి, అనంతం. ఆ సూర్యుడు కాలుస్తాడు, నీరసపరుస్తాడు. కాని అతనే పోషిస్తాడు కూడా. కాంతివంతమూ, అతి నిర్మలమూ అయిన ఆకాశం మైదానాల్లో నివసించే మానవుణ్ణి విభ్రాంత పరుస్తుంది. ఈ విధంగా అవధుల్లేని వస్తువుల మధ్య నివసిస్తూ భారతీయుడు అనంతత్వదృష్టిని అల వర్చుకుంటాడు. మానవునికిగానీ, ప్రకృతికిగానీ, దేనికీ అంతులేదు. ఎందువల్లనంటే చాక్రికమైన (cyclic) విశ్వప్రక్రియ మానవుని దృష్టిలో అనంతంగా కనబడుతుంది. ప్రాణదాయకమైన వసంతమూ, దాని తరువాత తపింపజేసే వేసవి, దాని తరువాత హిమవత్పర్వతాల నుంచి వీచే శీతగాలులతో శీతాకాలం, ఒకదాని తరువాత ఒకటి, పునరావృత్తం అవుతవి. అవి రాకనూ మానవు. వచ్చి పోకనూ మానవు. ఋతం, క్రమం, వాటిస్వరూపంగా కనబడతవి. ఇలాంటి రాకపోకలూ, జనన మరణాలూ మొత్తం ప్రపంచ విషయంలోనే నిజం కాకూడదా ? తాను అల్పుడననీ, నిస్సహాయుడననీ అని పింపజేసే బ్రహ్మాండమైన ప్రపంచము మానవుడికి అమితముగానూ, అనాదిగానూ కనబడుతుంది. ఇలాంటి గొప్ప వస్తువుకు అంతం ఎలా ఉంటుంది ? త్వరితంగా విచ్ఛిన్నమవుతూ, అయితే తనలోని ఒకానొక అంతరనియమం ద్వారా నిరంతరం పునః పునః జీవిస్తూ ప్రపంచం అనంతంగా ఉంటుంది. ఈ అనంతత్వ దృష్టే విశ్వసృష్టిలయాల పునరావృత్తి సిద్ధాంతానికి కారణం. ఈ విశ్వాసం పురాణాల్లోనూ దర్శనశాస్త్రంలోనూ కూడా గ్రహించబడింది. భారతీయ దర్శనాలన్నీ ప్రపంచప్రక్రియ అనంతమనే భావిస్తవి. అది అనంతం అంటే అర్థం, అది ఉద్భవిస్తూ, నశించుతూ, పునరుద్భవిస్తూ, ఉంటుందని. అయితే ఈ ప్రక్రియ నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది. 'మీమాంస' అనే ఒకే ఒక భారతీయ దర్శనం ప్రపంచం నిత్యమని వాదిస్తుంది. ప్రపంచం ఇప్పుడెలా ఉందో గతంలో కూడ అలాగే ఉంది. ఇప్పు డున్నట్లే భవిష్యత్తులో కూడ ఉంటుంది. సృష్టిక్రమనిర్ణయాన్ని అంగీకరిస్తే ఇదే పర్యవసానమని మీమాంసకుల వాదన. నైతిక నియమం లాగానే, భౌతిక ప్రపంచంలో దానికి సమానమైన భౌతిక నియమం కూడా అనుల్లంఘనీయం కాబట్టి, ప్రపంచం నిత్యంమాత్రమే కాగలదు. ఈవిధంగా సింధు లోయలోని పశుకాపరుల జాతి చైతన్యంలో ఆవిర్భవించిన అనంతత్వదృష్టి సృష్టి పునరావృత్తి సిద్ధాంత రూపంలో అన్ని భారతీయ దర్శనాలకూ అంగీకారంగా ఉంటూనే వచ్చింది.

## ఆత్మమహిమ : మానవుని ప్రతిష్ఠ (గొప్పతనము)

హైందవ దర్శన శాస్త్రంలో మరొక విచిత్రమైన లక్షణం, మానవుని యెడల దానికి గల గౌరవదృష్టి. భారతీయ చింతనలో మానవుడు నిస్సందేహంగా అనంత విశ్వంలో ఒక అణువు మాత్రమే అయినప్పటికీ, ఆ చింతనలో అతనికి దివ్యమైన గమ్యమూ, గొప్పతనమూ ఉన్నవి. అతనికి సృష్టికర్త ఎవరూ లేరు. అతని కొక నియంతా లేడు. మానవుని కంటె శ్రేష్ఠతరమైన వస్తువు మరొకటి లేదు. ఇదే గొప్ప రహస్యమని మహాభారతం చెబుతోంది. ("గుహ్యం బ్రహ్మ తదిదం బ్రవీమి నహి మానుష్యాత్ శ్రేష్ఠతరం హి కించిత్"—శాంతిపర్వం—180. 12)

భారతీయ దర్శనశాస్త్రానికి ఆత్మసృష్టి నిషిద్ధ విషయం. సృజింపబడ్డ వస్తువేదీ నిత్యం కాలేదు. అలాగే సృజింపబడ్డ వస్తువేదీ తన కర్మకు తానే కర్త కాలేదు. కాబట్టి, ఆత్మలు సృజింపబడలేదనీ, అవి నిత్యాలనీ, భౌతిక ద్రవ్యం మాత్రం వస్తుమయ జగత్తుగా మలచ బడుతుందనీ అన్ని భారతీయ దార్శనిక ప్రస్థానాలూ విశ్వసిస్తాయి. సాంఖ్యము వంటి కొన్ని దర్శనాలు దీనిని అంగీకరించవు. సాంఖ్య దర్శన దృష్టిలో విశ్వ నాటకానికి రంగభూమిని చేకూర్చడానికి ప్రాథమిక భౌతిక ద్రవ్యము (ప్రకృతి) తనకు తానే పరిణమించింది. ఒకేఒక అప్రధాన హైందవదర్శనం మాత్రం ఆత్మలు సృజింపబడినవని వూహించింది. ఇది భాగవత మతం. అయితే దీనికి ఎన్నడూ ప్రముఖస్థానం లేదు. ఈ వాదు దీనిని అనుసరించేవారూ లేరు. క్రైస్తవ సంప్రదాయంలోని ఏ దర్శనమూ కూడా ఆత్మలు నిత్యాలని అంగీకరించదు. ఇలాంటి ముఖ్యమైన వ్యత్యాసం మన స్వభావాల్లో ప్రధానమైన భేదాలను తీసుకొని రావలసిందే. తీసుకువచ్చింది కూడాను. ఆత్మను స్వయం సమృద్ధంగానూ, నిత్యంగానూ పరిగణించే ఏ దర్శనమైనా ఆత్మను సర్వప్రధానమైన వస్తువుగా గణించక తప్పదు. అలాంటి దర్శనంలో ఆత్మను గురించిన మననం ప్రధాన విషయంగా ఉంటుంది. ఆత్మను నిత్యంగానూ, పూర్తిగా స్వతంత్రంగానూ భావించడంవల్ల ఆత్మలు ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా దేనికది కేవలంగా ఉంటువనే భావం పర్యవసిస్తుంది. అటువంటి సందర్భంలో పరస్పరం సహకరించే ఆత్మల సమాజమూ ఉండదు. సుసంగతమైన ప్రజాతంత్ర రాజ్యం అసలే ఉండదు. ఆత్మలకు సంపూర్ణమైన స్వాతంత్ర్యం ఉన్నదనే భావం పటిష్ఠతలేని సామాజిక బంధాలకూ, సామాజికైక్యతకూ, స్వార్థ ఆధ్యాత్మిక పురోగతే అత్యంత ప్రధాన విషయమనేభావనకు త్రోవ తీస్తుంది. ఆత్మకు నియంతా, సృష్టికర్తా లేకపోవడంవల్ల దానికి విపరీతమైన బాధ్యత ఏర్పడుతుంది. తత్ఫలితంగా ఆత్మకు దానిబయటనుంచి ఏ సహాయం రాదనే భావన ఏర్పడుతుంది. అది తన సంగతి తనే చూసుకోవాలి. లేకపోతే నశించిపోవాలి. కరుణామయుడైన ఒకసృష్టికర్త ప్రసాదం గానీ, త్యాగమూర్తి అయిన ఒక రక్షకుని విమోచనం గానీ దానికి సహాయపడవు. దీని ఫలితంగా తను చాలా ముఖ్యుడనే దృష్టి, తన బాధ్యతనుగురించి పూరికే ఆలోచిస్తూ కూర్చోవడమూ అధిక మవుతవి. "నేను ఎలా పవిత్రంగా ఉండగలను ? ఆత్మకు సహజాధికారాలైన పవిత్రతనూ, ఆనందాన్నీ నేను రక్షించుకోవడంగానీ, తిరిగి సంపాదించుకోవడం కానీ ఎలా?" ఇదే భారతీయ మోక్షశాస్త్రంలో నిరంతర చర్చావిషయం. ఆత్మ అసృష్టమనే భావం చాలా గొప్పదైనా అది చాలా సాహసంతో కూడిన కల్పన. దీని పర్యవసానాలు విషాదకరంగానూ, గొప్పగానూ కూడా ఉన్నవి. న్యాయం, రామానుజవేదాంతం వంటి సేశ్వర దర్శనాల్లో కూడా ఆత్మలు సృజింపబడవు. వారి కర్మాకర్మలకు అవే బాధ్యులు. వాటి మోక్షాన్ని అవే సంపాదించుకోవాలి. "ఆత్మకు ఆత్మే మిత్రుడు. ఆత్మకు ఆత్మే శత్రువు." భారతీయ ఆస్తిక దర్శనాల్లో ఈశ్వరుడు నైతిక నియమాన్ని పరిపాలించడం మాత్రమే చేస్తాడు. ఆత్మలతో గాని, వాటి అదృష్టంతో గాని అతనికి జోక్యం లేదు.

## నైతిక స్వేచ్ఛ: "కర్మ"

పాపం, అసమానత—వీటిసమస్య దర్శనశాస్త్రం అంతటిలోను చాలా చిముగును కలిగించే సమస్యలలో ఒకటి. అయితే అన్ని భారతీయ దర్శనాలూ దీని విషయమై ఒకే విధమైన పరిష్కారాన్ని అనుసరిస్తాయి. ప్రపంచం అనంతమనే భారతీయుని భావం శూన్యంలోనుంచి సృష్టి జరుగవచ్చుననే తలపును అతని మనస్సులోనికి రానీయదు. మానవుడికి ప్రతిష్ఠ (Degnity) ఉన్నదని, అతని ఆత్మకు విలువా, కేవలతా, ఉన్నవనీ భావించే భారతీయుని దృష్టి, ఆత్మ సృజింపబడినదనే భావాన్ని దగ్గరికి రానీయదు. పై రెండు భావాలూ కర్మసిద్ధాంతానికి త్రోవతీస్తాయి. ప్రపంచం అపరిపూర్ణమనీ, అందులో అసమానత యున్నదనీ, అందులో దుఃఖం ఉన్నదని ప్రతివానికీ తెలుసు. కానీ, ఒక బాహ్యశక్తి వీటిని ఆత్మలో ప్రవేశపెట్టలేదు గనుక, ఇవి ఆత్మ స్వకర్మఫలితాలే అయిఉండాలి. ప్రపంచం అనాది. ఆత్మలు అనాది. అవి ఇప్పుడనుభవిస్తున్న వాటికి కారణాలు వాటి కర్మలే అయి ఉండాలి. మరేశక్తి, అది దివ్యమైనది గానీ, రాక్షసమైనది గానీ, ఆత్మలను నియంత్రించలేదు. వాటికి అసమానతనూ దుఃఖాన్నీ కలగచేయనూ లేదు. ప్రపంచంలోని అన్ని వస్తువులలోనూ ఆత్మ శ్రేష్ఠతమమైనదీ, దుర్గ్రాహ్యమైనదీ అన్నది హైందవఋషుల ప్రత్యక్ష జ్ఞానవిషయం. తాము ఇప్పుడనుభవిస్తున్న అసమానత, దుఃఖము ఆత్మలకు వరము వంటిది. ఎందుకంటే, ఆత్మకు సహజాధికారమైన ప్రతిష్ఠ నుండి దానికి కల్గిన పతనాన్నుంచి అది తిరిగి కోలుకుంటున్నది. ఆత్మలు తమ సహజ ప్రతిష్ఠనుంచీ, పవిత్రత నుంచీ ఎప్పుడు పతనం చెందినవి ? అనే ప్రశ్నకు సమాధానం అనంతమైన కాలగతిలో కలిసిపోయింది. ఆత్మలు తమ పతన ఫలితాన్ని నిర్మూలించుకొన్నప్పుడు అవి తిరిగి మరొకసారి విముక్తు లవుతవి. ఈ విముక్తి గత పాప దుఃఖాల్నించే గాక, వాటికి కావాలంటే పునః పతనాన్నించి కూడా జరగొచ్చు. హైందవ దర్శనశాస్త్రంలో ఆత్మలకు తమ కిష్టం వచ్చినట్టు చేయడానికి సంపూర్ణ స్వాతంత్ర్యమున్నది. వాటికి యిష్టం వచ్చిన నరకానికి ఇష్టమైన విధంగా అవి వెళ్లవచ్చు. తిరిగి జాగరూకులై, నిలబడి, అజ్ఞాన దుఃఖ బంధాలను ఛేదించి నిత్యం వాటికొరకు ఎదురుచూచే మహత్వాన్ని తిరిగి అవి చేరుకోవచ్చు. క్లుప్తంగా ఇదే కర్మ పునర్జన్మల సిద్ధాంతం. ఆత్మలు ఎవరిప్రోద్బలంచేతా ఆవిర్భవించలేదని హైందవ దర్శనశాస్త్రం చెబుతుంది. ఆత్మలకు జన్మించాలనే ఇచ్ఛ కలిగింది, అందుకని అవి జనించినవి; జనించాలి; కర్మ చేయాలి; కర్మ ఫలితాల్ని అనుభవించాలి—అనే వాంఛ కొన్ని ఆత్మలలో కలుగుతుంది. కాబట్టి అవి మర్త్యలోకంలోకి అవరోహిస్తాయి. ఈ జన్మలోనూ, గత జన్మలోనూ అవి చేసిన, సంకల్పించిన అన్ని కర్మల ఫలాల్నీ అనుభవించినంతవరకూ, మృత్యువునుంచి అమృతత్వంలోకి తమని తాము ఉద్ధరించుకోవాలని సంకల్పించనంత వరకూ అవి ఇక్కడే ఉంటవి. ఇది నియతివాద దర్శనం (Determiniam) కాదు. స్వేచ్ఛావాద దర్శన మనేది స్పష్టం.

## విషాదదృష్టి

జీవితం ఎడల విషాదదృష్టియొక్క ఛాయ ఒకటి భారతదేశదర్శనాల మీద పడింది. వ్యాధి, వార్ధక్యం, మృత్యువు భారతదేశ దార్శనికవీధులలో స్వైరవిహారం చేసినవి. ప్రతి మలుపులో ఈ భూతాలు కనబడుతవి. సుమారు క్రీ.పూ. 600 ప్రాంతాలలో భారతీయులకు జీవితం మరీ విషాదకరంగా కనబడింది. వేదాలలో మనకు అమాయకత్వమూ, జీవితం అంటే ఉత్సాహమూ కనబడతవి. అనేక వైదికబుుక్కులలో "నూరు శరదృతువుల వరకూ మేము జీవించుగాక" అనే కోర్కె కనబడుతుంది. వైదిక కాలంలో జనాభా పరిమితంగా ఉండేది. గొర్రెలు, ఎద్దులు, గుర్రాలు సమృద్ధిగా ఉండేవి. గంగా, సింధూ మైదానాల్లో వేలాది ఎకరాల తరబడి గోధుమపండే ఫలవంతమైన ప్రదేశాలు విస్తరించి ఉండేవి. ప్రాణదాయకమైన సోమరసం ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండేది. వైదిక జనానికి జీవితం ఒక భావుకుని స్వప్నం వలె ఉండేదంటే ఆశ్చర్యం ఏమీ లేదు. అది ఎంత ఎక్కువైతే అంత మంచిది. తెగకూ తెగకూ మధ్య యుద్ధాలు, కొత్త తెగలు ప్రవేశించడం, క్షామం, వరదా, మహామారి, ఉష్ణమండలాల్లోని శక్తిహీనతా భారతదేశంలోని ఆశావాదాన్ని నిర్మూలించినవి. జీవితమే ఒక యుద్ధమైంది. ఇలాంటి పరిస్థితులలోనే ఉపనిషద్బ్రుషుల, బుద్ధుని సృజనాత్మకమైన శతాబ్దం అవతరించింది. ఉపనిషత్తులలో మనకు కొంత నిరాశావాదం కనబడుతుంది. దైనందిన విధులతోనూ, జీవితం ఎల్లప్పుడూ ఒకేవిధంగా ఉండడంవల్ల జనించే విసుగుతోనూ, అనివార్యమైన మృత్యు ముఖదర్శనంతోనూ జనం మొహం మొత్తిపోయారు. ఇలాంటి పరిస్థితుల్లోనే విషాదమయమనదగిన దర్శనాలు ఆవిర్భవించినవి. మృత్యువు అనివార్యము. క్షణికమైన ఒకటి రెండు సుఖాలను చవిమాడ్డంవల్ల మనకు ఏం ప్రయోజనం ? కాలం, అనవరోధనీయమైన తన ప్రవాహంలో మన పాదముద్రలను తుడిచివేస్తుంది. దేనిని సాధించినా ఏం ప్రయోజనం ? వాస్తవంగా జీవితం శుష్కమైనదే. ఆ నాటి ఆలోచనాత్మక వ్యక్తులలో కొందరి మనోభావం ఇలాంటిది. బుద్ధునిలోనూ, మహావీరునిలోనూ, శంకరునిలోనూ ఇలాంటి మనోభావం మనకు కనబడుతుంది. అయితే ఈ దర్శనాల్లో కూడా దుఃఖాన్నీ, మృత్యువునూ ఎలా జయించడ మనేదే ప్రశ్న. అందుకని భారతదేశంలోని ఆ నాటి విషాదదృష్టి అచేతనమైన నిస్సహాయమైన దృష్టి కాదు. మానవ జీవితం రసహీనమైనదనీ, మానవుని గమ్యం సహారా ఎడారి వంటిదనీ ప్రకటించటంతో తృప్తిపడి వారు వూరుకోలేదు. అందుకని ఆ దృష్టి సచేతనమైనదే. "విశీర్ణమైన, రసహీనమైన ఈ జీవిత చక్రాన్ని ఆనందమయమైన ఆత్మగానంగా ఎలా మార్చుదాం ?"—అదీ వారి సమస్య. మానవునికి మృత్యువు ఒక్కటే తథ్యంగనుక, ఈలోగా అతనికి ఏదైనా చేయడానికి స్వేచ్ఛ ఉంది గనక, దాన్ని అతను చేయడమే మంచిదని 'హైడగర్' వంటి ఆధునిక దార్శనికులు చెప్పే దానికీ, దీనికీ ఎంతో వ్యత్యాసం ఉంది. పురాతన హైందవులు అలవర్చుకొన్న విషాదదృష్టి ఇటువంటిది కాదు. వారు మృత్యువు నెదుర్కొన్నారు; అయితే, వారు దాన్ని జయించగోరారు. అధిగమనమే వారి లక్ష్యం. సృష్టి అంతా విషాదమయమైంది కాదనీ, ఎందువల్లనంటే వేదాంతం దృష్ట్యా బ్రహ్మ ఆనందం అనీ, సర్వ భారతీయ దర్శనాల నిష్పందిగ్ధమైన సమాధానం.

## హైందవదర్శనశాస్త్రలక్ష్యం: సంపూర్ణమానవుడు

హైందవ జీవితదర్శనశాస్త్ర దృష్టిలో నాలుగు పురుషార్థాలను (ధర్మం, అర్థం, కామం, మోక్షం) సాధించినవాడే సంపూర్ణ మానవుడు. వాత్స్యాయనుడిదృష్టిలో విషయాలకు గల మనసు సంతృప్తిపరచే శక్తికి అనుకూలంగా వాటిని అనుభవించటమే కామం. (విషయేషు అనుకూల్యతః ప్రవృత్తిః కామః). ఈ నాలుగు పురుషార్థాలకు అనుగుణంగా జీవితంలో నాలుగు దశ లున్నవి. (ఆశ్రమాలు) : (1) బ్రహ్మచర్యం (పవిత్రత, బ్రహ్మచర్యం అధ్యయనం—వీటివల్ల జ్ఞానమూ, పరిణతి లభిస్తవి). (2) గార్హస్థ్యం (వైవాహిక జీవిత దశ—దీనిలో మానవుడు తన విధులను తాను సక్రమంగా నిర్వర్తించడంవల్ల అతనికి సౌఖ్యమూ భాగ్యమూ లభిస్తవి) (3) వానప్రస్థం : (వార్థక్యపు సూచనలు కనబడగానే, కొడుకులూ, కుమార్తెలూ జీవితంలో బాగా స్థిరపడగానే, అటవీ ఆశ్రమాలకు పోయి అక్కడ విశ్రాంతిగా కాలం గడపటం). (4) సన్యాసం : (పరిత్యజించే కాలం. దీనివల్ల సంపూర్ణమైన రాగ రాహిత్యమూ, వాంఛా రాహిత్యమూ, ఐహిక విషయబంధ విమోచనమూ, ఆత్మైకత సాధించగలగడం.) ఆత్మ పరిపూర్ణుడై ప్రపంచం నుండి నిర్మోహితుడై శరీరాన్నుండి విముక్తుడవడంకొరకు కాలానికి లోబడి ఉంటూ, ఈ ఆశ్రమంలో మానవుడు రాగద్వేషాలూ, భయ వాంఛలూ లేకుండా ఉంటాడు. భీష్ముడు చెప్పినట్లుగా, వ్యాధి, శక్తిహీనత, వార్ధక్యాలచే పీడింపబడ్డ తరవాతనే మానవుడు ఈ దశలోనికి పోవాలి. పురాతన హిందూ సంప్రదాయం వీటిల్లో ఏ ఒక్క ఆశ్రమాన్నీ వదలివేయడానికి అంగీకరించలేదు. దేవాస్తను డనే బుుషి యుధిష్ఠిర మహారాజుతో చెప్పినట్లు ఈ దశలు నిచ్చెనమెట్ల వంటివి. వీటిలో ఒక మెట్టును వదిలినా వాడు క్రింద పడవచ్చు. సన్యాసం పిల్లలకూ, యువకులకూ లేదు. యౌవనంలో దైవం, ప్రకృతి—వీటిని గురించిన సత్యాన్ని తెలుసికోలేము. తత్త్వజ్ఞానాన్ని పొందలేము. సన్యాసానికీ, పరిత్యాగానికీ అతి ప్రాధాన్యమిచ్చి వాటిని సర్వసామాన్యం చేసింది బౌద్ధ సాంప్రదాయమూ, తరువాతి శంకరమతమూ మాత్రమే. పురాతన హైందవ సంప్రదాయానికి అలా గాక త్రివర్గమైన ధర్మార్థ కామాల ప్రాముఖ్యతలోనూ, ఆవశ్యకతలోనూ, విశ్వాసం ఉంది. సుఖ భాగ్యాల క్షణికతను గ్రహించడమే వివేకమనే మాట నిజమే గాని, ఆత్మ నిరాకరణ పూర్వకమైన దారిద్ర్యం, కఠినమైన విషయ విరక్తి—వీటితో కూడిన నీచమైన జీవితాన్ని నడపడం కూడా అవివేకమే. భరద్వాజుడు, అత్రి, వశిష్ఠుడు, వ్యాసుడు వంటి మహా బుుషులలో ఎవరూ కూడా ఇలాంటి జీవితాన్ని నడపలేదు. అన్ని సౌకర్యాలూ ఉన్న ఆశ్రమాల్లో వారు సుఖమయమైన జీవితాన్ని గడిపారు. జీవితంలోని దుఃఖాన్నీ, విషాదాన్నీ పురాతన హైందవ దర్శనాలు నిస్సందేహంగా ఎత్తి చూపినవి. కాని, సౌందర్యాన్నీ, కామాన్నీ అణచిపెట్టమని అవి ఎన్నడూ కోరలేదు. అయితే కేవలం ఇవే మానవ అస్తిత్వానికి ప్రేరణ శక్తిగా ఉండకూడదని మాత్రం చెప్పినవి. వాస్తవంలో, విషాద దృష్టి, "సుఖం సర్వం క్షణికం" అనే చింతనా, నిజమైన హైందవుని జీవితానికీ, ప్రేమకూ, ఒక అద్భుతమైన బిగువు నిచ్చినవి. ఉపనిషత్తు లుపదేశించినట్లు "తేనత్యక్తేన భుంజీథ" అంటే "రాగరాహిత్యంగా ప్రతిదానినీ త్యజించి ఆనందించు" అని, అంగిరస్సు—కమండకోపాఖ్యానానికి ఉపోద్ఘాతంగా భీష్ము డన్నట్లు ఫలాపేక్ష లేకుండా త్రివర్గాల ననుభవించటం మోక్షానికి త్రోవ తీస్తుంది.

## సాంప్రదాయికత

హైందవదర్శనాల మరొక విశిష్ట లక్షణం—అవన్నీ "సాంప్రదాయికమైనవి. వాటిల్లో ఏదీ కూడా నవీన ప్రాతిపదికతో బయలుదేరదు. అన్నీ కూడా తాము పురాతన సత్యాలను తిరిగి కనుక్కుంటున్నామనే చెప్తవి. కాబట్టి సంప్రదాయముతో సన్నిహిత సంబంధ మున్నట్లు అవన్నీ భాసిస్తవి. ప్రబల ఆలోచనారీతులకు, అలవాటుకూ వరాయిగా ఉండడానికి వాటిలో ఏదీ సాహసించలేదు. తాము కొత్త భావాలను ప్రతిపాదించినప్పుడు కూడా హైందవ దార్శనికులు అవి పురాతన గ్రంథాల్లో ఉన్నట్లుగానే చెప్పేవారు. దేన్నీ ఒక కొత్త సిద్ధాంతంగా ప్రతిపాదించేవారు కారు. ఈ విధమైన దార్శనిక కల్పనకు ఒక విధంగా సబబు కూడా ఉంది. సంపూర్ణంగా మౌలికమైన దాన్ని ఎప్పటికీ రూపొందించలేము. అది విజ్ఞాన శాస్త్రంలో గానీ, సంగీతంలోగానీ, దర్శన శాస్త్రంలోగాని వర్తమానం, భూతకాలంపైన నిర్మిత మవుతుంది. పురాతనసత్యాన్ని గ్రాహ్యం చేసుకుని పునరాలోచన చెయ్యడంలో క్రొత్తసత్యం ఉద్భవిస్తుందని హైందవ చింతకులు విశ్వ

సించారు. తర్వాతి తరాలవారు నిర్మించి, మార్చి, పునర్నిర్మించి, తిరిగి రంగు వేసే యూరప్‌లోని మధ్య యుగపు ప్రార్థనాలయాల వంటి ఉపరి నిర్మాణమే హైందవ సాంప్రదాయంలోని దర్శన శాస్త్రం. దాని దృష్టిలో దర్శన శాస్త్రం ఒక బృహత్తరమైన సంఘయత్నం. వ్యక్తులు దానికి నిష్పంకోచంగా దోహదం చేస్తారు. కాని నదిని చేరి, అనామకంగా, అయితే, ఉపయోగకరంగా ఉండే అసంఖ్యాకమైన సెలయేళ్ల వంటివారు, వారు.

## దర్శన శాస్త్రం-ఒక శక్తి-ఒక అధికారమూ

ఈ సాంప్రదాయికతకు ఒక ఫలితం, దర్శనశాస్త్రాన్ని ఒక అమూల్యమైన వారసత్వంగా పరిగణించడం. పాశ్చాత్యదేశాల్లోవలె గాకుండా, ఇక్కడ దర్శన శాస్త్రం, బంగారంలాగా ఆదరించి, పోషించి, బహుజాగ్రత్తతో రక్షించి, తరవాతి తరాలవారికి అందజేయాల్సిన వస్తువు. ఎంతో కష్టంతోనూ ప్రయాసతోనూ జనం దర్శన శాస్త్రాన్ని సంపాదించిన కథల్ని అసంఖ్యాకంగా మనం ఉపనిషత్తులలో చదువుతాం. దీనికి కారణం అది కలిగినవారు తమ విశ్వాసానికి పాత్రులైనవారూ, స్వంత కుమారులూ—లేదా చిరకాలంగా ఉన్న శిష్యులూ వంటి బహుకొద్ది మందికి మాత్రమే దాన్ని వెల్లడి చేసేవారు. ప్రాచీన గ్రీకులకు గూడా దర్శన శాస్త్రం విషయమై ఇటువంటి అభిప్రాయమే ఉండేది. ఆర్ఫిక్, ఎల్యూసినియన్ వంటి రహస్య జ్ఞాన మతస్థుల నటుంచి, పితగోరియన్లు, నవీన ప్లేటో వాదులు—వీ రందరికీ వారివారి రహస్య సమాజా లుండేవి. బయటివారికి వారు దేనినీ వెల్లడి చేసేవారు కారు. ఇలాంటి ప్రవృత్తి హైందవ దర్శనాలలో అనేకమైన వాటిల్లో కన్పిస్తుంది. అధికార మనేది ఒకటి ఉన్నది గదా; జన్మ శిక్షణల ననుసరించి దర్శన శాస్త్రాన్ని గ్రహించడానికి అధికార మేర్పడుతుంది.

## శ్రద్ధద్వారా దర్శనశాస్త్రాన్ని స్వంతం చేసుకోవాలి

దీని ఫలితాలతో ఒకటి హైందవ దార్శనిక ప్రస్థానాలకు విశిష్టమైన దార్శనిక శిక్షణ భావము. భారతదేశంలో దర్శన శాస్త్రం తరచూ బహిరంగంగా ఉండదు. ప్రతివాడూ తొంగిచూచి, తాకి, వదలివేయదగిన వస్తువు కాదది. తన ఎకాడమీ (విద్యా సంస్థ) ద్వారం మీద ప్లేటో "గణిత శాస్త్రం రానివాడు దీనిలో ప్రవేశించకూడదు" అని రాశాట్ట. అదేవిధంగా పురాతన భారతదేశంలో సర్వ శాస్త్రాలకు దర్శన శాస్త్రం రాజ్ఞి వంటిది. వ్యాకరణం, పవిత్ర శాస్త్రాలూ, రాజ్యాంగం, యుద్ధ నీతి వంటి శాస్త్రాలను మొదట క్షుణ్ణంగా అధ్యయనం చేసిన తర్వాత ఉత్తమోత్తమ శాస్త్రమైన పరావిద్యకై అన్వేషించాలి. ప్రముఖ ఋషి నారదుడు 'వాక్కును' (ఉపదేశాన్ని) గ్రహించటానికై సనత్కుమారుడి దగ్గరికి వెళ్లే ముందు చాలా అధ్యయనం చేసి వయోధికు డయ్యాడు. శ్వేతకేతువనే ఋషి తన విద్య నంతటినీ పూర్తి చేసిన తర్వాతనే తన తండ్రి వద్ద దర్శన శాస్త్రంలో ఉపదేశాన్ని పొందాడు. భారతదేశంలో దార్శనిక శిక్షణ అంటే తార్కిక విమర్శ కాదు. సిద్ధాంతాలను విశ్లేషణాత్మకంగా అనుశీలన చెయ్యడమూ కాదు. అమూల్యమైన ఉపదేశాన్ని శ్రద్ధతో గ్రహించాలి. ధ్యానం ద్వారా దానిని స్వంతం చేసుకోవాలి. సహాధ్యాయులతోను, ఉపాధ్యాయునితోనూ చర్చల ద్వారానూ, ప్రశ్నించడం ద్వారానూ దాన్ని పరిశీలించాలి. ఆ విధంగా దాని సత్యాన్ని గ్రహించాలి. తార్కిక వివాదమంతా తాను గ్రహించిన సత్యాన్ని దృఢపరచుకోడానికి, అపనమ్మకాలూ, కువిమర్శలూ అనే కంటకాలను తొలగించడానికీను. గౌతముని (న్యాయం) పురాతన గ్రంథంలో మనకు కనబడే తర్కం ఉపయోగం ఇది.

## సంస్కృతిని పరిరక్షించే శక్తి-దర్శనశాస్త్రం

దీనిఫలితంగా భారతదేశంలోని దర్శనశాస్త్రం సంస్కృతినీ, సంప్రదాయిక చింతనను, జీవనరీతుల్ని పరిరక్షించే ఒక శక్తిగా తయారయింది. పాశ్చాత్య దేశాల్లో దర్శనశాస్త్రం అతిపూర్వపు చింతనమూ, జీవన విధానాన్ని విమర్శించేది. దర్శనాలు తరచుగా అశ్వ మక్షికాల వలె ఆచరించి సభ్యతా పురోభివృద్ధికి త్రోవ దీసేవి. అయితే, భారతదేశంలో, విమర్శ ప్రతిపక్ష సిద్ధాంతాలకు మాత్రమే పరిమితమై ఉండేది. స్వసిద్ధాంత విమర్శ గానీ, హైందవ జీవనవిధానానికి ఆధారమైన పూర్వ గృహీత విషయాలపై విమర్శ గానీ జరగలేదు. దీనివల్ల కొన్ని నష్టా లున్నవి. వేలాది సంవత్సరాల తరబడి "కర్మ" వంటి విశ్వాసాలూ, వర్ణాశ్రమంవంటి జీవనాభ్యాసాలూ సవాలు చేయబడటం అటుంచి, చివరకి తీవ్రంగా విమర్శించబడను కూడా లేదు. ఎక్కడైనా తీవ్రంగా వీటిని దురుపయోగపరచటం జరుగుతే, దానిని వెంటనే సంస్కరించడానికీ, పరిస్థితుల కనుగుణంగా మార్చడానికీ ప్రయత్నాలు జరిగేవి. కాబట్టే భారతీయ—చింతనలోగాని, భారతీయ జీవనంలో గాని విప్లవాలు ఎన్నడూ సంభవించలేదు. తక్కిన అన్ని దేశాల్లోనూ పురాతన సభ్యతలు విచ్ఛిన్నమై నశించిపోగా, భారతదేశంలో పురాతన సభ్యత ఏ విధంగా నిరాఘాటంగా కొనసాగిపోయిందో అర్థంచేసికోవడం సులభం. ఈ రోజున గ్రీకు, రోమన్, బైజాంటైన్, అజ్టెక్ సభ్యతల శిథిలాలు మాత్రమే మిగిలి ఉన్నవి. భారతదేశంలో అలాకాక, రామాయణం, కాదంబరి, లేదా అర్థశాస్త్రంవంటి గ్రంథాలలో భారతీయ జీవనాన్నిగురించీ, ఆచారాల్నిగురించీ వర్ణనలు చదివినట్లయితే ఈ నాడు గ్రామాల్లో జనం నడిపే జీవితానికీ దానికీ ముఖ్య విషయాల్లో తేడా లేదని మనకు కనబడుతుంది. ఈ విధమైన సభ్యతా పరిరక్షణకు సమానమైన ఉదాహరణకు మనకు ఒక్క చైనాలోనే కనబడుతుంది. అయితే నేడు కమ్యూనిజం (సామాజిక వాదం) దానిని విచ్ఛిన్నం చేసింది. ఈ విధంగా సభ్యతకొనడానికి మరొక కారణం ఏమిటంటే, సాధారణంగా భారతీయ చింతకులు సిద్ధాంతాలని పరస్పరం తీవ్రంగా విమర్శించు కున్నప్పటికీ అన్ని సిద్ధాంతాల ఎడలా వారు సహనం చూపారు. అయితే, వర్ణాశ్రమాలను ఆచరణలో అనుసరించినంత కాలం జనం శాంతంగా వదిలివేయబడ్డారు. కాని సాంప్రదాయికమైన జీవన విధానాన్ని స్వల్పంగా నైనా వైదొలగి పోయినప్పుడు వారు ఆగ్రహించబడి, నాశనం చేయబడ్డారు. సిద్ధాంత విషయాల్లో అసహనం చూపుతూ ఆచరణ యెడల ఉపేక్ష చూపిన సెమిటిక్ సంస్కృతుల మనోస్వభావం దీనికి వ్యతిరేకంగా ఉంది.

## అనుభవిక విజ్ఞాన శాస్త్రానికి దూరంగా ఉండడం

భారతదేశంలోని దర్శన శాస్త్రానికీ, పాశ్చాత్య దేశాల్లోని దర్శన శాస్త్రానికీ ముఖ్యమైన వ్యత్యాస మేమంటే భారతీయదర్శన శాస్త్రానికి ప్రాకృతికవిజ్ఞానశాస్త్రంతో సన్నిహితమూ, బలవంతమూ అయిన సంబంధము ఎన్నడూ లేదు. ప్రాచీన గ్రీసువలెనే ప్రాచీన భారత దేశానికి కూడా విజ్ఞానశాస్త్రం ఉండేది. గణిత శాస్త్రంలోనూ, ఖగోళ శాస్త్రంలోనూ, చివరికి వైద్యశాస్త్రం, శస్త్ర చికిత్సలలో కూడా క్రీస్తుశకం రెండవ శతాబ్దం నాటికే గణించదగ్గ ఫలితాల్ని భారతీయులు సాధించారు. విదేశ ప్రయాణం సర్వసామాన్యమై భారతీయులు దూరప్రాచ్యంలో వలసలు స్థాపించుకొన్న తరువాత కూడా వారు వారి జీవన విధానంలోకి మార్పులు తేవడానికి ప్రయత్నం చేయలేదు. తక్కిన దేశాల మతాలలో తమ భారతీయ మతాన్ని పోలుస్తూ ఎలాంటి అనుశీలనలనూ వారు ప్రారంభించనూ లేదు. తమ సభ్యతాసందేశంలోనే విశ్వాసం కలిగి ఎల్లప్పుడూ ఇతరుల్ని అనాగరికులుగా పరిగణించిన రోమనుల వలెనే భారతీయులు కూడా భూమిపైగల ప్రతి ఇతర జాతికన్న కూడా తామే గొప్పవారమని భావించేవారు. అలా చెప్పుకొనేవారు కూడా. ఉదాహరణకు, ఈ దేశంలోని అగ్రకులాలవారు విధించిన ప్రమాణాల ననుసరించే ప్రపంచంలోని మానవు లందరూ తమ జీవితాల్ని క్రమబద్ధం చేసుకున్నారని మనువు అన్నాడు. ప్రసిద్ధ మహమ్మదీయ పండితుడైన అల్-బెరూని భారతీయుల ఈ లక్షణాన్ని గురించి రాశాడు. అనేక భారతీయ గ్రంథాలలో పరాయి దేశస్థులు—అరబ్బులు, పారసీకులు మొదలైనవారు—మ్లేచ్ఛులని పిలవబడ్డట్లు కనబడుతుంది. ఒక్కొక్కప్పుడు వీరు జంతువులతో పోల్చదగిన వారని కూడా చెప్పబడింది. అదేవిధంగా అత్యతట్వారకుడి వంటి

భారతీయ ఖగోళ శాస్త్రజ్ఞులు భూభ్రమణాన్ని, గ్రహణాల వాస్తవకారణాన్ని కనుగొన్నప్పటికీ, వైద్యశాస్త్ర గ్రంథాలు శరీరనిర్మాణాన్ని ప్రక్రియలను సరిగానే వివరించినప్పటికీ వారు భారతీయ దర్శనశాస్త్రంపై ఎటువంటి ప్రభావాన్ని నెరపలేదు. బ్రూనో, గెలిలియోలవలె వారు భారతదేశంలో ఎలాంటి సంచలనాన్నీ తేలేకపోయారు. దీనికి కారణం భారతీయ దర్శన శాస్త్రమూ, మతమూ, ఎన్నడూ భూమిని కేంద్రంగా చేసుకొని ఉండక పోవడమూ, విశ్వంలో మానవుడే ప్రధానమైన విషయంగా భావించక పోవడమూ కావచ్చు. కాబట్టి ఖగోళ శాస్త్రజ్ఞులు భూమి సూర్యుని చుట్టూ తిరుగుతున్నదని చెప్పినప్పుడు ఎవరూ నిర్ఘాంత పోలేదు. బహుశ బహుకొద్దిమంది విశ్వసించి ఉంటారు. తత్ఫలితంగా, ఉన్న కొద్ది విజ్ఞాన శాస్త్రాన్ని లెక్క చేసినవారు లేకపోయారు. అది ఉపేక్షవల్ల నశించింది. ఈవిధంగా పురోభివృద్ధి చెందే విజ్ఞానశాస్త్రంతో సంబంధం లేకపోవడంవల్ల మతం చెలిమితో భారతీయ దర్శన శాస్త్రం తృప్తిపడి పూరుకోవలసి వచ్చింది. కొన్ని దర్శనాలు నిస్పందేహంగా అన్ని విధాలైన ఆస్తికవాదాల్ని తీవ్రంగా విమర్శించినవి. కాని అవి కూడా మతసంబంధమైనవిగానే ఉండిపోయినవి. భారతదేశంలో మానవుల జీవనానికి ఆధారభూతమైన విశ్వాసంగానే దర్శనశాస్త్రం ఎల్లప్పుడూ ఉంది. విశ్వాసాన్ని అది ఎన్నడూ విమర్శించలేదు. పురాతనమైన విశ్వాసాన్ని విమర్శించిన కొద్ది సందర్భాల్లోనూ అది ఒక నూతన విశ్వాసాన్ని సృజించి పురాతనవిశ్వాసం స్థానంలో ఉంచింది. ఈ విధమైన పోకడకు బౌద్ధ దర్శనం ఒక నిదర్శనం.

## దర్శనశాస్త్రం వ్యాఖ్యానం

ఇతరత్రా దర్శనశాస్త్రం నిర్మాణాత్మకంగా ఉండగా, ఈ విధమైన లక్షణాలన్నింటి కారణంగా భారతదేశంలోని దర్శనశాస్త్రం వ్యాఖ్యాన ప్రధానం ఉంది. అరిస్టాటిలు, 'కాంట్' వంటి దార్శనికులు వారి పూర్వీకులకు చాలా ఋణపడి ఉన్నారని మనకు తెలుసు. అయితే, అదే చేతితో వారికి పూర్వం ప్రతిపాదింపబడిన దాని నెంతటినో వారు నాశనం చేశారు. ఆ శిథిలాలపైన, కొంతవరకూ పాతఇటుకలతోనే, ఒక నూతన భవంతిని నిర్మించడానికి వారు ప్రయత్నించారు. అయితే, అలాంటి అన్ని ప్రయత్నాలలోనూ వాస్తవు వ్యక్తికల్పితమే. ఒక దార్శనికుని చేతిపనిలో అతని ప్రజ్ఞ యొక్క స్పష్టమైన ముద్ర స్పష్టంగా కనబడుతుంది. పాశ్చాత్య దేశాలలో ఉన్నంత గొప్ప మేధావులు భారతదేశంలో కూడా అవతరించారు కాని, అంతకు పూర్వం చెప్పబడిన దానిలోని సారాంశాన్ని బయటికి తేవడానికే వారు ప్రయత్నించారు. అయితే ఒక మేలేమంటే ప్రమాణంగా గ్రహించబడ్డ గ్రంథాలు విషయ వైచిత్రిని, చింతనా పటిమను కలిగిఉన్నవి. ఇవి ప్లేటో సంవాదాలకు (Dialogues) కు తీసిపోవు. ఒక్కొక్కప్పుడు వాటిని మించి పోతవి కూడా. దర్శన శాస్త్రాన్ని వ్యాఖ్యానంగా గ్రహిస్తే ఒక లాభం ఉంది. పురాతనాచార్యుల నుండి సంక్రమించిన చింతనను ఎర్ర మాత్రవలె మింగనవసరం లేకుండానూ, చెత్త కుప్పవలె పారవేయ నవసరం లేకుండానూ అది గ్రహిస్తుంది. భారతదేశంలోని దార్శనికుడు మధ్యవర్తిగా ఆచరించి, పురాతన గ్రంథాల అంతర్యంలోకి చొరబడి తిరిగి స్వంత విధంగా వాటిని వ్యక్తం చేయాలి. ఉపనిషత్తులు, గీత వంటి గ్రంథాల్లోని అనేక విధాలుగా వ్యాఖ్యానించ వీలయే అనుభవమూ, భావుక సౌందర్యమూ, అన్నీ, ఆ గ్రంథాలపై ఆధారపడ్డవే నని చెప్పబడే అనేక విధాలైన ప్రస్థానాలను సమర్థులైన వ్యక్తులు నిర్మించడానికి వీలు కలుగజేసినవి.

## దర్శనశాస్త్రం మోక్ష విద్య

భారతీయ దర్శనశాస్త్రంలోని మరొక ముఖ్య లక్షణం అది ప్రయోజనాత్మకం (Practical) కావడం. భారతదేశంలోని ఏ దర్శనమూ బౌద్ధిక పరిశ్రమ ఫలంగా ఆవిర్భవించలేదు. ఏ భారతీయ దర్శనమూ సౌందర్య వాంఛను తృప్తిపరచుకొనుటకొరకై వృతింపబడలేదు. భారతీయ దర్శన శాస్త్రం ఆత్మ సంక్షోభము నుంచి, శారీరక బాధల నుంచి జన్మించింది. భారతీయ దర్శనాలన్నీ తమ అనుయాయులకు సంపూర్ణ సత్యాన్ని వాగ్దానం చేస్తవి. ఈ సత్యాన్ని గ్రహించిన ఎడల వారు అమృతత్వానికి పొందగలరని అవి చెబుతవి. ప్రాచీన భారతీయ లోకోక్తి ఒకటి విముక్తి దోహదం చేసేదే జ్ఞానమని చెబుతుంది కూడాను. ("సవిద్యాయ విముక్తయే.) ఈ సందర్భంలో ముక్తి అంటే తిరిగి జన్మ లేకుండా ఐహిక జీవితం నుంచి విముక్తి. భారతీయ దర్శనశాస్త్రంలో ఈ ప్రాయోజనికత (Practical Character) అన్ని దర్శనాలపైనా తన ముద్రను వేసింది. భారతీయ దర్శనాలన్నీ మోక్ష విద్యలే. దీని అవశ్య పర్యవసానం ఏమంటే భారతీయ దర్శనాలు తమ అనుయాయులలో ఒక పరిణామాన్ని తేవడానికి ప్రయత్నిస్తవి. పునర్జన్మించిన మానవుడే నిజమైన ద్రష్ట. అట్టి వానిలో ఐహికాసక్తులూ స్వార్థాన్వేషణా గల "పూర్వ" మానవుని ఛాయ లుండవు. కాబట్టి భారతదేశంలో దర్శనశాస్త్రం సన్యాసంతోనూ, ఆత్మనిరాకరణంతోనూ, ప్రపంచంలో ఎట్టి విధమైన పురోభివృద్ధినైనా నిరసించడంతోనూ చెలిమి చేసింది. అయితే దీనికి వ్యతిరేకంగా చాలా ముఖ్యమైన, ప్రబలమైన పోకడలు కూడా ఉన్నవి. వేదాలలోనూ కొన్ని ఉపనిషత్తులలోనూ కనబడే దర్శనాలు ఉత్సాహ భరితంగానూ, క్రియాత్మకంగానూ ప్రపంచం ఉండాల్సిందేనని చెప్పేవిగానూ ఉన్నవి. అయితే, అన్ని దర్శనాలూ, అవి హిందూ దర్శనాలు గానీ, హైందవేతర దర్శనాలు గానీ, వాటి ప్రధాన చర్చనీయ విషయం మోక్షం అనే అర్థంలో అవి ప్రయోజనాత్మకమైనవనీ, మోక్ష విద్యను గరుపుచున్నామని చెప్పుకుంటున్నవి గనక అవి శాస్త్రీయమైనవని మనం నిర్భయంగా చెప్పవచ్చు. అవన్నీ మోక్ష శాస్త్రాలే.

## దర్శనశాస్త్రం-సమీక్షాశాస్త్రం-లేదా అన్వీక్షికీ!

ఆంగ్లంలో 'Philosophy' అనే పదానికి సరిగా సమానమైన పదం సంస్కృత భాషలో లేకపోవడం విచిత్రమే. అరబ్బీ భాషలో కూడా ఇంతే. అయితే గ్రీకు సభ్యతా ప్రభావం వల్ల గ్రీకు పదాన్నే అరబ్బులు గ్రహించారు. 'ఫిలాసఫియా' అనేది యిప్పుడు అరబ్బీ పదం. ఈ పదానికి కొంత వరకైనా సమానంగా ఉండే రెండు సంస్కృత పదాలు అన్వీక్షికీ, దర్శనం అనేవి. అన్వీక్షికీ అంటే అసలు అర్థం 'సమీక్ష చేసేది' అని. మొదట ఈ పదాన్ని తర్కశాస్త్రం ఉపయోగించుకుంది. ఎందుకంటే తర్కశాస్త్రంలో యుక్తులను పరీక్షించడం, అవి ప్రామాణికమైనవో అప్రామాణికమైనవో నిర్ణయించడం జరిగేది. తర్కశాస్త్ర సహాయంతో మనం వివిధ దర్శనాలూ, దార్శనికులూ ప్రతిపాదించిన వాక్యాల్ని విశ్లేషించి, పరీక్షించవచ్చు. వీటిని సమీక్షించి వాటిలో ఉత్తమోత్తమైన దానిని స్వీకరించవచ్చు. ఈ అర్థంలోనే ప్రాచీన కాలంలో అన్వీక్షికీ సర్వ జ్ఞానానికీ మకుటంగానూ, అన్ని ఫలితాల్ని సాధించటానికి సాధనంగానూ, అర్థశాస్త్రానికీ ఆధారంగానూ పరిగణించబడ్డది. అయితే అన్వీక్షికీని విమర్శించినవారు లేకపోలేదు. ఏలనంటే ఈ విద్యలో శిక్షితులైన వ్యక్తులు అంతులేని వివాదాల్లో చిక్కుకొని ప్రతి దానినీ విమర్శించి, సంశయాన్ని అధికం చేసేవారు. ఈ కారణాలవల్ల కొన్ని హైందవ పురాణాల్లో అన్వీక్షికీని నిరసించడం మనకు కనబడుతుంది. అందువల్లనే కౌటిల్యుని కాలంలోని రాకుమారులకు కూడా తప్పనిసరి అయిన విద్య అయినప్పటికీ రానురాను ఇది ఆదర్శాన్ని కోల్పోయింది.

## దర్శనశాస్త్రం ఒక దృక్పథం?

అన్వీక్షికీకి ప్రత్యామ్నాయంగా ఉపయోగింపబడి, బహుళ ప్రచారాన్ని పొందిన పదం "దర్శనం". దీనికి సాధ్యమైనంత సమీపంగా ఉన్న ఐరోపీయపదం "వెల్టాన్‌షాంగ్". ( Weltanchanung ) "ప్రపంచ దృక్పథం" అని దీని అర్థం. దర్శనం అంటే మానవుడు, ప్రకృతి, దైవము— వీటిని గురించిన అవలోకజ్ఞానం. మరింత సహనంగల జయంతుడు (న్యాయ దర్శనం) సిద్ధసేనుడు (జైన దర్శనం) అభినవ గుప్తుడు (కాశ్మీర

శైవం) వంటి అనేక దార్శనికులకు ఇతర సిద్ధాంతాలయెడల ఆశ్చర్యకరమైన ఉదారదృష్టి ఉండేది. అభినవగుప్తుని ఒక శ్లోకానికి ఈ క్రింది అనువాదం దీనికి ఒక ఉదాహరణగా ఉపయోగ పడుతుంది. "వారి బుద్ధితో వారు వూహించినపుడు వారు "ఇది సత్యం, ఇది సత్యం" అంటారు. వాస్తవంలో అది అంతా సత్యమే. నీ (ఈశ్వరుడు) కు భిన్నంగా ఏదీ లేదు. పండితుల ఈ వివాదం పేర్లనుగురించి మాత్రమే." ఒకే సత్యాను వర్ణిస్తూ పరస్పరం ఖండించుకొని సమానమైన అనేక దృక్పథాలను అర్థం చేసుకొనే ప్రయత్నం మనకు ఈ ప్రార్థనలో కనబడుతుంది. రచయిత అద్వైతి. అయితే యీ దృష్టి అతనికి మాత్రమే ప్రత్యేకం కాదు. ఈ క్రింది శ్లోకం గుణరత్న డనే జైనుడు సమ్మతితో పేర్కొన్నది. "బుద్ధుని విశ్వాసాన్ని వినాలి; జినుడి విశ్వాసాన్ని ఆచరించాలి; వేదంలోని విశ్వాసాన్ని అనుసరించాలి." సత్య అజ్ఞేయమైనదనే భావంపైనా: దాని రహస్యాన్ని మానవుని బుద్ధి ఛేదించలేదనే భావంపైనా, ఏ దర్శనమూ సర్వ సమర్థంగానీ, సర్వ ప్రామాణికంగానీ కాదనే భావంపైనా ఈ దృష్టి ఆధారపడి ఉంది.

## దర్శనశాస్త్రం సత్యాన్వేషణ

భారతీయ దర్శనాలన్నీ సత్యాన్ని అన్వేషించి వివరిస్తున్నామని చెప్పుకుంటవని ఇదివరకే చెప్పాను. అయితే భారతీయ దర్శనశాస్త్రం అన్వేషించే సత్యం విజ్ఞానశాస్త్ర సంబంధమైన యదార్థసత్యం కాదు. 'సత్యం నీకు విమోచనం కలిగిస్తుంది' అని బైబిలు చెప్పే సజీవ సత్యం ఇది. విజ్ఞాన శాస్త్రజ్ఞుల్ని సత్యాన్వేషకులని మనము తరచూ అంటుంటాం; ఇది అనేకమైన శాస్త్రజ్ఞుల విషయంలో నిజమైనట్లు. జ్ఞానానికీ, సత్యానికీ గల భేదాన్ని మనం గమనించాలి. భూతార్థాల్ని (Facts) కూడబెట్టడం జ్ఞానం. కాని సత్యం దేనినో కూడపెట్టగా వచ్చింది కాదు. సత్తయొక్క ఒక అంశంతో సంబంధం ఏర్పరచుకోవడమే సత్యం. సత్యగ్రహణము మానవుని మొత్తం జీవితాన్ని, మనోదృష్టిని మార్చాలి. సత్యం మానవుని తలక్రిందులుగా చేస్తుందని మనం చెప్పవచ్చు. ఉదాహరణకు భూగోళాన్ని నేర్చుకొనే ఒక పిల్లవాడు భూతార్థాలను తన బుర్రలోకి ఎక్కించడంతో తన విద్యను ప్రారంభిస్తాడు. దేశాల, పట్టణాల, నదుల పేర్లను గ్రహిస్తాడు. వానిని ఉపయోగించగలడు. దేశ పటంపై వాటిని గుర్తించగలడు. వాటిని గురించి మాట్లాడటం లాంటి పనులు చేయగలడు. అయితే ఈవిధంగా అతని భూగోళజ్ఞానం అధిక మవడం అతనిలో ఏ మార్పును తీసుకొని రాదు. అతని స్వరూపంలో ఏ సంచలనాన్ని తీసుకొనిరాదు. కాని ఒకడు దీర్ఘమైన ప్రయాణం చేసి వచ్చి, తన భార్య వ్యభిచారం చేస్తుండగా ఆమెను పట్టుకుంటే, ఆమె యెడల అతనికి గల దృష్టిని అది మార్చివేస్తుంది. అది అతని జీవితంలో ఒక తుఫానును తెస్తుంది. అతని పూర్వజీవనవిధానాన్ని సంపూర్ణంగా మార్చివేస్తుంది. సత్తయొక్క ఒక అంశంతో అతనికి ఇప్పుడొక కొత్త విధమైన సంబంధం ఏర్పడింది. సరిగా చెబితే ఈవిధమైన సంక్షోభకారకమైన శక్తినే మనం 'సత్యం' అనాలి. "ఆధో మానవ వానరాల్నించి మానవుడు పరిణమించాడు." "భూమి తన చుట్టూతా తిరుగుతూ సూర్యుడి చుట్టూ తిరుగుతోంది" వంటి శుష్క విజ్ఞాన శాస్త్రీయ భూతార్థాలకు మానవుడి జీవన విధానాన్ని మార్చేంత శక్తి లేదు. కాని, మనము పైన పేర్కొన్నటువంటి వైయక్తికానుభవానికి (Subjective experience) మానవుడి అంతరాంతరాళాల్లోనించి సమాధానం వస్తుంది. భారతదేశంలోని దర్శనశాస్త్రం ఉద్దేశించిన సత్యం ఇటువంటిదే. ధ్యానం చేయమనీ, ఆత్మసాక్షాత్కారాన్ని సాధించమనీ, వేదాంతం మనకు ఉపదేశించడంలోనూ, ప్రపంచం గురించి గాఢంగా ఆలోచించి అది క్షణికమైనదనీ, దుఃఖమయమైనదనీ గ్రహించమని బౌద్ధమతం మనకు ఉద్బోధం చేయడంలోనూ, మనం ప్రపంచాన్ని పూర్తిగా నూతనమైన విధంలో

చూడాలనీ, ఒక వినూత్న జీవితంలోకి మనం ప్రవేశించాలనీ అవి ఆకాంక్షిస్తున్నవి.

## సృష్టిసంస్థితమైనదనేభావం (Organicism)

ఇతర దేశాల్లోని అనేకదర్శనాల్లో మానవుడికీ ప్రకృతికీ మధ్య విభజన కనబడుతుంది. భారతీయ దర్శనాల్లో అలాంటి విభాగం ఏమీలేదు. భారతీయ దర్శనశాస్త్రం దృష్టిలో సృష్టి సంస్థితమైనది. కర్మ, ఋతం అనే నియమాలవల్ల సర్వవిశ్వంలోనూ సుందరమైన ఒక సంగతి (Harmony) దానికి కనబడుతుంది. మనం ఇదివరకే చెప్పినట్లు మానవునికి పూర్తి స్వేచ్ఛ ఉంది. అతని అదృష్టానికి అతనే కర్త. అతని ప్రవృత్తికి (Activity) ప్రకృతి ఒక క్షేత్రంగా మాత్రమే ఆచరిస్తుంది. కొందరు మానవులు తెలివి తక్కువవారై ఈ బ్రహ్మాండమైన యంత్రానికి బానిసలైనప్పటికీ ఇది మానవునికి ఉపకరణమైన ఒక యంత్రం మాత్రమే. తెలిసినవారు దాని నధిగమించగలిగి, సర్వకాలాలకూ, సర్వసత్తకూ సాక్షీభూతులుగా ఉండగలుగుతారు. ఈ కైవల్యాన్ని (Aloofness) అలవర్చుకొని అస్తిత్వం అనే ఈ విషచక్రాన్నుంచి తప్పించుకోలేనివారు నిస్సహాయు లవుతారు. ఇదే ప్రకృతి సంస్థితమైనదనే భావం. ఈ దృష్టి సర్వ సృష్టి వాటకాన్ని పరస్పర వ్యతిరేకమైన శక్తుల అర్థరహితమైన విలయతాండవంగా గాక ఏకైక క్రమము, సుందరమైన సంగతి (Coherence) గలదానివిగా పరిగణిస్తుంది. ఈ దృష్టి మానవుణ్ణి ప్రకృతి కనుగుణంగా తనను తాను మలచుకొనేట్లుగానూ, దాని యెడల సమరసభావంతో మెలిగేట్లుగానూ చేస్తుంది. హైందవుడు సృష్టిలో భయంకరమైన సంక్షోభం, దుఃఖం, బాధా చూస్తాడు. కానీ దానివల్ల అతను భయపడిపోడు, విశ్వేష్టుడూ కాడు. దానివల్ల అతడు విభ్రాంతుడై విశ్వము అర్థహీనమైనదని, హాస్యాస్పదమైనదని ప్రకటించలేదు. విశ్వంలోని ప్రయోజనాన్ని హైందవుడు స్పష్టంగా చూడలేక పోవచ్చు. కాని, తరతరాలుగా పాతుకొని పోయిన ఆలోచనాచరణ రీతులు అతని అవ్యక్త చైతన్యంలో ప్రవేశపెట్టిన అచంచలమైన విశ్వాసం అతని జీవితానికి పూతగా ఆచరిస్తుంది. పాశ్చాత్య దేశాల్లోని కొందరు హైందవుని నమ్రతా స్వభావాన్ని హేళన చేశారు. కాని అతని నమ్రతే దుఃఖంలో జీవితాన్ని గడపటానికి అతనికి సహాయ పడుతుంది. అయితే దీనికి మూలం నిస్పృహ కాదు. చివరికి అన్ని విషయాలూ సక్రమంగానే జరుగుతాయనీ, సృష్టి అర్థరహితమూ, హాస్యాస్పదమూ కాదనీ అనే నిరంతరమైన విశ్వాసమే దీనికి ఆధారం. సృష్టి సంస్థితమైనదనే ఈ దృష్టి ఏక సమాజ భావానికీ, సాంప్రదాయిక ఆచరణ ప్రమాణాల పరిరక్షణకూ, చైనా గోడ కట్టుకోవడం ద్వారా కాకుండా, ఆత్మీకరణ ద్వారా పరాయి సంస్కృతుల అఘాతానికి తట్టుకోవడానికీ దోహదం చేసింది. అన్ని రకాల విషయాలనూ గ్రహించి జీర్ణం చేసుకొన్న హైందవ మతం యొక్క ఈ చంపినా చావని లక్షణాన్ని, ఈ దృష్టి ద్వారా మనం అర్థం చేసుకోవచ్చు. సృష్టి సంస్థితమనే ఈ దృష్టిని ఆచరణరీతులు కూడా కదలించలేక పోయినవి. ఐరోపీయ సంపర్కం కూడా భారతదేశ స్వరూపాన్ని మార్చలేకపోయింది. పాశ్చాత్య సభ్యత, విజ్ఞాన శాస్త్రీయరీతులు భారతదేశంయొక్క ఉపరితలాన్ని మాత్రమే స్పృశింప గలిగినవి. పాశ్చాత్య దేశాలనుంచి భారతదేశం ఎన్నో విషయాలను గ్రహించినప్పటికీ ఆనందమయ జీవన రహస్యంకొరకు మాత్రం అది తన సాంప్రదాయిక దర్శన శాస్త్రాన్నే అర్థిస్తుంది. ఉదాహరణకు, లక్ష్యాలకూ, ఆదర్శాలకూ, శక్తికీ, వైచిత్రికీ భారతదేశం తన వేదాంతాన్నో, జైనమతాన్నో, మరొక మతాన్నో అర్థిస్తుంది. అయితే బాహ్య జీవనం విషయంలో మాత్రం అది పాశ్చాత్య దేశాల్ని అనుకరిస్తుంది. సృష్టి సంస్థితమైనదనే దాని దృష్టి వల్లనే, ఆధునిక కాలంలో విజ్ఞానశాస్త్రం వల్లనూ, పారిశ్రామిక సభ్యత వల్లనూ, పాశ్చాత్య చింతనలోనూ, జీవనంలోనూ జనించిన సంక్షోభం భారతదేశానికి తెలియను కూడా తెలియదు.

## భారతీయ దర్శనశాస్త్రానికి స్వంతప్రజ్ఞ ఒకటివున్నది

ప్రతి సంస్కృతిలోని దర్శనాలకూ, తక్కిన సంస్కృతులలోని దర్శనాలకు భిన్నంగా, విశిష్టమైన కొన్ని ముఖ్య లక్షణాలు ఎల్లప్పుడూ ఉంటవి. అయితే ఒకే సాంస్కృతిక సాంప్రదాయంలో పరస్పరం కలహించుకొనే చాలా దర్శనాలూ, తక్కిన వాటితో సంవదించడానికైనా ఆస్కారంలేని కొన్ని దర్శనాలు కూడా ఉండొచ్చు. అయినా, వా టన్నింటికీ సామాన్యంగా చాలా మూలభావాలు ఉంటవి. దీనిని మనం సాధారణ రచన (General frame-work) అనవచ్చు. దీనిలోనే అనేకదర్శనాలు పనిచేస్తవి. అయితే వాటిలో ఏదీ కూడా ఈ రచన యొక్క ప్రామాణికతను ప్రశ్నించదు. ఉదాహరణకు, వ్యక్తి స్వేచ్ఛాభావము, సోదర మానవుల యెడల మానవునికి ఒక విధి ఉన్నదనే గుర్తింపూ—ఈ రెండు భావాలూ అన్ని దర్శనాలకు సామాన్యమైనవి. ఇవి గ్రీకు, హిబ్రూ చింతనా ధోరణిపై ప్రభావాన్ని నెరపినవి. అదే విధంగా దాదాపు అన్ని ఆధునిక పాశ్చాత్య దర్శనాలకు క్రమమూ, పురోభివృద్ధీ అనే భావాలు అనివారిత పూర్వగ్రహిత విషయాలు. మనం భారతదేశంలోని కొన్ని ప్రబలమైన లక్షణాల్ని విడదీసి వివరించవచ్చునని నా వాదం. అన్ని దర్శనాల్లోనూ అన్ని క్షణాలూ ఒకే మేరకు సామాన్యంగా ఉండవు. కొన్ని దర్శనాల్లో కొన్ని లక్షణాలు అసలే లేకపోవడం కూడా సాధ్యమే. అలాగే నేను పేర్కొనని కొన్ని లక్షణాలు వాటికి ఉండవచ్చు కూడాను. ఈ పరిమితుల్ని గుర్తులో ఉంచుకొని, భారతదేశంలో దర్శన శాస్త్రం ఒక ప్రత్యేక ప్రజ్ఞ యొక్క ఫలం అనీ, కొన్ని విశిష్ట లక్షణాలు గల ఒక ప్రజ్ఞ యొక్క ప్రేరణల ఆధ్యాత్మికాభివ్యక్తి (Expression) ఈ దర్శన శాస్త్రం అనీ మనం చెప్పవచ్చు.

# భారతదేశ విదేశాంగవిధానం: ఒక పరామర్శ

శ్రీ ఆంగిరస్

భారత ప్రధాని శ్రీ నెహ్రూ మేల్కొనివుండే కలలుకంటూవుంటారు. 1954లో అటువంటి కలఒకటి కన్నారు. టిబెట్టు విషయంలో చైనాతో ఒప్పందం చేసుకోవడమే ఆకల. అది కలగాబట్టే, అందులో కలలోకల్గే సుఖానుభవం లాంటి సిద్ధాంతాలు కొన్ని గుది గూర్చబడినాయి. శ్రీ నెహ్రూ ఆ సిద్ధాంతాలకు, అతి ప్రేమతో,—"భారతదేశం పుట్టిన వాళ్లందరిలోకీ గొప్ప వాడైన" (ఆయన గూడా ఈయనకు మల్లేనే చాలా కలలు కన్నాడు.) బుద్ధుని పరిభాషను స్వీకరించి, "శీల" నామధేయం వుంచారు. అవి అయిదు సూత్రాలు కాబట్టి, వాటికి "ముత్తంమీద" పంచశీల అని బారసాల చేయించారు. వచ్చిన తిప్పలేమిటంటే, ఈ వ్యవహారంఅంతా, ఇటువంటి సూత్రాలలోను, సిద్ధాంతాలలోను నమ్మకంలేని దేశంతో జరిగిన ఒప్పందంలో ఇది చేర్చ బడింది. తాను ఈ ఒప్పందం దగ్గర నిష్కామకర్మచేస్తే, తాను అనుకున్న ఫలితం కల్గుతుందని శ్రీ నెహ్రూ అనుకున్నారు. కాని నిష్కామకర్మలో కర్మ ఫలాపేక్ష లేకుండా చేయవలసింది. ఇక్కడ ఫలాపేక్ష వుంది. మనం టిబెట్టుమీద సర్వాధికారాలను చైనాకు అప్పగించివేస్తే, చైనాతో ఏవిధమైన తగాదా అంటూ రాకుండా వుండటమేగాక, భారతదేశం—చైనా సరిహద్దులను, వున్నవాటిని వున్నట్లు చైనా అంగీకరించి వేస్తుందని శ్రీ నెహ్రూ అనుకున్నారు.

ఇట్లా అనుకోవడం శ్రీ నెహ్రూ పోషిస్తున్న సిద్ధాంతాలకు సరిపోవచ్చు. కాని, కమ్యూనిస్టు చైనా వున్నదంటే, దానితో వ్యవహారంఅంతా "డైలెక్టిక్సుతో" కూడి వుంటుంది. "బిగ్‌లీప్"లతో పెనవడి వుంటుంది. కాబట్టే, చైనా, ఆ "డైలెక్టిక్సు"ను, ఆ "బిగ్‌లీప్"ను ఉపయోగించి, టిబెట్టును గూర్చిన ఒప్పందం కుదిరిన మొన్నాటినుంచి, దురాక్రమణ ప్రారంభం చేసింది. అంటే, శ్రీనెహ్రూగారి "పంచశీల"ను హిమాలయశిఖరాగ్రంలో పాతివేసింది. అప్పుడు శ్రీ నెహ్రూకు "పంచశీల" పోయి, "పంచశీల" భ్రాంతి మాత్రం మిగిలింది.

శ్రీ నెహ్రూగారికి గురుస్థానీయుడైన సౌగత మేధావి గూడా శీలాలను, వ్యక్తి జీవితానికేగాని, రాజ్యాల మధ్య సంబంధాలకు అనుశాసించలేదు. నిజానికి అట్టి సూత్రాలను ఒక్క బుద్ధుడేగాక, బుద్ధుడికి పరంలో, అపరంలోనువున్న తాత్వికులు, దార్శనికులు, మేధావులు అంతా చెబుతూనే వచ్చారు. వైయక్తిక జీవిత విషయంలో అవి ఇప్పుడు గూడా చెల్లవచ్చు. మహాత్మాగాంధి తన వైయక్తిక, సాంఘిక జీవనానికి, పతంజలి చెప్పిన "అస్తేయా"ది అష్ట సూత్రాలను ప్రాతిపదికలు చేసుకున్నారుకాని, రాజకీయాలకు వాటిని పట్టించబోతే అవి విఫలం అయినాయి. అవి పనిచెయ్యలేదు. అట్లాగే ఇప్పుడు "పంచశీల" గూడా వైయక్తిక జీవితస్థాయిని విడిచి అంతర్జాతీయ రాజకీయ సూత్రాలక్రింద, సిద్ధాంతంక్రింద, రూపాంతరం ధరించవలసిన అవసరం వచ్చేప్పటికి, అస్థానపతితమైన ధర్మంలాగా వృథా అయిపోవడమేగాక, అనవసరమైన చిక్కులను, ప్రతిబంధకాలను తెచ్చిపెట్టింది. కాని, పంచశీల భ్రాంతిలోపడిపోయివున్న, ప్రధాన మంత్రికి, ఇది ఇట్లా అయినట్లు తెలిసిందో, లేదో తెలియదు కాని, ఆ భ్రాంతిమాత్రం వదిలినట్లు లేదు.

శ్రీ ఎస్. నటరాజన్ భారత విదేశాంగ విధానాన్ని పరామర్శిస్తూ, ఈ మధ్య, ఇదే అర్థాన్ని అభివ్యక్తం చేస్తూ, ఇట్లా వ్రాశారు. "1961 సంవత్సరం ప్రధానమంత్రి శ్రీ నెహ్రూకువున్న అన్ని భ్రాంతులను చాలావరకు వదిలించివేసింది. ముఖ్యంగా పంచశీల విషయంలో చైనావారు తమ ప్రవర్తనవల్ల-ప్రపంచంలో ఏ దేశంగాని, తాను, ఈ పంచశీలను ఆచరించటం అసాధ్యం—అని తేలివేశారు. అది ఆచరణ సాధ్యమేనన్న అభిప్రాయానికి నిరివల్లతీరని ఆఘాతం కల్గింది. దురాక్రమణకు దిగకుండా వుండడం, ఇతరుల భూభాగాలను ఆక్రమించుకోకుండా వుండటం, ఒకరి అంతరంగిక వ్యవహారాలలో మరిఒకరు ప్రమేయం పెట్టుకోకుండా వుండటం, పరస్పర సమానత్వాన్ని, మర్యాదను గౌరవించడం, సహజీవన సూత్రాన్ని అనుసరించడం—ఈ మొదలుగాగల సూత్రాలు నిజానికి నడవడికకు సంబంధించిన సూత్రాలుగాని, రాజ్య విధానాలకు సంబంధించిన సూత్రాలుకావు. ఇది ఇట్లా అని గ్రహించకపోవడంవల్ల మన ఆలోచనలన్నీ అల్లకల్లోలం అయిపోతున్నాయి. నడవడికకు సంబంధించినంతవరకు అతి ఎంతో మంచి నిబంధనలు అయినంతమాత్రంచేత, వాటికి సిద్ధాంతస్థాయి, సూత్రస్థాయి లభిస్తున్నట్లు అనుకోరాదు. ఈ విషయంలో ఒక్క చైనాయేగాక, పాకిస్తాన్ గూడా, ఈ రకమైన ధర్మసూత్రాలు, అంతర్జాతీయ రంగంలోనేగాక, వైయక్తికమైన సంబంధాలలో గూడా తిరుగులేనివి కావని శ్రీ నెహ్రూకు రుజూచేసిపెట్టింది. అయినా ప్రధానమంత్రి శ్రీనెహ్రూమాత్రం ఈ పంచశీలను పట్టుకొని వదిలిపెట్టడంలేదు. అది వృథాఅయిపోయినా, వృథాకాలేదన్న వాదాన్ని లేవదీస్తున్నారు. ఏదో ఒక దేశం ఆ సూత్రాలను అనుసరించనంతమాత్రంచేత, ఆ సూత్రాలు దెబ్బతినిపోయినట్లుగాని, ఆ సూత్రాలు సరియైనవి కావని రుజూ అయినట్లుకాని చెప్పడానికి వీలులేదు అంటున్నారు."

ఇది యేమిటంటే, మనం నమ్ముకున్న ఒక ధర్మం కళ్లముందే తల్లక్రిందులయిపోతూ, అట్లు అయిపోతున్నట్లు స్పష్టంగా కన్పిస్తున్నా, అది తల్లక్రిందులు కావడం ఏమిటి? నీకేమన్నా అట్లా కన్పిస్తున్నదేమో, అది చెదరకుండా కుండానేవుంది అన్న ధోరణి వ్యక్తం అవుతున్నట్లువుంది. ఇప్పుడు చైనా, ఈ పంచశీలను పాతి పెట్టినందువల్ల, పరిస్థితిఅంతా పూర్తిగా తల్లక్రిందులైపోయినా, దానిని అట్లా గుర్తించకపోవడం కన్పిస్తున్నది. అసగా, అసలు మనిషిని వదిలిపెట్టి, నీడను పట్టుకుని ప్రేలాడుతున్నట్లువుంది. అయితే నిజంగా, ఈ పరిస్థితులలో వచ్చిన మార్పును శ్రీ నెహ్రూ గ్రహించలేదా అంటే, అట్లా అనడానికి గూడా వీలు కన్పించడంలేదు. నసుగుతూనో, సణుగుతూనో జరపవలసిన పనులు జరుపుతూనే వున్నారు. పరిస్థితి మారినందువల్ల, ఏ రకమైన సర్దుబాట్లు అవసరం అవుతున్నాయో, వాటిని, బహిరంగంగా కాకపోయినా, రహస్యంగానైనా, చేస్తున్నారు. కాని, పైకి మాత్రం పరిస్థితిలో వచ్చిన మార్పు ఏమీ లేదంటూ, తెచ్చి పెట్టుకున్న భ్రమలోంచి బయటికి రాలేకపోతున్నారు. ఇది ఇట్లా జరుగుతున్నందువల్ల, ఒక్క ప్రమాదం ఏర్పడుతున్నది. అది రెండు విధాలుగా సిద్ధం అవుతున్నది. (1) పాతపడిపోయిన పద్ధతులను, వదులుకోలేకపోవడంవల్ల ఆలోచనలకు ఒక ప్రతిబంధకం ఏర్పడుతున్నది. (2) మారిన పరిస్థితులకు అనుగుణంగా తగిన ధోరణిని, వైఖరిని, బహిరంగంగా వహించకపోవడంవల్ల అసలు పరిస్థితి ఒకటి, లోపలి పరిస్థితి ఒకటి అయి, ఇది అంతా కలిసి, భారత వైదేశిక నీతి అనే శరీరానికి పుట్టుకురుపువలెగా తయారవుతున్నది.

భారత విదేశాంగ నీతి—శ్రీ నెహ్రూ చెబుతున్నదానినిబట్టి—మూడు ముఖ్య ధర్మాలు ఆధారంగా నడుస్తున్నది (1) అన్ని సమస్యలను శాంతియుతంగా పరిష్కారం చేసుకోవలసి వుండటం, (2) ఏ సందర్భంలోనూ యుద్ధానికి దిగకపోవడం, (3) అంతర్జాతీయరంగంలో ఏర్పడివున్న ముఠాలతో ప్రమేయం పెట్టుకోక

## మానవుని బాధ...

# కుష్ఠరోగము

కుష్ఠము భయంకరమైన వ్యాధి యని చాలా కాలముగా ప్రపంచ మెరిగినది. విశేష సంబంధ అనుభవము వల్లనే అంటువ్యాధి అనవచ్చును. అది మెల్లిగా ప్రబలుచున్నది. మంచి యోచనతో చక్కని ఔషధముల వల్ల వాటిని ఖండించవచ్చును.

ఈ వ్యాధియొక్క మొదటి ఆనవాలు దేహమందు ముఖ్యముగా చెవులపై ఏర్పడును. చిన్న చిన్న కురుపులు లేక పొడలు, ఇవి ముక్కునందును, మోచేతియందును, తొడలలోను యేర్పడును. పిదప దేహమంతయు వల్లుకొనును. కురుపులు పెద్ద పుండుగా మారును. కుష్ఠము నరములను కూడా పీడించును. అందువల్ల నరములు ఆ వ్యాధికి లోనై తనశక్తిని పోగొట్టుకొనును. పొదుపు బాధ కూడ యేర్పడవచ్చును.

తటస్థంకాని తాటస్థ్యన్ని అవలంబించి, ప్రపంచ శాంతికి దోహదం ఏర్పడే విధంగా వ్యవహరించడం— ఈ మూడు సూత్రాలకు పైన పేర్కొన్న పంచశీల ప్రాణం వంటిది. అవడంచేత, అది అవుడోలుగా తేలిపోయిన వెంటనే, తక్కినవి గూడా నామమాత్రావశిష్టాలయి పోయినాయి. ఇవిఇట్లా అయిపోయినట్లు గోవా సమస్యను భారతదేశం పరిష్కరించిన పద్ధతి మూలంగా తేలిపోయింది. గోవా మొదలైన స్థావరాలు—నీవు అవునన్నా, కాదన్నా—మొన్నటివరకు పోర్చుగీసుల ఏలుబడిలో వున్నాయి. భారతదేశంలో వలసలువున్న ఇతర ఐరోపియ రాజ్యాల పద్ధతిని అనుసరించి, ఆ స్థావరాలను వదిలి పెట్టకపోగా, అవి పోర్చుగల్లులో రాష్ట్రాలు అని సాలజార్ ప్రభుత్వం ప్రకటించింది. ఇది ఇప్పుడు జరగలేదు. ఎప్పుడో జరిగింది. ఆ జరిగిన తర్వాత గూడా, శ్రీ నెహ్రూ ఈ సమస్యను శాంతియుతంగా పరిష్కరించగలమనే చెబుతూ వచ్చారు. ఇట్లా 14 సంవత్సరాలు నడిచింది. ఆ తర్వాత హఠాత్తుగా ఒక రోజున, భారత సైన్యాలు గోవాను, ఇతర పోర్చుగీసు స్థావరాలను ఆక్రమించుకున్నాయి. ఈపని చేయడం గోవాకు, ఇతర పోర్చుగీసు—స్థావరాలకు విముక్తిని సంపాదనచేసి పెట్టడము, భారతదేశంలో స్వతస్సిద్ధమైన భాగాలైన ప్రాంతాలను, తిరిగి భారతదేశంలో కలుపుకోవడము కావచ్చు. కాని ఈపని ఇట్లాచేయడం అంతర్జాతీయ ధర్మాలకు, భారత ప్రధాని ప్రకటించిన వైదేశిక నీతికి ఎంతవరకు అనుకూలమైన విషయము—అన్నదే ఇక్కడ ప్రశ్న. డా. సాలజార్ ఎంత కాలానికీ లొంగకపోవడం అన్నది, ఇక్కడ ఈపని చెయ్యడానికి కారణం అయ్యేందుకు వీలులేదు. ఆయన అట్లా లొంగేవాడు కాదని తెలిసే, భారత ప్రధాని విదేశాంగనీతి ఏర్పాటైంది. మరి మన నౌకలమీద, మన జనంమీద, మన ప్రాంతంమీద, అవమానాలు చేయడంవల్ల, పోర్చుగల్ చాలాకు

అప్పుడు శ్రీ నెహ్రూ మనస్సులో పెట్టుకున్న రకం పరిణామాలు వుండకపోవచ్చు కాని, వేరే రకమైన పరిణామాలు సంభవించడానికి ఎక్కడా ఆస్కారం కల్పించడం లేదా! ఉదాహరణకు—ఇప్పుడు చైనా—హిమాలయ ప్రాంతాలలోని కొన్ని ప్రదేశాలపై మన హక్కును కాదంటున్నది. చైనా దృష్టిలో, ఆ ప్రాంతాలను, భారతదేశం, బ్రిటన్ ఏలుబడిలో వుండగా, అప్పటి పాలకులు ఆక్రమించుకున్నారు. అవి నిజానికి తనకు చెందినవి. ఇప్పుడు భారతదేశం ఆ ప్రాంతాలపై అధికారం చలాయిస్తున్నా, వాటిపై తనకు హక్కు వున్నదన్నా—శ్రీ కృష్ణ మీనన్ దురాక్రమణకు ఇచ్చిన నిర్వచనం ప్రకారం—అది దురాక్రమణ అవుతుంది. అటువంటిదురాక్రమణను గోవాలో, బలప్రయోగంతో భారతదేశం తొలగ బెట్టుకున్నప్పుడు, తాను మాత్రం ఎందుకు, ఆ ప్రాంతాలలో, భారతదేశం' "దురాక్రమణను" అదేవిధంగా తొలగబెట్టుకో కూడదు అని చైనా వాదించి, మనం గోవాలో చేసిన పనినే, హిమాలయ ప్రాంతపు పరిహద్దులలో చేస్తే, మనం ఏమి చేస్తాము. ఈ పరిస్థితి ఇట్లా రూపుపొందడం గ్రహించే, పాకిస్తాన్ చైనాకు సన్నిహితం అవుతున్నది. ఈ రెండు రాజ్యాలు, భారతదేశంతో తమకు వున్న తగాదాలను, భారతదేశం పోర్చుగల్‌తోవున్న తగాదాను తీర్చుకున్నట్లే, తీర్చుకోదలిస్తే అప్పుడు పరిస్థితి ఏమిటి? గోవాపై భారతదేశం చర్యను చైనా అభినందించడంలోవున్న అర్థం ఏమిటి?

ఈ ప్రశ్నతో మనం, భారత విదేశాంగ విధానం తాలూకు రెండవ మాత్రపరామర్శలో ప్రవేశిస్తున్నాము. ఏ సందర్భంలోను యుద్ధం పనికిరాదని, యుద్ధంవల్ల ఏ సమస్యా పరిష్కారం కాదనీ—గదా— శ్రీ నెహ్రూ వాదము. ఇప్పుడు అన్ని ప్రయత్నాలు విఫలం అయిపోయిన తర్వాత—అది అణ్వస్త్ర యుద్ధానికి దారి తీయకుండావుంటే—ఒక సమస్యను పరిష్కరించుకోడానికి యుద్ధం సాధనం కావచ్చు అని శ్రీ నెహ్రూ క్రొత్త సిద్ధాంతాన్ని ప్రవచించారు. ఇది చైనావారి ఆలోచనా పద్ధతికి చాలా సన్నిహితమైంది. అయితే వారు ఈ విషయాన్ని ఇంకా గట్టిగా చెబుతున్నారు. కుండబద్దలుకొట్టి చెబుతున్నారు. వారి వాదం ఇది: యుద్ధాలు రెండు రకాలు; ఒకటి: ధర్మయుద్ధం. రెండు: అధర్మ యుద్ధం. ధర్మ యుద్ధాన్ని సహజీవన సిద్ధాంతం వెలివేయదు. అందువల్ల యుద్ధం అవశ్యం భావికాదన్న వాదం చెల్లదు. ధర్మ రక్షణంకోసం యుద్ధం తప్పకపోవచ్చు. ఈ వాదమే కొంచెం మృదువుగా, కొంచెం మారువేషంలో శ్రీ నెహ్రూ, గోవా పట్ల అనుసరించిన విధానంలో కన్పించే సరికి, చైనా శ్రీ నెహ్రూను, ఆయన చర్యను అభినందించింది. అంటే శ్రీ నెహ్రూ ధర్మ పన్నములలో వచ్చిన మార్పును గమనించి, ఆ మార్పు తాము అనుసరిస్తున్న విధానానికి సన్నిహితం అయినందువల్ల, "సెభాష్! నెహ్రూ!" అంది.

ఇది చాలా పెద్ద మార్పు. ఇంతవరకు అంతర్జాతీయమైన అన్ని తగాదాలను శాంతియుతంగానే పరిష్కరించుకోవాలంటూ వచ్చిన భారతదేశం, ఇప్పుడు కొన్ని కొన్ని సమస్యల పరిష్కారానికి యుద్ధం గూడా మార్గం కావచ్చునంటున్నది. అనగా పాశ్చాత్యులు చెబుతున్న "పరిమిత యుద్ధ" సిద్ధాంతానికి, కమ్యూనిస్టు రాజ్యాల "ధర్మ యుద్ధ సిద్ధాంతానికి"—దీటయిన ఇంకో రకపు యుద్ధ సిద్ధాంతాన్ని శ్రీ నెహ్రూ ఈ సందర్భం మూలంగా ప్రవచించవలసి వచ్చింది అనగా, లక్ష్యములు, ఆ లక్ష్యసాధన మార్గములు ఒకే విధంగా పవిత్రంగా వుండాలనే సిద్ధాంతంపోయి, కొన్ని కొన్ని సందర్భాలలో, లక్ష్యాన్ని సాధించడానికి, పవిత్రేతర మార్గాలను గూడా అనుసరించవచ్చు నన్న సిద్ధాంతం ఇక్కడ అంగీకర్యమై ఒప్పుతున్నది. ఇది శ్రీ నెహ్రూగారు ప్రవచిస్తున్న అసలు సూత్రాలకు పూర్తిగా విరుద్ధం.

శ్రీ నెహ్రూ విదేశాంగనీతిలో నేమి, రాజనీతిలోనేమి, ఇట్లా లక్ష్యలకు, లక్ష్యసాధన మార్గాలకు వివంవాదం ఏర్పడిన సందర్భాన్ని నిరూపించడానికి గోవా మొదలైన మాజీ పోర్చుగీసు స్థావరాలమీద భారత ప్రభుత్వం నడిపించిన సైనిక చర్యనే దృష్టాంతంగా గ్రహించవచ్చు. అంతేగాక, ఒక లక్ష్యాన్ని సాధించదలచుకున్నప్పుడు, ఆ లక్ష్య సాధనమునందుగల అభినివేశం, తాత్సాధన మార్గాలను ఏవిధంగా రూపు పొందిస్తున్నదీ, ఆ సాధన మార్గాలకు, చెప్పే సిద్ధాంతాలకు ఎట్లా సంబంధం లేకుండా పోతున్నదీ గూడా ప్రదర్శించవచ్చు. గోవాలోను, ఇంకా ఇతరత్రా భారతదేశంలో తనకు వుండివున్న వలసలలోను, పోర్చుగల్ సైనిక బలాన్ని పెంచడం, ఈ స్థావరాలపై అవలంబించిన చర్యలకు ఒక కారణంగా శ్రీ నెహ్రూ ప్రభృతులు పేర్కొంటున్నారు. కాని, గోవా మొదలైన ప్రాంతాలలో పోర్చుగల్ ఆబలాన్ని, అప్పుడు అట్లా పెంచడానికి, భారత ప్రధాని, ఈసమస్యా పరిష్కారం నిమిత్తం, అవసరమైతే సైనిక బలాన్ని ప్రయోగించగలమని స్పష్టంగా ప్రకటించిన తర్వాతనే జరిగిందని మనం గుర్తుపుంచుకోవాలి. ఈ విషయాన్ని శ్రీ నెహ్రూ గూడా పర్యంతరంగా ఒప్పుకున్నారు. గత అక్టోబరులో పోర్చుగీసు వలసలను గురించి జరిగిన చర్చా పరిషత్తులో తాను చేసిన ప్రకటనమే, పోర్చుగల్, గోవా మొదలైన స్థావరాలలో సైన్యాన్ని పెంచడానికి కారణం అయితే కావచ్చునని ఆయన ఒప్పుకున్నారు. అనగా గోవాలో, ఇంకా ఇతర స్థావరాలలో పోర్చుగల్ సైనిక బలాన్ని పెంచితే, అది ఆసరాగా చేసుకొని, దెబ్బ తీయవచ్చునన్న ఆలోచన, తెలిసిగాని, తెలియకగాని, ఆయన మనసులో జరిగిందనే విశదం అవుతున్నది. ఆ పద్ధతిని, తన రాజనీతికి, విదేశనీతికి ప్రధాన మాత్రంగా ప్రకటించిన శ్రీ నెహ్రూ ఇప్పుడు ఈసని చేశారంటే, ఇక్కడ లక్ష్యం ప్రధానమై, లక్ష్య సాధన మార్గం అప్రధానమై పోయిందని అంగీకరించవలసి వస్తున్నది. ఇట్లా అని గోవాకు విముక్తిని కల్పించడం తప్పనిగాని, ఆ విముక్తిని కల్గించినందుకు భారత ప్రభుత్వాన్ని విమర్శించడంగాని, నా అభిప్రాయంకాదు. ఈ జరిపిన చర్యలో దెబ్బతిన్న నీతిమాత్రాలు మాత్రమే ఇక్కడ పరిశీలించబడుచున్నవి. అంతేగాక, ఈ ఉదంతంవల్ల, మన నీతి సూత్రాలలో తోచిన పరిణామం ఎట్టిదో గూడా ప్రదర్శింపబడుతున్నది.

ఇప్పుడు ఈపైన పేర్కొన్న ఉదంతంవల్ల, యుద్ధాన్ని గురించి శ్రీ నెహ్రూ వైఖరిలో వచ్చిన మార్పువల్ల, మన విదేశాంగ విధానంలో ఇంకో మూలస్థంభం దాదాపుగా కూలిపోయింది. దురాక్రమణను ఎదుర్కోవేందుకు యుద్ధానికి దిగడం, అనగా ఆత్మరక్షణకోసం యుద్ధానికి దిగడం సబబైనప్పుడు, ఆ దురాక్రమణను ఎదుర్కొన డానికి, ఆ దురాక్రమణ భయం లేకుండా చేసుకోడానికి రక్షణ కూటములలో చేరినా, రక్షణ కూటములను కట్టుకున్నా, తప్పులేదు. ఎందుకంటే, ఈ రెండింటి అర్థము దాదాపు ఒకటే. అయితే, ఒకటి: ఏమీ లేకుండా, దురాక్రమణ జరిగితే, ఆ దురాక్రమణను తొలగబెట్టడానికి అన్ని ప్రయత్నాలుచేసి, చివరకు యుద్ధానికి దిగుతానంటుంది. మరొకటి: అట్టి దురాక్రమణజరగకుండా చూచుకోడానికి, ముందుగానే, దురాక్రమణ జరిగేపక్షంలో, ఇది జరగబోతుంది గాబట్టి, జాగ్రత్తగావుండండని దురాక్రమణదారులకు హెచ్చరికచేస్తూ, హెచ్చరికగా వుంటుంది. ఇది ఒక భేదం. ఇంకో భేదం ఏమిటంటే, పెద్ద ఎత్తు దురాక్రమణని తట్టుకోలేని రాజ్యాలు, తమ అశక్తతను తెలుసుకొని, వాస్తవ పరిస్థితులేమిటో గ్రహించి, సైనిక కూటాలలో చేరుతున్నాయి. వాటిని కాదంటున్న మనం, ఆ యా రాజ్యాల అండమీద ఆశలు పెట్టుకొని, వాస్తవానికి దూరమైన భావ లోకంలో విహరిస్తూ, సైనిక కూటాలు కట్టడం, వాటిల్లో చేరడం పాపం అని ధర్మోపన్యాసాలు చేస్తున్నాము. ఇక్కడ ఒక్కవిషయాన్ని ఆలోచించవలసివుంటుంది. కమ్యూనిస్టు చైనా, భారతదేశం పరిహద్దులపై సైనిక బలాన్ని ప్రయోగం చేస్తుంది అనుకుందాము. శ్రీ నెహ్రూ పార్లమెంటులో అంగీకరించిన దాన్నిబట్టి, ఆ ధాటిని తట్టుకోగల శక్తి మనకు అంతగాలేదు. అందువల్ల—ఒకవేళ చైనా ఎత్తివస్తే—మనం చేసేదేమిటి?—ఈ ప్రశ్నకు భారత ప్రభుత్వాన్ని నడుపుతున్నవారి ఆలోచన ఈవిధంగా వున్నట్లు కన్పిస్తున్నది.—చైనా—రష్యాలకు పడటంలేదు. సిద్ధాంతాలలోను, ఇంకా ఇతర విషయాలలోను కూడా ఈ రెండు దేశాలూ తలపట్లుపట్టుకుంటున్నాయి. అందువల్ల, భారతదేశం స్నేహాన్ని ఆకాంక్షిస్తున్న రష్యా, చైనా గనుక ఆపని చేస్తే, అడ్డుపడుతుంది. చైనా దురాక్రమణ చికీర్షతను అదమాయిస్తుంది— ఈరకంగా ఆలోచిస్తున్నట్లు తోస్తుంది. కాని ఈ వూహ అంతగా ఆశలు పెట్టుకోవలసిన వూహగా కన్పించదు. అందుకు బహు కారణాలు వున్నాయి. (1) భారతదేశంపై చైనా జరిపిన దురాక్రమణని, రష్యా ఇంతవరకు గట్టిగా ఖండించలేదు. (2) చైనా సాగించిన ఈ దురాక్రమణ ప్రయత్నాలను ఆపలేకపోయింది. (3) ఈ దురాక్రమణ విషయంలో చైనా వైఖరిలో మార్పును తెచ్చిపెట్టలేకపోయింది. (4) అన్నింటికిమించి, ఇంతవరకు రష్యా, చైనాకు వ్యతిరేకంగా, భారతదేశం పక్షం వహించి వ్యవహరించలేకపోయింది. (5) కమ్యూనిస్టు దేశాలు తమలో తాము ఎంతో పోట్లాడుకున్నా, యుద్ధము, శాంతి మొదలైన సమస్యలు తటస్థపడ్డప్పుడల్లా వారి బుద్ధులు ఒక్కటిగానే పని

చేస్తాయి. (6) చైనా, రష్యా తగాదా ఆసియాలోని కమ్యూనిస్టులపై ఎవరి "హెజిమనీ" చెల్లాలన్న విషయాన్ని గురించి సాగుతోంది. ఇందులో భారత కమ్యూనిస్టుపార్టీతో సంబంధం వుంటుందిగాని, భారతదేశాన్ని అంతటిని గురించి, రష్యా పెద్దగా ఆలోచిస్తుందనుకోవడం, ఎండమావుల దగ్గరకు నీళ్ళ కోసం పరుగెత్తుతున్నట్లే వుంటుంది.

ఇవిగాక, ఇంకో ముఖ్యకారణం గూడా ఇక్కడ వున్నట్లు అనుమానించ వలసి వస్తున్నది. భారతదేశం తాను తటస్థ రాజ్యాన్ని అంటున్నది. ఇటువంటి రాజ్యాలు ఇంకా కొన్ని ప్రపంచంలో తల ఎత్తుతున్నాయి. ఈ రాజ్యాలలోకల్లా భారతదేశం పెద్దది. ఇది ఒక కూటమిగా ఏర్పడే పక్షంలో, కమ్యూనిజం వ్యాప్తికి కొంత అవరోధం కల్గుతుంది. ఎందుచేతనంటే, ఈ రాజ్యాలన్నీ, జాతీయ వాదంతో సోషలిజాన్ని మిళితంచేసి, వ్యవహరిస్తున్నాయి. ఈ రకం సోషలిజాన్ని ఐరోపీయ సామ్యవాద పరిభాషలో మొదట సోషల్ డెమోక్రసీ అన్నారు. తర్వాత డెమోక్రాటిక్ సోషలిజం అన్నారు. లెనిన్—ఐరోపీయ సోషల్ డెమాక్రసీని "యెల్లో సోషలిజం" అని విమర్శించారు. ఆ విమర్శ ప్రకారం ఇప్పుడు కొన్ని కొన్ని తటస్థ దేశాలు, ముఖ్యంగా భారతదేశం అనుసరిస్తున్నపద్ధతిసామ్యవాదం విధిగా "యెల్లో సోషలిజం" కావాలి. ఇట్టి సోషలిజంను అనుసరిస్తున్న దేశాలలో భారతదేశం పెద్దది, శక్తివంతమైనది గనుక, దానిమీద ఒత్తిడిని తెచ్చిపెడితే, ఆ తాటస్థ్యం పసందే గాక, ఆ సోషలిజం పసందు, ఆ సోషలిజంను అంగీకరిస్తున్న రాజ్యాల పసందు గూడా బయటపడుతుంది! అనగా ఈ సిద్ధాంతంతో, భారత దేశం ఎన్ని రాజ్యాలను కట్టుకోగల్గుతుంది అన్నది తేలిపోతుంది. కాబట్టి చైనా ఆ విషయాన్ని తేల్చడానికి పూనుకుంది. అందుకు ఈ సరిహద్దు తగాదాకన్నా మంచి తగాదా ఇంకోటిలేదు. భారతదేశాన్ని అనుసరిస్తున్నట్లు ప్రపంచం భ్రమిస్తున్న రెండు రాజ్యాలు, ఈ సరిహద్దు తంత్రంలో ఇరుక్కొని వున్నాయి. ఈ తగాదా రేపితే, ఇందులో ఎన్ని దేశాలు భారతదేశం వెనక నిలుస్తాయి? 1954 అనంతరం చరిత్రను పరిశీలిస్తే, ఏ దేశమూ నిల్వ లేదని తేట తెల్లం అవుతుంది. బర్మా దారిని బర్మా, నేపాల్ దారిని నేపాల్, సరిహద్దులను గురించి చైనాతో ప్రత్యేక సమాధానాలు వ్రాసుకున్నాయి. అందుకు చైనా వారికి కితాబు గూడా ఇచ్చింది. ఒక్క భారతదేశం ఒక్కటే ఈవిషయంలో మొండిగా వ్యవహరిస్తున్నదని చైనా ప్రకటన గూడా చేసివుంది. అనగా, ప్రజాస్వామ్య సోషలిజం ద్వారా కట్టుకోవచ్చునమకున్న సహవాసం భారత దేశానికి కలిసిరాలేదు. పైగా ఈ తటస్థ దేశాలన్నవి కలిసి కట్టుగా వ్యవహరించగల రాజ్యాలు కావని, నేటి అవసరంకొద్దీ, అవి వ్యవహరిస్తూ వుంటాయనీ తేలిపోయింది.

ఇక భారతదేశం అనుసరిస్తున్న తాటస్థ్యాన్నిగాని, ఇతర దేశాల తాటస్థ్యాన్నిగాని, చైనా ఎంతమాత్రం విశ్వసించడంలేదు. ఈ తాటస్థ్యం అన్నది ఒక పెద్ద "నాటకం" అని చైనా అభిప్రాయం—రష్యా అభిప్రాయం గూడా అదేగాని, ఆలోచనలో మాత్రం కొంత తేడా వుంది. "సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పని చేస్తేనే తటస్థ రాజ్యాల అవసరం; లేకపోతే లేదు" అని ఒకానొక కమ్యూనిస్టు నాయకుడు అన్నాడు. రష్యా ప్రధాని శ్రీ కృశ్చేవ్ అభిప్రాయం గూడా ఇందుకు ఎంతమాత్రం భిన్నంగాలేదు. "మీరు సోషలిజంను వాంఛిస్తున్నారా? కమ్యూనిజం అంటే వ్యతిరేకిస్తున్నామని అనకూడదు" అని శ్రీ కృశ్చేవ్ ఒకప్పుడు తన్ను కలుసుకున్న ఈజిప్షియన్ ప్రతినిధివర్గంతో అన్నారు. అంటే అర్థంఏమిటి? జాతీయ వ్యవహారాలలోనూ, అంతర్జాతీయ వ్యవహారాలలోను, కమ్యూనిస్టు వ్యతిరేక వైఖరిని అవలంబించకుండా వున్నంతవరకే, ఈ తటస్థ రాజ్యాలు కమ్యూనిస్టు రాజ్యాలకు ప్రయోజనకారులవుతూ వుంటాయి. అందుకే రష్యా ప్రభృతి రాజ్యాలు భారతదేశంవంటి తటస్థ రాజ్యాలను చాలా విషయాలలో బలపరుస్తున్నట్లు నటిస్తున్నాయి. అట్లా బలపరచినందు వల్ల వారికి వచ్చిన నష్టం ఏమీలేదు. ముఖ్యంగా వలస రాజ్యాధికార విధాన ఖండన, సైనిక కూటముల నింద, ఆఖరికి నిరాయుధీకరణ మొదలైన సమస్యం విషయంలో కమ్యూనిస్టు రాజ్యాలు భారతదేశాన్ని బలపరిచడంలోను, భారత

దేశం ప్రతిపాదనలను అభినందించి, అట్టి ప్రతిపాదనలు చేసినందుకు సంతోషించడంలోను ఆశ్చర్యపడవలసింది ఏమీలేదు. ఎందుచేతనంటే భారతదేశం తాను చేసే ప్రతిప్రతిపాదన రష్యాకు కోపం రాకుండా వుండేవిధంగా చేయవలసివుంది. ఇంతవరకు సమితిలోగాని, ఇతరత్రాగాని చరిత్ర అట్లాగేవుంది. హంగరీ సమస్య వచ్చినప్పుడు, భారతదేశం ఈ వైఖరి బాగా విద్య మానం అయింది. నిరాయుధీకరణం విషయంలోను, అణ్వస్త్ర పరీక్షల వ్యవహారంలోనూ, గూడా తన ప్రతిపాదనలవల్ల, మాటలవల్ల రష్యాకు కోపం రాకుండా చూచుకునే ధోరణి గోచరం అవుతున్నది. ఇందుకు ప్రత్యామ్నాయంగా రష్య మనకు చేస్తున్న మేలు ఒక్కటే వుంది. అది అవసరమైనప్పుడు, అనగా కాశ్మీర్ సమస్య చర్చకు వచ్చినప్పుడు సందర్భోచితంగా విటోను ఉపయోగిస్తున్నది. ఇంతమాత్రంచేత భారతదేశం అంటే రష్య ప్రేమ ఒలికిపోతున్నదనిగాని, తటస్థ దేశాలంటే వల్లమాలిన గౌరవం చూపిస్తున్నదనిగాని అనుకోడానికి వీలులేదు. అట్లా వీలులేదని, బెల్గ్రేడ్ తటస్థ రాజ్యాల సమావేశానికి ముందు, భారతదేశం, ఇంకా ఇతర తటస్థ రాజ్యాలు, అణ్వస్త్ర పరీక్షలను వ్యతిరేకిస్తున్నాయి అని తెలిసి గూడా, రష్య, ఆ పరీక్షలు కొనసాగించింది. ఆ తర్వాత సమితిలో ఆ పరీక్షలను ఖండిస్తూ జరిగిన చర్చలలో మనం నిర్వహించినపాత్ర అంత ఉన్నతంగా ఉన్నదని చెప్పడానికి వీలు లేదు.

ఇందుకు కారణం ఏమిటి? మన తాటస్థ్యం గూడా తాటస్థ్యం కాని పరిణామాన్ని చెందింది. సరిహద్దులలో చైనాతో తగాదా మూలంగా, రష్యను అంటకాగాలన్న భావం ఒకటి మన అధినేతల మనస్సుయొక్క అంతరాంతరాలలో మెదులుతూవున్న కారణంచేత, ఆ ఒక్క ఆలోచనే మన అన్ని ఆలోచనల మీద ఏలుబడి సాగించే స్థితిలోకి వచ్చివేసింది. రష్యాకు కోప కారణం అయ్యే ఏ పని చేసినా, అది చైనాతో మనకువున్న తగాదాలో, మనల్నిగాక, చైనానే బలపరుస్తుందేమోనన్న మనస్థ్సితి ఏర్పడ్డ కారణంవల్ల, మన సర్వమైన ఆలోచనలు తదభిముఖంగా కొనసాగుతున్నాయి. 1960 లో సమితి సమావేశం అగ్ర నాయక స్థాయిలో జరగాలని రష్య సూచించినప్పుడు, ఈమధ్య జనీవాలో 18 రాజ్యాల నిరాయుధీకరణ సమావేశం గూడా అధినాయక స్థాయిలో జరగాలని రష్య సూచించినప్పుడు, ఇతర రాజ్యాల అభిప్రాయాలతో, ఆలోచనలతో, లేకపోతే అప్పటి అంతర్జాతీయ పరిస్థితులతో సంబంధం లేకుండా, భారత ప్రధాని ఆ ప్రతిపాదనలను బలపరచడం జరిగింది. అనగా, ఈరకం సూచనలతో ఏకీభవించని రాజ్యాలను ఇరుకున పెట్టడం జరిగింది. అందువల్ల, ఆ ఇతర రాజ్యాలు, భారతదేశం ఈ తాటస్థ్యం రష్యాకు అనుకూలంగా మాత్రమే పని చేస్తున్నదిగాని, ఇంకోవిధంగా పని చేయలేకపోతున్నది అంటే, అందులో తప్పు ఎంత మాత్రం కన్పించడంలేదు.

ప్రతిదేశం విదేశాంగ విధానమూ, ఆదేశం యోగ క్షేమాలను దృష్టిలో పెట్టుకొని, వాటిని కాపాడుకుంటూ, ప్రపంచంయొక్క సుస్థితిని కాపాడుకుంటూ వుండటానికి రచింపబడుతూ వుంటుంది. అగ్రరాజ్యాలు అన్నవి తమ యోగ క్షేమానుగుణంగా సకల ప్రపంచము నడుపుకుంటూ వుండాలని అనుకుంటూ వుంటాయి. ఇది ఇట్లా జరుగుతూ వుండటాన్ని మనం చూస్తూనే వున్నాము. అయితే, ఇంకా వెనకబడివుండి, ప్రపంచ రాజకీయాలలో గట్టి ముద్రను వేయడానికి తగిన ఆర్థికసోమత్తుగాని, సైనికబలంగాని లేని రాజ్యాలు, ముఖ్యంగా ముందు తమ క్షేమాన్ని, తర్వాత ప్రపంచ క్షేమాన్ని చూచుకోవలసి వుంటుంది. ఇందులో ప్రపంచ క్షేమం విషయంలో ఈ రకం రాజ్యాలు చేయగల్గింది ఆట్టే ఏమీ వుండదు. ఆ భారం అంతా బలంవున్న రాజ్యాలమీద వుంది. ఆ రాజ్యాలు ఏపని చేయతలపెట్టినా, ఈ రాజ్యాలు ఆపలేవు. ఈ విషయం గూడా ఇటీవలి చరిత్ర రుజు చేస్తూనేవుంది. పోతే ప్రపంచం ఇంకా వున్నది వున్నట్లుగావుంది అంటే, అందుకు ఈ అల్ప రాజ్యాలు ఎంతమాత్రం కారణంకాదు. ఒక అగ్ర రాజ్యంమీద ఇంకో అగ్రరాజ్యం అంకుశంగా వున్నందువల్లనే, ప్రపంచం ఇంకా బతికి గల్గుతున్నది. ప్రపంచం మనుగడలోవున్న అసలు రహస్యం ఇది. ఇందులో తమ అవసరంకొద్దీ, ఆ యా అగ్ర రాజ్యాలు, ఈ అల్ప రాజ్యాలను, అవి ఏ రకంవి అయినా, వాడుకుంటూ వుంటాయి. ఇట్టి పనులకు భారతదేశం బాగా ఉపయోగపడుతున్నది. ప్రపంచంలో ఎక్కడ "యుద్ధ విరమణ" అన్నా, మనం తయారు. మన సైన్యం తయారు. ఇంతకు మించి అంతర్జాతీయ రంగంలో మనం సాధించింది ఏమీలేదు. ఇంతకీ భారతదేశంవంటి రాజ్యాలు, అగ్ర రాజ్యాల తగాదాలలో తాటస్థ్యం వహించివుంటే, కొంత సుఖంవుంది అన్న వాదం ఒకటి వుంది. కాని, అది ఈ ప్రపంచంలో అంతగా సాగే విషయంకాదు. కాబట్టి మరో రకమైన తాటస్థ్యాన్ని అనుసరించడం జరుగుతున్నది. అగ్ర రాజ్యాల లంపటాలలో తల దూర్చకుండా, ఎప్పుడు ఏ సమస్యవస్తే, అప్పుడు దాని బాగు వోగుల ననుబట్టి, ఈరకం రాజ్యాలు తమ విధానాన్ని నిర్ణయించుకుంటాయన్నదే, ఈ రకం తాటస్థ్యం అర్థం. అందువల్ల, ఈ రకం తాటస్థ్యం ఒక పద్ధతి, ఒక క్రమంలేక 'ఎప్పటి కెయ్యది ప్రస్తుత, మప్పటికా మాటలాడి—" అన్న సుమతీశతకకారుని అవకాశవాదంక్రిందకు దిగజారిపోతోంది. అంతేగాక, మనం ఆ యా దేశాలలో బలపరుస్తున్న "యుద్ధ విరమణ" వ్యవహారం లాగానే, ఈవిధానం గూడా నిలకడలేనిది, ప్రయోజనకారికానిది అవుతున్నది. అంటే విఫలం అవుతున్నది.

ఈ విధానంవల్ల ప్రపంచంలో మనకు మిత్రులు అని చెప్పుకోతగినవారు ఎవ్వరూ ఏర్పడలేరు. కాని, ఈ విచిత్రస్థితే, ప్రపంచంలో అంతా మన మిత్రులే అనే అజాతశత్రుత్వ వాదానికి దారితీసి, మనం నిజంగా అట్టి వాళ్లమే కావుల్ను అనే భ్రాంతిలో పడవేసి, ఆ విధానమూ నిష్ప్రయోజకమౌతున్నది; మనల్ని నిష్ప్రయోజకులను చేస్తున్నది. కారణం ఏమంటే, తగినంత బలం వున్నప్పుడు అనుసరించవలసిన విధానాలను, మనం ఆ బలం లేకుండా అనుసరిస్తున్నాము. అందువల్ల, అది వేళ్ళతన్నని చెట్టులాగా తయారై, తాను నిల్వలేక, ఇతరులను నిల్వలేక, సవసతంలవుతున్నది. ఏ సమస్యవచ్చినా, స్పష్టమైన ఆలోచన చేయడంగాక, మధ్యమ మార్గంలో ఆలోచన చేయడం, మధ్యమ మార్గపు పరిష్కారాలను సూచించడం జరుగుతున్నది. విచిత్రమేమంటే, అదే రకం సమస్యలను మనమే ఎదుర్కొనవలసి వచ్చినప్పుడు, ఆ మధ్యమ మార్గాలు మనకు పనికి రావడం లేదు. ఇట్టి విరుద్ధ లక్షణాలతో నిండివున్నందువల్లనే, ఈరకం తాటస్థ్యంతో మనం ఏమీ సాధించలేకపోతున్నాము.

అసలు ఈ విధానం వెనుకవున్న తాత్వికధార ఏమిటో ఎక్కడిదో అర్థం చేసుకునే పక్షంలో, ఇది ఇట్లా ఎందుకు వుంటున్నదో, దీని పర్యవసానం ఏమిటో అర్థం అవుతుంది. మొదట ఈమధ్యమ మార్గాన్ని జీవన ధర్మంగా ఆలోచించిన వాడు బుద్ధుడు. తనది మధ్యమ మార్గం అని ఆయనే చెప్పుకున్నాడు. ఆ మధ్యమ తత్వంలో గూడా, ఇప్పుడు మనం అనుసరిస్తున్న తటస్థ పద్ధతినే అనుసరించడం వుంది. తాత్విక విషయాలలో ఎట్లావున్నా, రాజకీయాలకు సంబంధించినంతవరకు బుద్ధుడు ఇట్టి వైఖరి—అనుసరించాడు. అప్పుడు ఉత్తర భారతంలో వివిధ ప్రాంతాలను ఏలిన రాజులు—బింబిసారుడు, ప్రసేనజిత్తు, ఇంకా ఇతరులు—వున్నారంటే వారిలో ఒకరంటే ఒకరికి పడేదికాదు. ప్రతి ఒక్కరు ఏకచ్ఛత్రాధిపత్యం కోసమే ప్రయత్నం చేశారు. అందుకోసం యుద్ధాలూ చేశారు. బుద్ధుడు ఈ యుద్ధాల విషయంలో, ఈ రాజుల తగాదాల విషయంలో గూడా మధ్యమ మార్గాన్నే అనుసరించాడు. ఆ మధ్యమ మార్గం 'వజ్జియ' గణ రాజ్యం, బింబిసారుని పుత్రుడు, అజాతశత్రుని చేతుల్లో నాశనం అయిపోడానికి గూడా కారణం అయింది. ఈ ఉదంతం "మహా పరినిబ్బాణ సూత్రం"లోను, జైనుల కథలలోను చెప్పబడివుంది. ఇప్పుడు ఆ మధ్యమ మార్గ సిద్ధాంతాలే మన విదేశాంగ నీతికి కొంతవరకు ఆధారం అవడంచేత, దానికి వలెనే, ఇది గూడా నిర్వీర్యము, నిష్ప్రయోజకము, పైపెచ్చు, ప్రమాద భూయిష్టముగా తయారవుతున్నది. అక్కడ ఆ ప్రమాదం ఎవరివల్లనో, ఎవరికో వచ్చింది. ఇక్కడ ఆ ప్రమాదం, మనవల్ల, మనకే వచ్చేట్టువుంది. ఇంతే తేడా.

పండిత జవహర్‌లాల్ నెహ్రూగారికి, తాను బుద్ధుడంత కాకపోయినా, అశోకుడంత అవుదామనన్నా వుంది. ప్రపంచంలో శాంతి తనవల్ల ఏర్పడింది అన్న పేరు తెచ్చుకోవాలన్న అభిలాషవుంది. అట్లా వుండటం మంచిదే గూడాను. కాని ఇది అశోకుడినాటి కాలంగాని, బుద్ధుడినాటికాలంగాని కాదు. ఆ కాలానికి పనికిపోయిన ధర్మాలు ఈ కాలానికి పరిపోవు. అందుకే అవి పని చెయ్యవు. అశోకుడిలాగా లోకాన్ని దిద్దాలి అంటే, పరిస్థితులన్నీ, అశోకుడి కాలంనాటివిలాగా వుండాలి. అవి అట్లా లేనందువల్ల, మనం చేసే ఆలోచనలకు అప్పటి ఆలోచనలు ఆధారం కావడంవల్ల, అవి కాలానికి పట్టక, పరిస్థితులకు అనుకూలంకాక, మనల్ని, మన దేశాన్ని గూడా స్వప్నంలో విహరింప జేస్తున్నాయి.

# రాజవాహన విజయం

శ్రీ బులుసు వేంకటరమణయ్య

లలిత లలితాలైన దేశ్య పదాలతోపాటు, అన్యదేశ్య పదాలను గుప్పించి, రసవంతంగా ప్రబంధాలు రచించిన తెలుగుకవులలో కాకమాని—మూర్తికవి ప్రసిద్ధుడు. ఇతడు పాంచాలీ పరిణయం, రాజవాహన విజయం, బహుళాశ్వ చరిత్ర అనే మూడు ప్రబంధాలను రచించాడు. వీటిలో మొదటి రెండూ లభించినవి. లక్షణ గ్రంథాలలో ఉదాహరణంగా ఇచ్చిన పద్యాలుతప్ప, బహుళాశ్వ చరిత్రం లభించినట్లు కానరాదు.

మూర్తికవి పాంచాలీ పరిణయాన్ని శ్రీరంగనాథునికీ, రాజవాహన విజయాన్ని శ్రీ వేంకటేశ్వరునికీ అంకితం ఇచ్చాడు. పాంచాలీ పరిణయంలో కృతిభర్త తన్ను గూర్చి పలికినట్లు చెప్పికొన్న

"అల్లసానివాని యల్లిక బిగిసొంపు
ముక్కు తిమ్మనార్య ముద్దుపలుకు
పాండురంగవిభుని పద్యంబు సొరువును
కాకమానిరాయ! నీకె కలవు"

అనే పద్యాన్నిబట్టి సుప్రసిద్ధ ప్రబంధ కవుల పోకడ లన్నిటినీ మూర్తి కవి అలవరించుకున్నట్లు తెలుస్తున్నది.

ఇతని కాలాన్ని స్పష్టంగా నిర్ణయించడానికి తగిన ఆధారాలు లేవు. కాని, శ్రీ కృష్ణదేవరాయలకాలంనాటి అల్లసాని పెద్దనను, ముక్కు తిమ్మనను, తెనాలి రామకృష్ణుని పేర్కొనుటవల్ల వారి తర్వాతివాడని నిశ్చయించవచ్చు. రాజవాహన విజయం పంచమాశ్వాసంలోని "చేతికై దేసి మేల్ శివరాయల వరాల, వెల కట్టడల వటాణీల్ గరీబుల" (ప—16) అనే చోట ఉన్న 'శివ రాయల వరాల' వల్ల సదా శివరాయల కాలంలో చెలామణిలోవున్న వరహాలను గ్రహించవలసి వున్నదనీ, దానినిబట్టి కాకమాని మూర్తికవి క్రీ. శ. 1568 కి తర్వాతివాడే అయివుండవచ్చునని దీని పీఠికలో శ్రీ నందిరాజు—చలపతిరావుగారు తెలియజేసి ఉన్నారు.

ఈ కవి తన గ్రంథాన్ని భగవంతుడగు వెంకటేశ్వరునికి అంకితం యిస్తూ రాజులు చాలా క్రూరాత్ములనీ, ధనంకోరి వారిని ఆశ్రయించినా ప్రయోజనం వుండదనీ వివరిస్తూ,

'వ్యాళస్వాంతు లశాంతు లజ్ఞనతలై
కాంతుల్ మహా చేటికా
శ్రీలోపద్రవనవ్య పత్రికులు భూ
రిప్రాజ్ఞ విజ్ఞానవా
వేళా కల్పిత రక్త వక్త్రులు కళా
విజ్ఞాన నిర్భాగ్య శ్రీ
కాల క్ష్మాతలనేతలం బొగడుటల్
కష్టంబు లర్థార్థికిన్?'

అని చెప్పియున్నాడు. దీనినిబట్టి మూర్తికవి రాజులను ఆశ్రయించి, వారికి గ్రంథాన్ని దేనినయినా కృతియిచ్చి, ధనాన్ని సంపాదించదలచినట్లూ, తన కోరిక సఫలం కాకపోగా, ఆ రాజులమీది కోపంతో యిలా చెప్పినట్లూ వూహించడానికి వీలుంది. ఇలాంటి సంకల్పమే లేకపోతే 'కాలక్ష్మాతలనేతలం బొగడుటల్ అర్థార్థికి కష్టంబులు' అని చెప్పి వుండడు. ఇలాటి సంఘటనవల్ల నైరాశ్యం కలిగి అతడు తన గ్రంథాలను భగవదంకితాలుగా చేసి వుండవచ్చును.

రాజవాహన విజయం అయిదాశ్వాసాల ప్రబంధం. దీనిలోని కథాంశం యిదీ—

కుసుమపురం ముఖ్యపట్టణంగా మగధదేశాన్ని రాజహంసుడనేరాజు పాలిస్తూ వుండెను. అతని భార్య వసుమతి. ఆ దంపతులకు చాలాకాలంవరకూ సంతానం కలగలేదు. ఒకనాటిరాత్రి భగవానుడగు శ్రీకృష్ణుడు వసుమతీదేవికి స్వప్నంలో ప్రత్యక్షమై సంతాన ఫలాన్ని ప్రసాదించగా, ఆమె గర్భాన్ని ధరించి సుపుత్రుని ప్రసవించింది. ఆ బాలునికి రాజవాహనుడని పేరు పెట్టబడింది.

రాజవాహనుడు దినదినాభివృద్ధిపొందుతూ, పెరిగి పెద్దవాడై సమస్త విద్యలూ నేర్చుకొన్నాడు. అస్త్రవిద్యలో ఆరితేరి మహా వీరుడనీ, అరి భయంకరుడనీ పేరు సంపాదించాడు. తండ్రి, అతనికి బంధువర్గంలోని ఉత్తమవంశ జాత అయిన కన్యనిచ్చి వివాహంచేసి, యౌవరాజ్య పట్టం కట్టాడు. తర్వాత తనకు కట్టవలసిన కప్పం కట్టకుండా ఉపేక్షించిన పాండ్యరాజుపైకి రాజహంసుడు సైన్యంతో కూడా కుమారుని పంపాడు. భర్తయొక్క ప్రతాపాన్ని కళ్లారా చూచి, ఆనందించడానికి యువరాణి కూడా బయలుదేరినది. ఆమెకు అంగరక్షకుడుగా ఆమె సోదరుడూ ఆమె ననుసరించాడు.

రాజవాహనుడు సమస్త సైన్యాలతోనూ, దిగ్విజయంకోసం ఉత్తర దిక్కునకుబయలుదేరివెళ్ళి, పరాక్రమం చూపి, చాలామంది రాజులను ఓడించి, వారి దుర్గాలను స్వాధీనం చేసుకున్నాడు. కుంతల, సింధు, సౌరాష్ట్ర, గంధార, గౌడ, మత్స్యదేశాధిపతులూ, కాశీరాజు అతనిని శరణుజొచ్చినారు. రాజవాహనుడు వారందనీ అనుగ్రహించి, వారివల్ల కప్పములను గ్రహించి, శాండిల్య మహాముని ఆశ్రమానికి వెళ్లి, ఆ మహామునిని దర్శించి, ఆతని ఆతిథ్యం స్వీకరించి, ఆ రాత్రి అక్కడే గడిపాడు.

మరునాడు ఉదయమే ఒక చెంచుదొర ప్రార్థించగా అడవిలోనికిపోయి, క్రూరమృగాలను వేటాడి, విశ్రాంతికై అక్కడికి సమీపంలోవున్న ఒక ఉద్యానవనానికి వెళ్లాడు. అది మాళవ దేశాధీశ్వరుడైన మానసారుడిది. అప్పుడు ఆ పూలతోటలో లోకోత్తర సౌందర్యవతిఅయిన రాజకుమార్తె—అవంతిసుందరి చెలికత్తెలతో కూడా విహారిస్తూ ఉన్నది. ఆమె రాజవాహనుణ్ణి చూచింది. ఇతడూ ఆమెను తిలకించాడు. ఇద్దరికీ పరస్పరానురాగం అంకురించినది. ఇంతలో తల్లివచ్చి పిలవగా, అవంతి సుందరి ఆ స్థలం విడవలేక విడవలేక వెనుకకు మరలి చూస్తూనే అంతఃపురానికి వెళ్లినది.

తర్వాత రాజవాహనుడూ, అవంతి సుందరీ కూడా విరహవేదనతో మిక్కిలి బాధపడ్డారు. అవంతిసుందరి చెలికత్తె బాలచంద్రిక రాజవాహనునివద్దకు వచ్చి తనచెలి వృత్తాంతాన్ని వివరించినది. రెండు, మూడు దినాలలో తన ప్రతాపాన్ని మాళవరాజుకు చూపి, అతన్ని లొంగదీసుకుని అవంతీ సుందరిని స్వీకరిస్తానని రాజవాహనుడు సమాధానమిచ్చి, బాలచంద్రికను సత్కరించి పంపివేశాడు.

తర్వాత రాజవాహనుడు సేనలు కూర్చుకుని మాళవరాజుమీదికి వెళ్లగా, ఆ రాజు తన కుమారుడైన దర్పసారుని యుద్ధానికి పంపాడు. కొంతసేపు పోరు ఘోరంగా జరిగింది. దర్పసారుని సైన్యం వెనక్కు తగ్గినది. రాజవాహనుడు అతనిని కోటదాకా తరిమి, మర్నాడు "సర్వలగ్గ" అని ప్రకటించాడు. ఈ సంగతి మాళవరాజు తెలుసుకుని "యిక లాభంలే" దనుకుని మైత్రిని ప్రకటిస్తూ, రాజవాహనునివద్దకు రాయబారులను పంపాడు. రాయబారం తెచ్చిన మంత్రులు తొలుత కానుకలు యిచ్చి, వినయ విధేయతలు ప్రకటించి, జరిగిన సంఘటనకు గ్రహగతి తప్ప మరొకటి కారణం కాదనీ, తమ రాజు తన పుత్రిక అవంతిసుందరిని మగధయువరాజునకు యిచ్చి, వివాహం చెయ్యాలని యెప్పుడో సంకల్పించుకున్నాడనీ, ఈ సంగతి తెలుపుటకు మీకు వార్త పంపాలని అనుకొంటూవుండగా, మీరే రావడం ఎంతో మేలని చెప్పి, పంచవిధాటి

రాత్రికి వివాహ ముహూర్తమనీ, అప్పటికి సర్వ సన్నాహాలతో తప్పక దయచెయ్యాలనీ ప్రార్థించినారు. అనుకొన్న ముహూర్తానికి అవంతిసుందరీ రాజవాహనులకు వైభవంగా వివాహం జరిగింది. తర్వాత రాజవాహనుడు అవంతిసుందరితో తన బసకువచ్చి, నిదాఘకాలం సుఖంగా అక్కడనే గడిపి, ఉత్తర వార్ధికడ జయస్తంభము నిలిపి, విజకాంత సైన్యములతో కూడా రాజధానికివచ్చి, తలిదండ్రులకు ఎంతో ఆనందాన్ని కలిగించాడు. ప్రజలు మెచ్చుకోగా రాజ్యాన్ని పాలిస్తూ, సుఖంగా ఉండినాడు.

ఈ కథాంశాన్ని గూర్చి శ్రీ చలపతిరావుగారు పీఠికలో "ఇందలి యితివృత్తము స్వకపోలకల్పితమువలె కానుపించుచున్నది. దీనికి సంస్కృత మాతృక కానుపించదు. సామాన్య నైసర్గిక విషయములనే గైకొని యత్యంత రమణీయమైన కథా శరీరమును గల్పించి సాహిత్య రసపిపాసువులకు నితాంతానందమును సమకూర్చుటలో నీ కాకుమానికవి చూపిన భావనాశక్తి కళావైదగ్ధ్యము అతిలోక రమ్యముగా నున్నది" అని వ్రాసినారు. కాని, దీనికి మూలం లేకపోలేదు. దండి మహాకవి సంస్కృతంలో రచించిన దశ కుమార చరిత్రలోని ప్రధానకథే దీనికి మూలం. దీనికి సంబంధించినంతవరకూ ఆ మూల గ్రంథంలోని కథ యిది—

"పుష్పపురం అనే పట్టణం రాజధానిగా మగధదేశాన్ని రాజహంసుడనే రాజు పాలిస్తూవుండెను. ఆయన భార్య వసుమతి. ఒకప్పుడు మాళవరాజైన దర్పసారుడితో రాజహంసునికి యుద్ధం సంభవించింది. అందు మాళవ రాజు వోడిపోయి, బంధింపబడెను. రాజహంసుడు దయతలచి, అతని రాజ్యాన్ని ఇచ్చివేసినాడు.

రాజహంసుడు సంతానంకోసం భగవంతుడైన నారాయణుని పూజింపగా, తదనుగ్రహంవల్ల వసుమతీదేవి గర్భాన్ని ధరించినది.

అపజయ పరాభూతుడైన మానసారుడు శత్రువుపై పగసాధించడంకోసం మహేశ్వరుని గురించి గొప్ప తపస్సుచేసి, గొప్ప గదను సంపాదించి మగధ రాజుపైకి వచ్చి, అతనిని ఓడించి, రాజ్యాన్ని ఆక్రమించాడు. రాజహంసుడు ససైన్యంగా అడవులపాలు కావలసివచ్చింది. రాజహంసుడు తపస్సుచేసి, శత్రువును సాధించవలెననే తలపుతో వామదేవుడనే మహామునికి తన అభిప్రాయాన్ని తెలియజేశాడు. శరీరాన్ని శుష్కింపజేసే తపస్సువల్ల ప్రయోజనంలేదనీ, వసుమతీదేవి గర్భంలోఉన్న కుమారుడే శత్రువులందరినీ ఓడించగలడనీ, విచారించవద్దనీ హితబోధ చేశాడు. అదే సమయంలో ఆకాశవాణి కూడా ఆ విధంగానే పలికినందున, రాజునకు కొంత ఊరట కలిగింది. తర్వాత ఒక శుభదినంలో వసుమతీదేవి సుపుత్రుని కన్నది. ఆ బాలుడే రాజవాహనుడు. ఆ శిశువు దినదినాభివృద్ధిపొంది, సకల విద్యలూ అభ్యసించి మహా వీరుడుగా తయారయ్యాడు. ఆ బాలుడు తలిదండ్రులకూ, తక్కిన వారికీ ఎంతో ఆనందాన్ని కలిగించాడు.

ఒకప్పుడు వామదేవమహాముని రాజహంసునివద్దకువచ్చి, కుమారుని దిగ్విజయార్థం పంపవలసిన సమయం యిదే అని చెప్పాడు. రాజు సరే అని సహవాసులైన మంత్రి పుత్రులతో కూడా రాజవాహనుని పంపాడు. రాజవాహనుడు మిత్రులతోకూడా వింధ్యాటవిలో ప్రవేశించి, మాతంగుడనే విప్రుని చూచినాడు. అతడు రహస్యంగా రాజకుమారునికి తన వృత్తాంతం చెప్పి, తనకు సహాయపడాలని కోరినాడు. అతనికోరికను నెరవేర్చడంకోసం రాజవాహనుడు నిద్రపోతూవున్న తన తొమ్మండుగురు మిత్రులనూ, అర్ధ రాత్రిలో విడిచిపెట్టి, మాతంగునికి సాయంగా అతనివెంట పాతాళలోకానికి వెళ్ళి, అసురరాజపుత్రిక అయిన కాళిందివల్ల ఆకలి దప్పుల శ్రమలు లేకుండా చేసే మణిని బహుమతిగాపొంది, తిరిగి భూలోకమునకు వచ్చినాడు. వచ్చి, దేశాలుతిరుగుతూ, మిత్రులకోసం వెతుకుతూఉండగా పుష్పోద్భవుడనే మిత్రుడు అవంతీపుర ప్రాంతంలో కనిపించాడు. పుష్పోద్భవుడు తన వృత్తాంతాన్ని వివరంగా చెప్పి, రాజకుమారుడిని తనగృహానికి తీసుకునివెళ్ళి ఎంతో భక్తితో పరిచర్యలు చేస్తూ వుండేవాడు. అతనిభార్య బాలచంద్రికా మిగిలిన బంధువులు ఎంతో గౌరవంగా చూచేవారు. రత్నోద్భవుడు తన మిత్రుడిని "అన్ని కళలూ తెలిసిన బ్రాహ్మణుడు" అని ప్రచారంచేసి నమ్మిక పుట్టించాడు.

అప్పటికి మాళవరాజైన మానసారుడు వృద్ధుడైనాడు. అతడు తన కుమారుడైన దర్పసారుడికి రాజ్యం అప్పగించాడు. దర్పసారుడు తన మేనత్త కొడుకు అయిన చండవర్మపైనీ, దారువర్మపైనీ రాజ్యభారాన్ని వుంచి, తపస్సు చేయడానికి రాజగిరికి వెళ్ళాడు. క్రూరుడైన దారువర్మ అన్ననూ, మేనమామనూ లక్ష్యంచెయ్యక విశృంఖలంగా ప్రవర్తిస్తూ, ప్రజాకంటకుడై వుండినాడు. అవివాహితగా ఉన్నప్పుడు బాలచంద్రికను దారువర్మ బలవంతంగా వివాహం చేసుకోదలచినాడు. కాని, ఆమెను ప్రేమించిన పుష్పోద్భవుడు దారువర్మను మాయోపాయంచేత సంహరించినాడు.

ఒకనాడు రాజకుమార్తె అవంతిసుందరి, తన ప్రియసఖి అయిన బాలచంద్రికతో కలిసి పట్టణానికి చేరువనున్న ఉద్యానవనంలో విహరిస్తూఉండగా, రాజవాహనుడు పుష్పోద్భవునితో కూడా అక్కడికి వెళ్ళడమూ, అవంతిసుందరీ రాజవాహనులు ఒకరినొకరు చూసుకొనడమూ, వారిద్దరికీ పరస్పరానురాగం అంకురించడమూ జరిగింది. ఇంతలో అవంతిసుందరి తల్లివచ్చి కుమార్తెను తీసుకుని వెళ్ళింది. అవంతిసుందరి విరహవేదన పడుతూవుండగా, బాలచంద్రిక ఆమెను వూరడించి, ఆమె వృత్తాంతాన్ని రాజవాహనుడికి తెలియజేసింది. అతడు, ఒకటి రెండు రోజుల్లో తగిన ఉపాయం ఆలోచించి అంతఃపురానికి రాగలననీ, ధైర్యంతో వుండవలెననీ తిరిగి వార్త పంపాడు.

రాజవాహనుడు తగిన ఉపాయాన్ని ఆలోచిస్తూవుండగా, ఇంద్రజాల విద్యలో ఘటికుడైన విద్యేశ్వరుడనే బ్రాహ్మణుడు వచ్చాడు. అతనితో ఆలోచించి, చండవర్మకు తన యింద్రజాల విద్యను చూపే నెపంతో తన కార్యాన్ని నెరవేర్చుకో దలచాడు. విద్యేశ్వరుడు తనవిద్యను ప్రదర్శిస్తూ, ఆ సందర్భంలో అవంతి సుందరీ, రాజ వాహనులకు వివాహం జరిపించాడు. తర్వాత "ఇంద్రజాల పురుషులందరూ వెళ్ళిపొండి" అని అతడు చెప్పగా, రాజవాహనుడున్నూ, అవంతిసుందరితో అంతఃపురానికి వెళ్ళిపోయి తన భార్యతో అక్కడే సుఖంగా కాలం గడపసాగాడు.

కొన్నాళ్ళు జరగగా, శాప వశాన రాజవాహనుని కాళ్ళకు వెండి సంకెళ్ళు తగులుకొన్నవి. వెంటనే అవంతి సుందరి పెద్ద గోలచేసినది. ఆ వార్త అంతఃపురం అంతటా అల్లుకొని పోయింది. అంతఃపురద్రోహి అని భావించి చండవర్మ రాజవాహనుడిని వెంటనే చంపించదలచెను. కాని తపస్సు చేసుకొంటున్న దర్పసారుడికి తెలపడం ధర్మమని, అతనివద్దకు వార్తాహరుని పంపాడు. ఆ ద్రోహిని ఏనుగుచేత త్రొక్కించాలని కోపించిన చండవర్మ ఆజ్ఞయిచ్చాడు. పిదప ఏనుగువద్దకు శృంఖలాబద్ధుడైన రాజవాహనుడు తీసుకొని రాబడ్డాడు. తక్షణమే శాపం తీరి, అతని సంకెళ్ళు ఊడిపోయి, ఒక అప్సరసగా మారిపోయాయి. రాజవాహనుడు దానిపైకి ఉరికి, మావటివాణ్ణి తోసివేసి, ఆ ఏనుగును రాజభవనంవైపు పోనిచ్చాడు.

సింహవర్మ కుమార్తె అంబాలికను మోహించి, బలవంతంగా వివాహం చేసుకోడానికి సిద్ధపడిన చండవర్మను, హఠాత్తుగా అక్కడికి వచ్చిన రాజవాహనుని మిత్రుడు అపహారవర్మ చంపివేసి, మిత్రునికి ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించాడు."

ఇలా చెప్పుకొనిపోతూవుంటే ఎంతో కథవుంది. ప్రస్తుతానికి యీ కథే ఎక్కువ. దీన్నిబట్టిచూస్తే మూర్తికవి దశకుమార చరిత్రను బాగా ఎరుగుననీ, అందులోని కథనే కొంత గ్రహించి తనకు తోచినట్లు మార్చి యీ ప్రబంధాన్ని వ్రాశాడనీ చెప్పవలసి వున్నది. దండి సంస్కృత కావ్యాన్ని కాకపోయినా, కేతన గ్రంథాన్నయినా చూచి వుండాలి. తెలుగు కవులలో కవిత్రయాన్ని తక్క తక్కిన వారి నెవ్వరినీ ప్రస్తుతించని మూర్తికవి కేతనను పేర్కొనక పోవడం వింతకాదు.

దశకుమార చరిత్రలోని కథ చాలా రసవంతంగా ఉన్నది. రాజహంసుని రాజ్యభ్రష్టతా, వామదేవమహాముని యిచ్చిన సలహా, రాజవాహనుని విజయప్రస్థానం అవంతిసుందరీ వివాహసన్నివేశం, రాజవాహనుని ధైర్యసాహసాలూ అతి మనోహరంగానూ, సముచితంగానూ కూర్చబడినవి. ఇటువంటి మూల గ్రంథాన్ని ఆధారంగా ఉంచుకొని కూడా మూర్తికవి సంఘటనలను రసవంతంగా కూర్చలేకపోవడం పెద్ద లోపమే! అది అలా వుండగా—ఇందులోని సంఘటనలు కొన్ని అనుచితంగా కూడా ఉన్నవి. ఈ క్రిందివి వాటిలో కొన్ని.

(1) రాజహంసుడు కుమారుడికి యువరాజ పట్టం కట్టిన తర్వాత 'మట్టపు, నృపాలుర యిండ్లను పెండ్లిచేసి' అని బంధువులలో ఒకరి పిల్లను తెచ్చి

పెండ్లి చేసినట్లు మూర్తికవి చెప్పినాడు. ఇతని వ్రాతమబట్ట అవంతి సుందరి రాజవాహనునికి చిన్నభార్య అగును. ఈ విషయం మూలంలోలేదు. మూర్తికవి యింతతో పూరుకోక, యువరాజు దండయాత్రకు బయలుదేరినప్పుడు పెద్ద భార్య కూడా అతనివెంట వచ్చినట్లు వర్ణించాడు. అవంతిసుందరి వివాహ సందర్భంలో ఆమె ప్రసక్తియే కానరాదు. ఆమె తనతో కూడా వచ్చినప్పుడు, యువరాజు ఆమె కీ విషయం చెప్పడంగాని, లేదా, ఆమెయే అతని కోరికను తెలుసుకుని, తన సమ్మతిని తెలపడంగాని అవసరము. అలా జరిగితేనే కథలో రసభంగం ఉండదు. ఇందులో ఈ రెండింటిలో ఏదిలేదు. పంచమాశ్వాసము చివర 103 వ పద్యంలో "నిజకాంతా సైన్యసంయుక్తుడై, జంభారి క్రియజేరిఁ యాత్మపురి" అని వుండడంబట్టే—కాంతా శబ్దంచేత ఇద్దరు భార్యలనూ గ్రహించే అవకాశం వుండడంవల్ల పెద్దభార్య కూడా అతనితో రాజధానికి మరలి వచ్చిందని ఊహించవలసి ఉన్నది. అంతేగాని, ఆమెనుగురించి మరేమీ కానరాదు.

(2) కథా సన్నివేశాలనుబట్టి, యిది పురాణ కాలానికి సంబంధించిన కథ అని తెలుస్తూ వున్నది. తదనుగుణంగా ఆశ్రమాది వృత్తాంతం ఇందులో కూర్చ బడి ఉన్నది. ఇలాంటి స్థితిలో రాజవాహనుని దండయాత్రలో యువములు కూడా వున్నట్లునూ, వారితో బీబీలు కూడా బయలుదేరినట్లునూ వర్ణించడం వింతగానే ఉన్నది. ఈ విషయంలో ద్వితీయాశ్వాసంలోఉన్న 52వ పద్యంలోని 'కంఖాణికావలి కందోలి సలామునేసెఁ యవన వ్రాతంబు భూభర్తకున్' అనేది, 60—వపద్యం లోని 'బిబ్బీగబ్బిమిటారు లెక్కుతురగీ బృందంబు చిందెన్నడల్'అనేదీ తార్కాణాలు.

(3) రాజహంసుడు సాటిలేని బలపరాక్రమాలు కలవాడు. సామంతు లందురూ అతనికి కప్పం కట్టుతూ ఉండిరి. పాండ్యులు 'ఏ పట్టున లోఁగక, ఉద్ధతిని కప్పము గట్టకున్కి' వారిపయి దండయాత్రకు అతడు కుమారుని ససైన్యంగా పంపాడు. మగధ దేశానికి పాండ్యదేశం దక్షిణంగా ఉన్నది. కాని ఉత్తర దిశలోలేదు. ఒక్క మగధ దేశానికేకాదు. భారతదేశంలోని మిగిలిన ప్రాంతా లన్నింటికీ కూడా పాండ్యదేశం దక్షిణ దిశలోనిదే! పాండ్యులను సాధించదలచిన రాజవాహనుడు తన సేనలను దక్షిణానికి నడిపించక ఉత్తరానికే నడిపించడం కొంత ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

'క. ఇత్తెరగున దండెత్తి, నృపోత్తంసు డుదాత్త వృత్తి నుత్తర ధరణీ
భృత్తుల కోట కొత్తళమత్తతి దుత్తుమురుఁజేసె నత్యుద్ధతుఁడై'

అని ఈ సందర్భంలో కవి వ్రాకుచ్చాడు. యువరాజు కుంతల, సింధు, విదర్భ, గాంధార, గౌడ, మత్స్య, కాశీరాజులను లొంగదీసుకున్నాడు. పాండ్య దేశం ఉత్తరాన లేనందున, దాన్ని లొంగదీసుకునే ప్రసక్తి రాలేదు. ఒకవేళ, అతడు ఉత్తర దిక్కున జైత్రయాత్రను ముగించుకొని, దక్షిణ దిక్కుకు రాదలచినాడో, ఏమో, గ్రంథంలో మాత్రం పాండ్యులను లొంగదీసుకున్న విషయం లేనేలేదు. రాజవాహనుడు అవంతిసుందరిని వివాహంచేసుకుని, మాళవంలో కొన్ని నెలలు గడిపినాడు. వర్షాకాలంవస్తే ప్రయాణం చెయ్యడం కష్టమని యెంచి,

అంభోధి ప్రియ సంభవాన్వయుఁ డతం డత్యుగ్రుఁడంతన్ జయ
స్తంభం బుత్తర వార్ధి నిల్పి నిజకాం తాసైన్య సంయుక్తుఁడై
జంభారిక్రియఁ జేరి యాత్మపురి నిచ్చల్ తల్లి దండ్రుల్ ప్రజల్
సంభూషింప సమస్తరాజ్యపదవీసౌఖ్యంబు జెందెన్ దగన్'

(ఆ 5. ప. 103)

దీనితో అతని ఉత్తర జైత్రయాత్ర పూర్తి అయింది. కప్పం కట్టక ఎదురు తిరిగిన పాండ్యులమీదికి పోనేలేదు. రాజ్య సుఖాలనుభవిస్తూ, భార్యలతో కూడి, తల్లిదండ్రులయొక్కయూ, ప్రజలయొక్కయు, భూషణలను పొందుతూ ఉండెను. దీనివల్ల తండ్రి ఆదేశం నెరవేరినట్లులేదు. ఉత్తరరాజ్యాలు జయించి వచ్చినందున, తండ్రి తృప్తిపడ్డాడేమో తెలియదు.

(4) ఈ సందర్భములోనిదే మరొక వింత సంగతి! భారత దేశానికి ఉత్తర సరిహద్దుగా హిమాలయ పర్వతా లున్నాయి. రాజవాహనుడు తోబరచుకొన్నట్లు చెప్పిన దేశాలన్నీ హిమాలయాలకు దక్షిణంగా ఉన్నవే! ఉత్తర సముద్రం ఎన్నో వేల మైళ్ళదూరంలో సాధారణంగా మానవులు చేరరాని స్థలంలో ఉన్నది. కవి వర్ణించిన దానినిబట్టి, రాజవాహనుడు హిమాలయాలవరకయినా వెళ్ళినట్లు కానరాదు. ఇట్టి స్థితిలో ఉత్తరవార్ధి దగ్గర అతడు జయస్తంభాన్ని నిల్పి నట్లు వ్రాయడం ఏమాత్రమూ ఉచితంగాలేదు. ఇది నమ్మదగిన విషయమూ కాదు.

(5) ఉత్తరదేశ దండయాత్రను ముగించుకొన్నతర్వాత రాజవాహనుడు శాండిల్య మహాముని ఆశ్రమానికి వెళ్ళినాడు. ఇతడువస్తాడని ఆ మునికి ముందుగా తెలియనే తెలియదు. అప్పుడు మధ్యాహ్న పూజా సమయమూ, భోజన సమయమున్నూ. రాజవాహనుడు సపరివారంగావచ్చి మహామునికి నమస్కరించగా, ఆయన క్షేమసమాచారాలు అడిగి, భోజనానికి ఆహ్వానించెను. మునియొక్క ఛాత్రులు బంగారు పళ్లెరాలూ, వాటి చుట్టూ అరటాకులూ వేసి, నీళ్ళు చల్లగా, యువతీమణులు వివిధపదార్థాలనూ వడ్డించారు. ఆ భోజనం మహారాజుల యిండ్ల భోజనంవలె వర్ణించబడింది. ఆ పళ్లెరాలూ మొదలైనవి రాజవాహనుడు తెచ్చినవో, లేక ఆశ్రమంలోనే ఉన్నవో తెలియదు. ఇది ఆకాలపు ఆశ్రమాల పద్ధతికి చాలా విపరీతంగా కానవస్తున్నది. ఇంతేకాక, వడ్డన చేస్తున్న యువతుల శృంగార వర్ణన అనౌచిత్యానికి చక్కని ఉదాహరణగా ఉన్నది. దేశ, పాత్రానుగుణంగా ఇట్టి వర్ణనను మూర్తికవి ఎందుకు కూర్చాడో?

(6) రాజవాహనునికి అవంతిసుందరి యవస్థను ఆమె చెలికత్తెయైన బాల చంద్రిక వివరించి తెల్పగా, అతడు—మూడునాలుగు దినాలలో మాళవరాజునకు తన పరాక్రమాన్నిచూపి, అవంతి సుందరిని పరిగ్రహిస్తానని చెప్పాడు. ఇందులోఉన్న కథనుబట్టి మగధ, మాళవరాజులకు ఎలాటి విరోధమూలేదు. ఇలాటి స్థితిలో రాజవాహనుడు రాయబారి మూలంగా తన కోరికను మాళవాధిపతికి తెలపడం మేలు. అతడు దానికి అంగీకరించనప్పుడే దాడి వెడలడం ధర్మం. అంతేకాని, మొదటనే యుద్ధానికి సిద్ధపడడం విరసతనే కలుగ జేస్తుంది. ఈ సందర్భంలో మాళవరాజు చేసిన పని కూడా సరిగా తోచదు. "అందితే జుట్టూ, అందకపోతే కాళ్ళూ' అనే పద్ధతిలో అతడు మొదట యుద్ధానికేసిద్ధమై, అపజయ సూచనలు కానరాగా, ప్రాధేయపడుతూ, రాజవాహనునికి తన కన్యనిచ్చి వివాహం చేస్తానని రాయబారం పంపడం బాగులేదు. ఆ రాయబారాన్ని మొదటే పంపివుంటే బాగా వుండేది.

మూర్తికవి ప్రాచీనప్రబంధాల ధోరణిలో వర్ణన ప్రధానంగా గ్రహించి యీ ప్రబంధాన్ని రచించడంవల్ల, ఇందులో కథాంశాన్ని గురించి, ఔచిత్యాన్ని గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకోలేదనీ, అందువల్లనే యిలాటి విషయాలు గ్రంథానికి ఎక్కినవనీ మనం భావించాలి. ఇలాటి అనౌచిత్యాలను ఒక ప్రక్కకు త్రోసి వేసి చూస్తే, రాజవాహన విజయం చక్కని ప్రబంధమని చెప్పవచ్చును.

మూర్తికవి పీఠికలో చెప్పుకున్నట్లు వివిధకవుల కవితాపద్ధతులు ఇందులో ప్రతిఫలిస్తూ ఉన్నవి. తత్సమ సుదీర్ఘసమాసాలను కూర్చడంలోనూ, దేశీయాలను గుప్పించడంలోనూ కూడా అందె వేసిన చెయ్యి. సమకాలికులు బహుళంగా వాడుతూఉన్న అన్యదేశ్యాలు ఇందులో అధికంగా కానవస్తున్నవి. ఆధునిక నిఘంటుకారులు తాము సంప్రతించిన గ్రంథాలలో ఈ రాజవాహన విజయాన్ని పేర్కొన్నా, ఇందలి చాలా పదాలు ముఖ్యంగా కొన్నిదేశ్యాలూ, అన్యదేశ్యాలూ, వాటిలో కానరావడంలేదు. శ్రీనందిరాజు—చలపతి రావుగారి లఘుటీక కొంత వరకూ ఉపయోగిస్తుంది. దీన్ని సమగ్రంగా అర్థం చేసుకోడానికి కొంత విపులమైన టీక ఎంతో అవసరం. కొన్ని పదాలకు అర్థం, ఎంతో ఆలోచించి వ్రాయవలసి ఉన్నది.

ఇప్పుడీ రాజవాహన విజయ ప్రతులు లభించడం కష్టం! ఇదివరకు ముద్రితమైన ప్రతిలో అచ్చు తప్పులు అధికంగా దొరలిఉండడంవల్ల అర్థావగతి కష్టతరంగా ఉంటుంది. కొన్నిచోట్ల పద స్వరూప నిర్ణయాలకే తికమకలు పడవలసి వుంటుంది. వాఙ్మయాభిమానులైన ఉదారులూ, ప్రకాశకులూ, భాషాసేవకై పాటుపడుతూవుండే సంస్థలూ ఈ ప్రబంధాన్ని సరియైన రీతిలో—విపుల టీకతో ప్రకటిస్తే వాఙ్మయానికి ఎంతో మేలు!

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1. Chief Editor : S. Sambhu Prasad.